# షేక్స్పియర్

## నాటక కథలు







అండవిల్లి సత్యనారాయణ

# Shakespeare Nataka Kathalu

BY :

ANDAVILLI SATYANARAYANA

First Edition-Oct. 1991

Price : Rs. 18/-



For Copies :

NAVODAYA PUBLISHERS
Eluru Road, Vijayawada-2

&

NEW STUDENTS BOOK CENTRE
VIJAYAWADA-2

*Printers :*

NAGARJUNA PRINTERS
*Vijayawada-2*

# సమర్పణ



పూజ్యులు, ఆప్తులు డా॥ పిన్నమనేని వెంకటేశ్వరరావుగారికి

భక్తిశ్రద్ధలతో...

# ఈ పుస్తకం గురించి. . . .

ప్రపంచ ప్రఖ్యాతి చెందిన నాటక రచయిత షేక్స్పియర్. ఈయన నాలుగు శతాబ్దాలకు ముందు వాడు. ఈయన రచించిన 37 నాటకాలు, కొన్ని వందల గేయాలు ("సానెట్సు") ప్రపంచాన్ని ఎంతగానో ప్రభావితం చేశాయి. ఇంతటి ప్రజాదరణ పొందిన నాటక కర్త మరొకడు ఏ సాహిత్య చరిత్రలోనూ మనకు కనపడడు. అతడి రచనలన్నీ ప్రపంచంలోని ముఖ్యమైన భాషలన్నిటిలోకి అనువదింపబడ్డాయి.

ఇంతకాలంగా పండిత పామరులందర్నీ వుర్రూతలూగిస్తున్న యీ మహా రచయిత జీవిత విశేషాలు ఏమిటి? ఇంతటి ప్రతిభకల వ్యక్తి నిజజీవితంలో ఎటువంటివాడు, ఎలా వుండేవాడు, ఎటువంటి వాతావరణంలో పెరిగేడు మొదలైన విషయాల గురించి తెలుసుకోవాలనే కుతూహలం కలగడం సహజం. కానీ అతన్ని గురించి తెలిసిన వివరాలు చాలా కొద్ది. అవి కూడా చాలా వరకు వూహాగానాలే. అసలు యీ నాటకాలన్నీ రచించింది షేక్స్పియరేనా, మరెవరైనా వ్రాసి యితని పేరు పెట్టారా అనే అనుమానం చాలా మందిలో కలిగింది. నిజానిజాలు తెలుసుకోవాలని ఎంతగానో ప్రయత్నంచేసి, విఫలులై చివరికి ఆ రచయిత పేరు ఏదైతేనేం, గులాబీ పుష్పాన్ని ఏ పేరుతో పిలిచినా దాని సువాసన ఎంతమాత్రం తగ్గదుకదా అని షేక్స్పియరే మరో సందర్భంలో అన్నమాటలు అతనికే అన్వయించుకుని, మనకి నాటకాలేకదా ముఖ్యమని సరిపెట్టుకోవలసి వచ్చింది, ఇంతకీ యిటువంటి అనుమానాలు రావడానికి కారణం షేక్స్పియర్ చదువు సంధ్యలు అంతగా లేనివాడు కావడమే. ఆ నాటికే ఎంతో ప్రసిద్ధి గాంచిన ఆక్స్ఫర్డు, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాల దరిదాపులకి కూడా ఆయన వెళ్ళినట్లు ఎక్కడా ఆధారాలు కనపడవు.

షేక్స్పియర్ చాలా సామాన్యమైన కుటుంబంలో "స్ట్రాట్ఫర్డు-ఆన్-ఏవన్" అనే వూళ్ళో 1564వ సంవత్సరంలో ఏప్రిలు 23న జన్మించాడు. ఆ వూళ్ళోని ఒక గ్రామర్ స్కూల్లో అతడి విద్యాభ్యాసం పూర్తయింది. కారణాంతరాలవల్ల తనకంటె ఎనిమిది సంవత్సరాలు

పెద్దదైన "ఆనీ హాతావే"ని తన 18వ ఏట వివాహం చేసుకోవలసి వచ్చింది. ఆమె ద్వారా సుసానా అనే అమ్మాయి, జూడిత్, హామ్నెట్ అనే కవలలు కలిగారు. అతి చిన్నవయస్సులోనే భార్యని, ముగ్గురు పిల్లల్ని పోషించవలసిన భారం పైన పడటంతో, జీవనోపాధికోసం లండన్ చేరుకున్నాడు. ఒక నాటక సమాజంలో చిన్న ఉద్యోగంలో చేరి కొద్దికాలంలోనే బాగా పైకి ఎదిగి నాటకాలు రచించడం మొదలెట్టాడు. నటుడికి, నాటక రచయితకీ కూడా సంఘంలో తగినంత గౌరవ స్థానం లేని రోజులవి. 1611 నాటికి లండన్‌లో కార్యకలాపాలన్నీ ముగించుకుని, స్ట్రాట్‌ఫర్డు చేరుకున్నాడు. 1616లో ఏప్రిలు 23న, సరిగ్గా 52వ ఏట పరమపదించాడు. ఇవీ మనకి షేక్స్పియర్‌ను గురించి తెలిసున్న వివరాలు.

మిగతా విషయాలన్నీ మనకెందుకు? షేక్స్పియర్ పేరు వినగానే వెంటనే స్ఫురణకి వచ్చే కొన్ని ముఖ్యమైన నాటకాలని తీసుకుని పరిశీలిద్దాం.

షేక్స్పియర్ నాటకాల్లోని కథల గురించి కొన్ని విషయాలు యిక్కడ చెప్పవలసి వుంది. ఆ కథలన్నీ చాలావరకు ఎక్కడనుంచో తీసుకున్నవే. ముఖ్యంగా అంతకు ముందే బహుళ ప్రచారంలో వున్న పుస్తకాల్లోంచి తీసుకున్నవే కానీ, తను స్వంతంగా కల్పన చేసినవి చాలా తక్కువ అనే చెప్పాలి. కొన్ని నాటకాల్లో రెండు మూడు కథలు కలిపి ఒక కథగా మలచిన సంఘటనలు కూడా కనపడతాయి. ఆ కారణంచేత నవలల్లో మాదిరిగా, షేక్స్పియర్ నాటకాల్లోంచి ఒక సమగ్రమైన కథని బయటకు తీయడం చాలా కష్టమైన పని. కొన్ని నాటకాల్లో చాలా చక్కని కథలే మనకు అందించినా, షేక్స్పియర్ కథకి అంతగా ప్రాధాన్యత యిచ్చినట్లు కనపడదు. ఆయన రచించిన నాటకాలు జీవితానికి ప్రతిబింబాలు. జీవితాన్ని అద్దంలో మనకి చూపించడానికి కథ ఎంతవరకు ముఖ్యమో అంతవరకే వుపయోగించుకున్నాడు.

అంటే షేక్స్పియర్ నాటకాలు అత్తుకుల బొంతలా? అటువంటివి

యింతకాలం ఎందుకు ప్రపంచ సాహిత్యంలో అత్యున్నత స్థాయిలో నిల బడ గలిగాయి అనే ప్రశ్నలు రావచ్చు. సమాధానంగా మనం చెప్పగలి గింది ఒక్కటే. షేక్స్పియర్ ప్రతిభ అనన్య సామాన్యమయినదే అయినా దానికి కూడా కొన్ని పరిమితులున్నాయి. ప్రతిభావంతుడు ప్రతి వాడు ప్రపంచంలోని అన్ని విషయాల్లో ఒకేవిధమైన అవగాహన, ప్రతిభ కలిగి వుండడు. షేక్స్పియర్ గొప్పతనం నాటక రచనల్లో పాత్ర చిత్రణలో, సమాజంలోని మంచీ, చెడునీ అద్దంలో మాదిరిగా మనముందుంచడంలో, భాషలో మనోవిశ్లేషణలో అనేక విషయాల్లో కన పడుతుంది. కథాకల్పన గురించి అంతగా పట్టించుకో లేదు. మంచి కథలనుకున్న వాటిని, ఎక్కడ దొరుకుతే అక్కడినుంచి తీసుకువచ్చి తనకి పనికివచ్చే విధంగా మలుచుకున్నాడు. కొన్నిచోట్ల రెండు మూడు కథలు కూడా జోడించాడు ఉదాహరణకి "మర్చెంట్ ఆఫ్ వెనిస్" నాటకాన్ని తీసుకోండి, అందులో ఒకటి రెండు కాదు. మూడు కథలున్నాయి. ఒక దానిలో మరొకటి ఎంతో చక్కగా అవి యిముడుకు పోయాయంటే మొత్తం నాటకం అంతా ఒక చక్కని కథగా మాత్రమే మనకి కనపడుతుంది ఎక్కడా అతుకులబొంతలా కనపడదు. అలాగే అన్ని నాటకాలలోనూ కూడా, అక్కడే షేక్స్పియర్ గొప్పతనం మనకి తెలుస్తుంది. నవలకీ, నాటకానికి వున్న ముఖ్యమైన తేడా యిక్కడే. నవలకి కథ చాలావరకు ప్రాణం. కథలో పటుత్వం లేకుండా ఏ నవలా నడవదు. అక్కడ కథ ప్రధానాంశం, నాటకాలకి కూడా కథ అవసరమే. కొందరు నాటక రచయితలు కథకే ఎంతో ప్రాముఖ్యం యిచ్చారు కూడా. కానీ షేక్స్పియర్ విషయంలో అలాకాదు,కథకు రెండోస్థానం యిచ్చాడు. అందుకే అతని నాటకాల్లో కథని పట్టుకోవడం అంత తేలికైన పని కాదు. కనుకనే చాలా తక్కువ మంది అటువంటి పనికి పూనుకున్నారు. అందులో ముఖ్యంగా చెప్పుకోదగినవారు ఛార్లెస్ మేరీలాంబ్ లు, కొంత వారి కల్పనా శక్తిని కూడా జోడించి, మధ్యలోని ఖాళీలను పూరించి, చదవడానికి వీలయ్యే పద్ధతిలో వారి కథా రచనసాగించారు. కొంతవరకు మాత్రమే వారిని ఆధారంగా తీసుకుని ఈ నాటక కథలు యిప్పుడు వ్రాయడానికి పూనుకోవడం జరిగింది

ప్రప్రథమంగా యీ కథలు వ్రాయడానికి అవకాశం కల్పించిన ఆకాశవాణి విజయవాడ కేంద్రం వారికి నా కృతజ్ఞతలు. డైరెక్టరు శ్రీ జి.కె. కులకర్ణిగారు, శ్రీ ఇంద్రకంటి శ్రీకాంతశర్మగారు నన్నెంత గానో ప్రోత్సహించి అడుగడుగునా అమూల్యమైన సలహాలిచ్చి నాచేత యీ కథలు యీ రూపంలో వ్రాయించారని చెప్పడంలో ఎంతమాత్రం అతిశయోక్తి లేదు, లేకపోతే నేనసలు వీటి జోలికే పోయివుండే వాణ్ణి కాదేమో కూడా, అదెంతటి కష్టమైన పనో తెలుసు కనుక. వ్రాయడం ఒకఎత్తు, వాటిని రేడియోలో శ్రోతలని ఆకట్టుకునేవిధంగా చదవడం మరొకఎత్తు. నేను చదవడానికిపూనుకోక, భగవంతుడిచ్చిన చక్కటి కంఠంతో ఏ కార్యక్రమంలో పాల్గొన్నా శ్రోతలని మంత్రముగ్ధులుగా చేయగల శ్రీ కోకా సంజీవరావుగారు చదవడంవల్ల నిజంగా వాటికి ప్రాణంపోసి అందరూ ఎంతో ఆసక్తితో ఎదురుచూసేట్లు చేయగలిగారని నా నమ్మకం. వారికి నా కృతజ్ఞతలు.

నాకంటె వయసులో చాలా పెద్దవారైనా నా యందు ఎంతో సోదరభావంతో అన్నివిషయాల్లోనూ ప్రోత్సహించి,ఎంతో ఆప్యాయంగా నన్ను దగ్గరకు చేర్చుకున్న అత్యుత్తమ శ్రేణికి చెందిన మేధావులు యిద్దరున్నారు. వారు శ్రీ పాటిబండ సుందరరావుగారు, డాక్టరు పిన్నమనేని వెంకటేశ్వరరావుగారు వారి వారి రంగాల్లో వారు నిష్ణాతులు. వారిలో ఒకరిమీద ఒకరికి ఎంతటి గౌరవం, స్నేహభావము వున్నాయో చాలా దగ్గరగా చూసే అదృష్టం నాకు కలిగింది. శ్రీ సుందరరావుగారికి నా "పాసింగ్ సీన్" పుస్తకాన్ని గౌరవ పురస్సరంగా అంకితం యిచ్చాను.

ఆప్తులు, పూజ్యులు డాక్టరు పిన్నమనేని వెంకటేశ్వరరావుగారు వృత్తిపరంగా ఆంధ్రదేశమంతటా పేరు - గాంచిన శస్త్ర చికిత్సా నిపుణులు. వారిని గురించి చాలా మందికి తెలియని విషయం, ఆయనకి కల సాహిత్యాభిరుచి. షేక్స్పియర్ నాటకాలని కొన్నిటినే వారు క్షుణ్ణంగా చదివినా, అతని గొప్ప రచనా నైపుణ్యాన్ని బాగా అవగాహన చేసుకున్న వ్యక్తి డాక్టరుగారు. వారితో కూర్చుని మాట్లాడ్డమే ఒక విజ్ఞాన

దాయకమైన అనుభూతి అనుకునే వాళ్ళు చాలామంది వున్నారు. అందులో నేనొకణ్ణి కావడంవల్ల యీ చిన్న పుస్తకాన్ని వారికి అంకిత మిద్దామనుకుని వారి ముందు యీ ప్రస్తావన తెచ్చినప్పుడల్లా వారు ఎంతమాత్రం వొప్పుకోలేదు. అతి కష్టంమీద వారిచేత సరేననిపించగల గడం నా అదృష్టంగా భావిస్తున్నాను.

చిరకాల మిత్రులు, సహృదయులు, శ్రేయోభిలాషి శ్రీ కాగొలను రంగారావుగారు (రావ్‌సన్స్ అధినేత) అనేకవిధాల నన్ను ప్రోత్సహించి యీ పుస్తక ప్రచురణకి సహకరించినందుకు నా ధన్యవాదాలు. నా రచనా వ్యాసంగంలో ఎన్నో సలహాలిస్తూ అనేక రకాలుగా వారి సహకారాలందిస్తూ వచ్చిన ప్రియమిత్రులు శ్రీ చెవుటూరి తాండవకృష్ణ గారికి, శ్రీ అక్కినేని బలరాం గారికి నా కృతజ్ఞతలు. నాకు అన్ని విషయాల్లోనూ చేదోడువాదోడుగా వుంటూ కొండంత అండగా నిలిచిన మా అన్నగారు శ్రీ సూర్యనారాయణ (రిటైర్డ్ ఇన్‌కమ్ టాక్స్ ఆఫీసరు) గారికి నేనెంతగానో ఋణపడి ఉన్నాను.

ఈ పుస్తకానికి పరిచయవాక్యాలు వ్రాయమని శ్రీమాన్ సి. రాఘవాచారిగారిని అడిగిన వెంటనే ఆయన అంగీకరించారు. ఆయన నాకు చాలా ఆప్తుడు. అందువల్ల నేను ఆయన్ని గురించి ఏమి చెప్పాలో నాకే అర్థం కావటంలేదు. ఆయన అజాత శత్రువు, స్నేహశీలి, మేధావి, గొప్ప వక్త. ఇలా ఎన్నైనా చెప్పుకుంటూ పోవచ్చు. కాని ఒక్క మాటలో చెప్పాలంటే ఆయన ఆంధ్రులు గర్వించదగ్గ వ్యక్తి.

షేక్స్పియర్ నాటకాలు కొన్నైనా చదివి వాటిని బాగా ఆకళింపు చేసుకున్నవారికోసం కాదు ఈ పుస్తకం, అతని పేరు మాత్రమే విని అతని గొప్పతనం ఏమిటో తెలియక, తెలుసుకుందామనే కుతూహలం కలవారిని కొందరినైనా యీ కథలు షేక్స్పియర్ నాటకాలని జాగ్రత్తగా చదవడానికి పురిగొల్పితే నాకు కొంత సంతృప్తి కలుగుతుంది. అది తప్పక నెరవేరుతుందనే నా ఆశ.

# అభినందన

నాటకాంతం హి సాహిత్యం అన్నది ప్రసిద్ధమైన సూక్తి. అన్ని భాషా సాహిత్యాలకూ సార్వజనీనంగా వర్తించే సూక్తి యిది. కాని ప్రపంచ భాషా సాహిత్యాల్లో ఆంగ్లనాటక రచయిత షేక్స్పియర్ విషయంలో యిది స్వభావోక్తి. కవులుగా, పండితులుగా, నవలాకారులుగా నాటకకర్తలుగా పరిపరివిధాల ప్రశస్తికెక్కిన ప్రపంచ సాహితీవేత్తల్లో అందరికీ మిన్నగా—శిఖరాయమానమైన స్థానమందు, షేక్స్పియర్‌ను నాటకం శాశ్వతంగా నిలబెట్టింది. మన సంస్కృత మహాకవి కాళిదాసు గొప్ప రచయిత కూడా అయినందున ఆయన ప్రతిభకు శాకుంతలాది నాటకత్రయమే ఏకైక కారణంగా చెప్పడం సాధ్యంకాదు. కాని గేయాలు, సోనెట్స్ లాంటివి మరికొన్ని కృతులున్నా షేక్స్పియర్ నాటకానికి పర్యాయపదంగా ప్రాచుర్యంలో కొచ్చిన విధానం అచ్చెరువు గొలుపుతుంది.

షేక్స్పియర్ 36-37 నాటకాలు వ్రాసినట్లు ఆయన జీవిత—సాహిత్యాలపై సాధికార కృషి జరిపిన ప్రమాణిక విమర్శకులు నిర్ధారిస్తున్నారు. విస్తృతిలో, వైవిధ్యంలో, దేనికదే ఓహూ అనిపించే వైశిష్ట్యంలో షేక్స్పియర్ ప్రతిభా విశేషాలు సహస్రముఖంగా ఈ నాటకాల ద్వారా అభివ్యక్తమయ్యాయి. తన జాతి కథల్ని, యింతగా అభిమానించి నాటకీయమైన కావ్యాలుగా మలచిన ఆ మహనీయుని శిల్పం, కల్పన, కథనం, పాత్ర చిత్రణ, సంభాషణా విన్యాసం, అన్నిటికి మించి లోకజ్ఞత— లోకానుభవం సమకాలీన ఆంగ్ల సమాజానికి దర్పణంగానే కాక ఆంగ్ల ఐతిహాసిక, చారిత్రక అంశాలకు సృజనాత్మకమైన రూపుకట్టి కాలంతోబాటు తరగని సాహిత్యసంస్కారంతో సింగారాలు దిద్దింది. ఎన్నో లోకవృత్తాలు, మానవ ప్రవృత్తుల పరస్పర సంఘర్షణల్ని అచ్చుపోసినట్లు సృష్టించిన ఆ ప్రతిభ అనన్యసామా

న్యమే మరి! అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతి! అనికదా ఆలంకారికుల మతం.

నాటకాలన్నీ యితివృత్త పరంగా, శిల్పరీత్యా, కవితామయమైన సంభాషణా కూర్పు దృష్ట్యా ఒకే విధంగా ప్రసిద్ధమైనవని చెప్పడం దుస్సాహసమేకాని షేక్స్పియర్ వ్రాసినన్ని నాటకాలు ఎవరన్నా వ్రాసినా అందులో యింతగా లోక విఖ్యాతి పొందినవి వుండడంమాత్రం అసాధ్యమనిపిస్తుంది. ఇప్పటికి నాలుగు శతాబ్దాలుగా ఆంగ్ల సాహిత్యాభిమానులేకాక ప్రపంచ సారస్వత ప్రియుల్ని యింతగా ఆకట్టుకొన్న కనికట్టు విద్య ఈ నాటకకర్తకు మాత్రమే సాధ్యమైంది. సమకాలీమలైన పండిత ప్రకాండులు— ప్రత్యేకించి బెన్ జాన్సన్— షేక్స్పియర్కు కొద్దిగా లాటిన్, అంతకు కొద్దిగా గ్రీక్ మాత్రమే వచ్చునని అధిక్షేపించిన విషయం ఆంగ్లసాహిత్య చరిత్ర తెలిసిన పెద్దలకు చెప్పనక్కర్లేదు. ఆంగ్ల నాటక రచయితల్లో ముందేమోకాని తర్వాత ఎందరో— ఇబ్సెన్, బెర్నార్డ్‌షా ప్రభృతులు— ప్రసిద్ధికెక్కారు. కాని అందరిలోనూ అరుదైన స్థానం తిరిగి షేక్స్పియర్‌దే. ఈ విశేషాలు వివరాలపై ఆసక్తి వున్న రసజ్ఞులు ప్రామాణికుల గ్రంధాలు చదివి ఆనందించవలసిందే! అందుకీ పుస్తకం ఏమాత్రం తోడ్పడినా అండవిల్లి శ్రమ నిష్ప్రయోజనం కాదు!

ప్రకృతమింత విస్తరంగా ఉపోద్ఘాతానికి తక్షణ ప్రేరణ మిత్రులు, ఆంగ్లాంధ్ర భాషా పండితులు అండవిల్లి సత్యనారాయణగారు షేక్స్పియర్ నాటకాల్లోని పదమూడింటిని (పాశ్చాత్యులకు 13 అచ్చొచ్చేది కాదంటారే) ఎన్నుకొని వాటిల్లోని కథాంశాలను తెలుగు పాఠకుల కందించాలన్న సంకల్పమని సహృదయులకు విన్నవించుకోడం నా విధి. "కథాలహరి" శీర్షికన కొంతకాలం క్రితం ఆకాశవాణి, విజయవాడ కేంద్రం ద్వారా తెలుగు శ్రోతల్ని అమితంగా అలరించి ఆకట్టుకొన్న

ధారావాహిక కథనా సంపుటిని పాఠకుల సౌలభ్యం దృష్ట్యా పుస్తకంగా వెలువరించడానికి అండవిల్లి మహాశయులు సంకల్పించడం ఏ సాహిత్యాభిమాని ప్రశంసలకు పాత్రం కాదు? మూడు దశాబ్దాలకు పైగా మద్రాసు, గుంటూరు, విజయవాడల్లోని ప్రసిద్ధ కళాశాలల్లో (వివేకానంద, ఎ. సి., యస్. ఆర్. ఆర్. అండ్ సి. వి. ఆర్. కళాశాలల్లో) ఆంగ్లభాషా సాహిత్యాలు అభిమాన విషయాలుగా స్వీకరించిన తరతరాల విద్యార్థులకు షేక్స్పియర్ సారస్వత సాగరాన్ని మథించి అమృతమయమైన సాహిత్యాభినివేశాన్ని, అధికారాన్ని స్వాయత్తం చేసుకొన్న అధ్యాపకులు అండవిల్లి. తమదైన ఈ సాహిత్య సంపదను పదిమందికి పంచడంలోనే కదా ప్రాజ్ఞులకు అనురక్తి, ఆనందం. ఉద్యోగవిరమణతో కలిగిన అవకాశాన్ని జారవిడుచుకోకుండా ఆ కథల్ని ఆకర్షవంతముగా విస్తృత తెలుగు శ్రోత పాఠక శ్రేణులకు ఈ రూపంలో అందచేస్తున్నందుకు అండవిల్లి వారెంతైనా అభినందనీయులు.

షేక్స్పియర్ నాటకాల్లో సన్నివేశ కల్పన, పాత్ర చిత్రణ, సంభాషణా చాతుర్యం వంటి విశేషాల గ్రహణంలో కథాంశం కాస్త నీరసంగా సాగుతుంటుంది. ఆయన ప్రబంధాల్లో కథది నాయికల శౌత్రోచరి స్థానమే. అందునా అన్వయ క్లిష్టతలు పూరించవలసిన ఖాళీల గజి బిజి చాలా వుంది. కథల కోసం తన నాటకాలు ఎవరు చదువుతారులే అన్న భావం షేక్స్పియర్‌కున్నా అర్థం చేసుకోవచ్చు. కాని యిన్ని ప్రయాసలతో ఆ నాటకాల్లోని యితివృత్త విశేషాలను – లోకోత్తరమైన నాటక శిల్పం ధాటికి కొట్టుకుపోకుండా–చెప్పదలచినవారి ప్రయత్నాలను వివేచనాపరులైనవారు సానుభూతితో అర్థం చేసుకోవాల్సి వుంటుంది. ఇది అండవిల్లివారే స్వయంగా ముందు శ్రోతల, పాఠకుల దృష్టికి తెచ్చిన విధానమూ ప్రశంసార్హం. భారతంలో వున్నదీ ప్రపంచంలో లేనిదీ, ప్రపం

చంలో వున్నదీ భారతంలో లేనిదీ చెప్పడం కష్టమని మన పెద్దలు చెబుతుంటారే అది షేక్స్పియర్ నాటకాలకూ బాగా అన్వయిస్తుంది. కథాంశాలకు సంబంధించిన ఈ చిక్కులున్నా అండవిల్లివారి కథనం అచ్చంగా నూరుపైసల తెలుగు నుడికారంతో సాగింది. ఆకాశవాణిలో ప్రసారమైనప్పుడు ప్రశ్నల ద్వారా శ్రోతల ప్రతిస్పందనే అందుకు నిదర్శనం. **All honest Shakespearians are advancing the good cause** అని ప్రొ॥ కె. ఆర్. శ్రీనివాసయ్యంగార్ వేరే సందర్భంలో చెప్పింది వీరికీ నప్పుతుంది.

ఇంతలింతలు చెప్పి పాఠకుల సహనాన్ని పరీక్షించడం మర్యాద కాదు. అండవిల్లి వారు ఈ పుస్తకాన్ని విజయవాడ నగర ప్రముఖుల్లో తన కత్యంత ఆదరణీయులుగా పరిగణించే ప్రసిద్ధ వైద్యులు డాక్టర్ పిన్నమనేని వెంకటేశ్వరరావుగారికి అంకితమివ్వాలనుకొన్న సంకల్పం ఉగ్గడించదగింది. ఐదు దశాబ్దాలు వృత్తిరీత్యా, ప్రవృత్తిరీత్యా అగణిత సంఖ్యలో ఈ ప్రాంతాలలో అభిమానుల్ని పొందగలిగిన డా॥ పిన్నమనేనికి పరిమాణంలో చిన్నదైనా పరిమళంలో బహుదొడ్డదీ బహుకృతి. అందుకు డాక్టరు గారంగీకరించడం కృతికర్త అండవిల్లి సుకృతి.

అండవిల్లి వారికి ఈ పుస్తకం ప్రచురించడంలో కారకులై తోడ్పడిన ఆకాశవాణి నిర్వాహకులు, స్టూడెంట్ బుక్ సెంటర్ అధినేత, "అభినందన" మిత్రుడు బి. బాబ్జీ, యిలా ఎందరెందరో మహానుభావులున్నారు. వారందరికీ అభివందనాలు. నాకు ఈ నాలుగు ముక్కలు చెప్పే అవకాశ మిచ్చిన అండవిల్లికి సాదర కృతజ్ఞలు.

4-10-1991
విజయవాడ

సి. రాఘవాచారి
విశాలాంధ్ర

# "వెనిస్ వ్యాపారి"
# Merchant of Venice

వెనిస్ మహా నగరం పెద్ద వ్యాపార కేంద్రం. అక్కడ ఎందరో సంపన్నులయిన వ్యాపారస్తులు వున్నారు. వారిలో ఆంటోనియో అనే వ్యాపారి చాలా ముఖ్యుడు. మంచికి మారు పేరుగా, చాలా మందికి తల్లో నాలికలా అతడు ఆ పట్టణంలో జీవనం సాగిస్తున్నాడు. అతడు అగర్భ శ్రీమంతుడు కూడా. అతనికి బసానియో అనే ఒక ప్రాణ స్నేహితుడు ఉన్నాడు. అతను చాలా మంచి కుటుంబానికి చెందిన వాడు. అందగాడు, కాని అతను డబ్బు విచ్చలవిడిగా ఖర్చుచేసే స్వభావం కలవాడవడంవల్ల ఎప్పుడూ డబ్బుకు యిబ్బంది పడుతూనే వుంటాడు. ఆంటోనియోకి అతని మీద అపరిమితమయిన ప్రేమ వుండడంవల్ల ఎప్పుడూ కావలసిన డబ్బు సహాయం చేస్తూనే వుంటాడు.

ఇదిలా వుండగా బసానియో ఒక గొప్ప వంశానికి చెందిన పోర్షియా అనే సౌందర్యవతియైన యువతిని ప్రేమించాడు. ఆమె ఎంతో గుణవంతురాలు, తెలివయినదీ కూడా. వెనిస్‌కి ప్రక్కనే వున్న

బెల్మాట్‌లో ఆమె నివాసం. పోర్షియా తండ్రి బ్రతికి వున్నప్పుడు బసానియో వారింటికి తరుచు వెళుతూ వుండేవాడు. అపుడు పోర్షియా కూడా బసానియో అంటే ఎంతగానో ప్రేమాభిమానాలు కనపరచేది. సిరి సంపదలతో తుల తూగుతున్న పోర్షియావంటి అందగత్తెను వివాహ మాడాలంటే బసానియో కూడా ఆమెకు తగిన విధంగా, అనేక మంది సేవకులతో, ఎంతో ఘనంగా వెళ్ళాలి. దానికి చాలా డబ్బు కావాలి. అందుకు ఆ ప్తమిత్రుడు ఆంటోనియో దగ్గరకు వెళ్ళి విషయమంతా చెప్పాడు. బసానియో కోసం ఏపనైనా చేయడానికి ఆంటోనియో సిద్ధమే. కాని ఆ సమయంలో బసానియో అడిగినంత ధనం సిద్ధంగా లేదు. అత నికి ఎలా సహాయం చేయాలో తోచలేదు. పరి పరివిధాల ఆలోచించాడు. ఇక చేసేదేది లేక ఆ వూళ్ళోనే వుంటున్న ఒక వడ్డీ వ్యాపారి షైలాక్ దగ్గరికి వెళ్ళి డబ్బు తీసుకోవడానికి సిద్ధ పడ్డాడు.

షైలాక్ ఒక 'జ్యూ', అంటే యూదు అనబడే ఒక జాతికి చెందిన వాడు, షైలాక్ ఎక్కువ వడ్డీకి డబ్బు అప్పు యిచ్చి చాలా నిర్దాక్షిణ్యంగా వసూలు చేయడం, అప్పు తీర్చలేని వారిని కారాగారానికి పంపడం వంటి పనులకి కూడా ఏమాత్రం వెనుకాడని వాడు. ఆంటోనియో అలా కాకుండా స్నేహితులకి అవసరంలో వున్నప్పుడు వడ్డీ లేకుండా ధన సహాయం చేస్తూ వుంటాడు. ఆ కారణంచేత షైలాక్‌కి, ఆంటోనియోకి బద్ధ వైరం. అదే కాకుండా ఆంటోనియో క్రిస్టియను, షైలాక్ జ్యూ. క్రిస్టియన్లు, 'జ్యూలు' ఆ జన్మ శత్రువులు. వారిద్దరి మధ్య పచ్చగడ్డి భగ్గుమంటుంది, షైలాక్ 'రియాల్టో'లో ఎప్పుడు కనపడినా ఆంటోనియో అవమానపరచి తిడుతూంటాడు. అందువల్ల షైలాకుకి కూడా ఆంటోనియో అన్నా, మిగతా క్రిస్టియన్లు అన్నా ఎంతో కోపం. ఎప్పుడైనా అవకాశం దొరికితే కక్ష తీర్చుకోవాలనే వుద్దేశ్యం కూడా హృదయంలో బాగా నాటుకు పోయింది.

అలాంటి షైలాక్ దగ్గరకి బసానియోని తీసుకొని ఆంటోనియో వచ్చాడు. తన స్నేహితుని కోసం తనకు యిష్టం లేకపోయినా రావలసి వచ్చిందనీ, తన డబ్బు యితర దేశాలకి వస్తువులు తీసుకొని వెళ్ళిన ఓడలు తిరిగి రావడంతోనే చేతికి అందుతుందనీ, అపుడు వడ్డీతోసహా తీర్చివేస్తానని ఆంటోనియో చెప్పాడు. "నీ ఓడలన్నీ సురక్షితంగా తిరిగి వస్తాయని నమ్మకమేమిటి? తుఫానులు రావచ్చు, దొంగలు దోచుకు పోవచ్చుకదా." అన్నాడు షైలాక్. కాని ఒక షరతు కోరాడు. అదిచాలా చిన్న షరతే. కేవలం తమాషాకే అలా కోరుతున్నానన్నాడు.ఇస్తానన్న మూడు నెలల్లో డబ్బు యివ్వలేక పోయినట్లయితే తన శరీరంలో ఏ భాగం నుంచయినా ఒక పౌను మాంసాన్ని తీసుకోవడానికి వీలుగా ఒక ఒప్పందం మీద సంతకం పెట్టమన్నాడు. బసానియోకి ఎంతో కోపం వచ్చింది. డబ్బు యివ్వకపోయినా ఫరవాలేదు కాని అటువంటి హామీ పత్రంమీద తన కోసం ఆంటోనియో సంతకం చేయడానికి ఒప్పుకోడు. ఆంటోనియో ఆ షరతు గురించి భయపడవలసిన అవసరం ఎంతమాత్రం లేదని, తన డబ్బు ఏ క్షణాన్నయినా చేతికి అందడం ఖాయమని బసానియోకి నచ్చచెప్పి సంతకం చేసి డబ్బు తీసుకున్నాడు.

ఆ డబ్బుతో, బసానియో చాలా ఖరీదైన దుస్తుల్లో, ఎంతోమంది పరివారంతో, ఘనంగా బెల్మాంటుకి బయలుదేరాడు. పోర్షియాని తప్పక వివాహమాడగలననే ఆత్మవిశ్వాసంతో ఉన్నాడు. అక్కడ పోర్షియా తండ్రి, తన కూతురి డబ్బుకి ఆశపడి కాకుండా, ఆమె మీద నిజమైన ప్రేమగల యోగ్యుడైన వాడే వివాహమాడడానికి వీలుగా కొన్ని కట్టుదిట్టాలుచేసి పోయాడు. బంగారు, వెండి, సీసపు పెట్టెల్లోని ఒకదానిలో పోర్షియా బొమ్మను వుంచి ఎవరయితే సరైన పెట్టెను తెరుస్తారో, వారు మాత్రమే పోర్షియాని వివాహం చేసుకోవచ్చునని, యీ పరీక్షలో ఓడి

పోయినవారుజీవితంలో ఎవ్వరినీ పెళ్ళిచేసుకోననే వాగ్దానం చేసిన తరువాతే ఈఎంపికకి సిద్ధ పడాలని ఏర్పాటు చేసాడు. దేశదేశాల నుంచి పోర్షియా అందాన్ని గురించి విని, ఎందరో ధనవంతులు, రాకుమారులు వచ్చారు కొందరు విధించిన కఠినమయిన షరతులు తెలుసుకొని పరీక్షకి సిద్ధపడకుండానే వెళ్ళిపోయారు. ఒకరిద్దరు సిద్ధపడి ఓడిపోయి నోరు మెదపకుండా వెళ్ళిపోయారు. అందుకు పోర్షియా కూడా చాలా సంతోషించింది.

బసానియో వచ్చి, జాగ్రత్తగా ఆ పెట్టెలమీద వున్న విషయాల్ని పరిశీలించి, వాటి వెనుకనున్న అంతరార్థం గ్రహించి చివరికి సీసపు పెట్టెను తెరిచాడు. అతని విజయానికి పోర్షియా ఆనందం పట్టలేకపోయింది. తన కిష్టంలేని వారెవరో్న కాకుండా తను ప్రేమించిన బసానియోనే వివాహమాడబోతున్నందుకు పుష్పాంగిపోయింది. వెంటనే తన చేతికి ఉన్న వుంగరంతీసి బసానియోకిస్తూ, ఆ వుంగరంతోపాటుగా తన పరిచారకులను, తన యావదాస్తిని, తనని కూడా అతని పరం చేస్తున్నట్లు చెప్పింది. ఆ వుంగరాన్ని ఎప్పుడూ తన చేతికే వుంచుకోవాలని, అలా చేయని పక్షంలో బసానియోకి తనమీద ప్రేమలేనట్లేనని అనుకోవలసి వుంటుందని కూడా చెప్పింది. తన మృత్యు సమయంలోనే తన చేతి నుంచి ఆ వుంగరాన్ని వేరు చేయగలనని వాగ్దానం చేశాడు.

ఇదిలా వుండగా బసానియోతో కూడావచ్చిన అతని స్నేహితుడు గ్రేషియానో, పోర్షియా అంతరంగిక చెలికత్తె నెరిస్సా, ముందుకువచ్చి బసానియో, పోర్షియాలని అభినందించారు. వారిద్దరూ కూడా ఎంతో కాలంగా ప్రేమించుకున్నామని, ఈ శుభసమయంలోనే వారిద్దరూ భార్యాభర్తలు అవడానికి అనుమతించవలసినదని కోరారు. వెంటనే దానికి

సంతోషంతో అంగీకరించారు. నెరిస్సా, గ్రేషియానోకి ఒక వుంగరం యిస్తూ దానిని జీవితాంతం ధరించాలని కోరింది.

అందరూ ఆనందంగా వున్న సమయంలో పిడుగులాంటి వార్త వచ్చిపడింది. ఆంటోనియో, బసానియోకి తన పడవలన్నీ సముద్రంలో సర్వనాశనమయి పోయాయని, తను షైలాక్‌కి యివ్వవలసిన ధనం గడువు తేదీలోపుల యిచ్చుకోలేకపోవడం మూలంగా, ఒప్పుకున్న షరతు ప్రకారం తన ప్రాణాన్ని పోగొట్టుకోవడం తప్ప చెయ్యగలిగినది ఏదీ లేదని, తను మరణించే ముందు ఒకసారి బసానియోని చూడాలని వుందని కబురు పంపించాడు. ఆ వార్తవిని బసానియో నిలువునా నీరై పోయాడు. ఇంతకాలం తన స్నేహితుని గురించి ఆలోచించ లేకపోయి నందుకు చింతించాడు. పోర్షియాకి జరిగినదంతా చెప్పాడు. తనకి పోర్షియాతో వివాహమవడానికి సహాయం చేసిన తన ఆప్తమిత్రుడి ప్రాణాలకే తన మూలంగా ముప్పు వచ్చిందని బాధపడ్డాడు.

ఆంటోనియోని ఎలాగైనా రక్షించాల్సిన అవసరం వుందని, బసానియోని వెంటనే కావలసినంత ధనం తీసుకొని వెనిస్‌కి బయలుదేరి వెళ్ళమని పోర్షియా కోరింది. బయలుదేరి వెళ్ళేముందు, బసానియో, పోర్షియాలకి, గ్రేషియానో, నెరిస్సాలకి వివాహ కార్యక్రమాలు కూడా హడావుడిగా పూర్తిచేసారు. బసానియోని పంపించిన తరువాత పోర్షియా తీవ్రంగా ఆలోచించింది. తన భర్త ప్రాణస్నేహితుడిని ఎలాగైనా కాపాడాలి. వెంటనే మెరుపులా ఒక ఆలోచన తట్టింది. తన దగ్గరి బంధువు డాక్టర్ బలారియో చాలా పేరుపడ్డ లాయరు. ఈ పరిస్థితులలో ఏం చేయాలో సలహా యివ్వమని బలారియో దగ్గరకి మనిషిని పంపించింది. తన సలహాతో పాటు, లాయరు గౌను కూడా పంపమని రాసింది. బలారియో ఆమె కోరిన విధంగా చేశాడు. వెంటనే తను, నెరిస్సా కూడా

లాయరు, లాయరు గుమాస్తా దుస్తులు వేసుకొని వెనిస్‌కి బయలు దేరారు.

వెనిస్‌లోకి డ్యూక్ కోర్టులో కేసు విచారణ ప్రారంభమయింది· సమయానికి బసానియో, గ్రేషియానో చేరుకున్నారు. మొదటగా డ్యూక్ షైలాక్‌ని ఆంటోనియో నుంచి పౌను మాంసం కోసం పట్టుపట్టవద్దని, డబ్బు తీసుకొని అంటోనియోని వదలివేసి తన మంచితనాన్ని నిరూపించు కోమని కోరాడు. షైలాకు వినలేదు, బసానియో రెట్టింపు ధనం యివ్వ డానికి సిద్ధపడ్డాడు. షైలాకు ఒప్పుకోలేదు. నాకు కావలసినది పౌను మాంసం మాత్రమే కాని డబ్బు కాదన్నాడు. చట్టం కూడా నాకు అనుకూ లంగా వుందన్నాడు. డ్యూక్‌కి ఆంటోనియో మీద జాలి కలిగింది. కాని అతను నిస్సహాయుడు. డాక్టర్ బలారియో అనే గొప్ప ప్రజ్ఞావంతు డయిన లాయరు వస్తున్నాడని తెలిసింది. అయినా అతను మాత్రం ఏం చేయగలడు అనుకున్నాడు. ఇంతలో డాక్టరు బలారియో, తన స్నేహి తుడు డాక్టరు బాల్తసార్‌ను పంపుతున్నానని, అతడు తన స్థానంలో విచారణలో పాల్గొంటాడని వుత్తరం పంపాడు. డ్యూక్, బాల్తసార్‌కి ఆంటోనియో తరపున వాదించడానికి అనుమతించాడు.

మొదటగా షైలాకుని బాల్తసార్ ఆంటోనియోకి దయాభిక్ష పెట్ట మన్నాడు. మానవులపై మనం కనికరం చూపిస్తే, భగవంతుడు మనకు ఎంతో మేలు చేస్తాడన్నాడు. కరుణ చూపించిన వారికి, కరుణ పొందిన వారికి కూడా భగవంతుడి ఆశీస్సులు వుంటాయన్నాడు. ఎన్నో మంచి మాటలు చెప్పినా షైలాకు చలించలేదు. అతడి గుండె కరుగలేదు. తనకి చట్టరీత్యా రావలసినది మాత్రమే కావాలని పట్టుబట్టాడు. లాయరు మరొకసారి ఆంటోనియో పది రెట్లు డబ్బు యివ్వడానికి సిద్ధంగా వున్నా డని, అది తీసుకుని అతణ్ణి ప్రాణాలతో విడిచి పెట్టమని కోరాడు.

లాభం లేకపోయింది. చివరికి చట్టరీత్యా షైలాకుకి ఆంటోనియో శరీరంలో ఒక పౌను మాంసం తీసుకునే అధికారం సంక్రమించిందని అందువల్ల ఆంటోనియో ఆ పనికి సిద్ధపడవలసిందని చెప్పాడు. ఇది విని షైలాకు ఆనందంతో గంతువేశాడు. సాక్షాత్తు డానియలే లాయరు రూపంలో వచ్చాడని పొగిడాడు. షైలాకు ఆంటోనియో హృదయం దగ్గరి నుంచి ఒక పౌను మాంసం తీసుకోవడానికి, కత్తి నూరుకొని ఆంటోనియో దగ్గరికి వచ్చాడు.

ఆ సమయంలో లాయరు, షైలాకును ఒక నిముషం ఆగమని, తనతో శస్త్రనిపుణుడిని ఎవరినయినా తీసుకొని వచ్చావా అని అడిగాడు. లేకపోతే రక్తంపోయి ఆంటోనియో మరణించవచ్చు కదా, అని అన్నాడు. షైలాకుకు కావలసినది కూడా అదే కనుక, ఆ విధంగా ఒప్పందంలో ఎక్కడా లేదే అన్నాడు. లాయరు బాండులో లేకపోయినా మానవతా దృష్టితో అలా చేయాలన్నాడు. షైలాకు అందుకు సమ్మతించ లేదు. బాండులో లేనిది తను ఎందుకు చేయాలన్నాడు. అపుడు లాయరు షైలాకుని మాంసం తీసుకోమని, అందుకు చట్టం అనుమతిస్తుందని చెపుతూ, అలా మాంసం తీసుకునేటప్పుడు ఆంటోనియో వంటి నుండిఒక చుక్క నెత్తురుకూడ క్రిందపడకూడదన్నాడు. అలాజరిగినట్లయితే నష్టపరిహారంగాతనఆస్తి నంతటిని కోల్పోవలసి వస్తుందన్నాడు. అదా చట్టమని షైలాకు ప్రశ్నించాడు. బాండు ప్రకారం అతనికి మాంసమే కాని నెత్తురు తీసుకునే హక్కులేదని, అదే చట్టమని లాయరు చెప్పాడు.

కోర్టులో అంతా నిశ్చేష్టులయారు. గ్రేషియానో షైలాకు మాటలే అతనికి అప్పచెప్పాడు. సాక్షాత్తు డానియలే లాయరు రూపంలో వచ్చాడన్నాడు. షైలాకు నోటమాట రాలేదు. బసానియో వైపు తిరిగి పదింతలు డబ్బు యిస్తానన్నావు కదా, యిస్తే వెళ్ళిపోతానన్నాడు. లాయరు

ఆలా వీలు లేదన్నాడు. నిండు కోర్టులో నిరాకరించాడు. కనుక ఆ డబ్బు యిప్పుడు యివ్వవలసిన అవసరం లేదన్నాడు. "అయితే, నేనిచ్చిన డబ్బైనా సరే తిరిగి యిచ్చి నన్ను వెళ్ళిపోనివ్వండి" అన్నాడు. అది కూడా వీలు లేదన్నాడు లాయరు. షైలాక్ ఎంతో క్రుంగిపోయి, వెళ్ళి పోవడానికి సిద్ధమవుతూ వుంటే, లాయరు మళ్ళీ ఆపి, ఇది తోటి మానవుడి ప్రాణం తీయడానికి పన్నిన కుట్ర కనుక డ్యూక్‌ని ప్రాణభిక్ష పెట్టమని కోరుకోమన్నాడు. డ్యూకు క్షమించి, షైలాకుని ప్రాణాలతో వదలి వేస్తూ తన ఆస్తి సగం ఆంటోనియోకి, మిగిలిన సగం దేశానికి చెందుతుందని తీర్పిచ్చాడు. ఆంటోనియో తనకు రావలసిన సగం ఆస్తికి,తను క్రీస్టియనుగా మారేటట్లయితే షైలాకు వుంచుకోవచ్చునన్నాడు. దీనితో షైలాకు పూర్తిగా పతనమయిపోయి, నడిచే పరిస్థితి కూడాలేక, తన సంతకాలకి కాగితాలు తరువాత పంపమని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆంటోనియో, బసానియోలు సంతోషంగా లాయరు బాల్తసార్ దగ్గరికి వచ్చి, తమకృతజ్ఞత తెలియపరుస్తూ, వారి సంతృప్తికోసం బహుమానంగా ఏదైనా తీసుకోమని కోరారు. అతను ఏదీ వద్దన్నాడు. బలవంతం చేసిన మీదట బసానియో చేతినవున్న వుంగరం చూసి దాన్ని యిమ్మన్నాడు. బసానియోకి ఏం చెప్పాలో తోచక కంగారు పడ్డాడు. బసానియో వెనకాడడం చూసి లాయరుకి కోపం వచ్చింది. అప్పుడు ఆంటోనియో కలగచేసుకొని, పోర్షియాకి ఎటువంటి పరిస్థితులలో ఉంగరం యివ్వవలసి వచ్చింది, తను సర్ది చెప్పగలనని ఆ వుంగరం లాయరుకి యివ్వమని చెప్పాడు. ఇంతవరకు వచ్చాక బసానియో కూడా కాదనలేక పోయాడు. వుంగరం తీసిచ్చాడు. అదేసమయములో లాయరు గుమస్తా కూడా గ్రేషియానో దగ్గరనుంచి వుంగరం బహుమతిగా తీసుకున్నాడు. అందరూ సంతోషంగా ఎవరిదారిన వారు బయలు దేరి వెళ్ళిపోయారు.

బెల్మాంట్‌లో పోర్షియా, నెరిస్సాలు బసానియో, గ్రేషయానో లని, ఆంటోనియోని సాదరంగా ఆహ్వానించారు. వెనిస్‌లో జరిగిన విషయాలన్నీ మాట్లాడుకుంటూ వుండగా, మరొక మూల గ్రేషియానో, నెరిస్సాలు పోట్లాడుకుంటూ వున్నారు—కారణమేమిటని అడిగితే నెరిస్సా తను గ్రేషియానో కిచ్చిన వుంగరం ఎవరో స్త్రీకి యిచ్చి వేశాడని చెప్పింది. గ్రేషియానో తను ఏ స్త్రీకి యివ్వలేదని, లాయరు గుమాస్తాకే యిచ్చానని చెప్పాడు. అప్పుడు పోర్షియా తను కూడా బసానియోకి వుంగరం యిచ్చానని, గ్రేషియానో లాగ బసానియో మాత్రం అలాంటి తప్పుపని చేయడని అంటుంది. గ్రేషియానో తనలాగే బసానియో వుంగరాన్ని లాయరుకి బహుమానంగా యిచ్చాడని చెప్పాడు. పోర్షియాకి కోపంవచ్చి, అయితే బసానియో కూడా ఏస్త్రీకో యిచ్చేసి వుంటాడని, యిద్దరూ కలసి నాటకం ఆడుతున్నారని అంటుంది. బసానియో ఎంత చెప్పినా వినిపించుకోలేదు. అప్పుడు ఆంటోనియో కలుగచేసుకొని వాళ్ళ మధ్య ఆ తగాదాకంతటికి తనే కారణమని, బసానియో చెప్పేదంతా నిజమేనని, ఏస్త్రీకి యివ్వలేదని, లాయరు బాల్తసార్‌కే యిచ్చాడని, ఈసారికి తన కోసం అతడిని క్షమించమని కోరుకున్నాడు. అపుడు పోర్షియా ఒక వుంగరం తీసి బసానియోకిచ్చి, ఈ సారయినా మాట తప్పవద్దని, ఎవరికీ యిచ్చి వెయ్యకుండా తన వేలికే వుంచుకోమని చెప్పింది.

బసానియో తన కళ్ళని తానే నమ్మలేక పోయాడు. ఆ ఉంగరం తాను లాయరుకి యిచ్చినదే. అందులో సందేహంలేదు. గ్రేషియానోకి కూడా నెరిస్సా యింకొక వుంగరం తీసి ఇచ్చింది. అది కూడా సరిగ్గా

# 10

గ్రేషియానో లాయరు గుమాస్తా కిచ్చిందే. అందరూ ఆశ్చర్యంగా చూస్తు న్నారు.

అప్పుడు పోర్షియా అంతా వివరముగా చెప్పింది. తను లాయరు డాక్టరు బాల్తసార్ గాను, నెరిస్సా లాయరు గుమాస్తాగాను వచ్చి డ్యూక్ ఎదుట ఆంటోనియో తరపున వాదించామని చెప్పింది. అందరూ యిది విని సంభ్రమాశ్చర్యాలలో వుండగా, ఆంటోనియో పడవలన్నీ సురక్షితంగా వొడ్డు చేరుకున్నాయనీ, మునిగిపోయాయనుకున్న పడవలు ఆంటోనియోవి కావని కబురు అందింది.

అందరూ ఆనందంగా, నవ్వుతూ, వివాహభోజనానికి తరలి వెళ్లారు.



# హే మ్లె ట్

# Hamlet

హేమ్లెట్ డెన్మార్క్ దేశానికి యువరాజు. జర్మనీలోని విటెన్‌బర్గ యూనివర్సిటీలో చదువుకుంటున్నాడు. గుణవంతుడు, తెలివయిన వాడు. అకస్మాత్తుగా తన తండ్రి చనిపోయాడన్న వార్త విని డెన్మార్క్‌కు వచ్చాడు. తనతండ్రి మరణమే అతడిని ఎంతగానో విషాదంలో ముంచి వేస్తే, ఎన్నో రోజులు కూడా గడవకుండానే తన తల్లి, పిన తండ్రి క్లాడియస్‌ను వివాహం చేసుకోవడం మనసును మరింతగా కలవర పెట్టింది. తన తల్లి యింతటి నికృష్టమైన పనికి ఎలా పూనుకుంది? విచక్షణాజ్ఞానం లేకుండా తొందరపాటుతో వ్యవహరించే యవ్వనంలో లేదే? తన తండ్రిని ఎంతగానో ప్రేమించేదే? కంటినీళ్ళ చారలు కూడా పోకుండానే, భర్త తమ్ముణ్ణి ఎలా వివాహ మాడ గలిగింది ?

ఈ విధంగా మనసులో మధన పడుతున్న సమయంలో ఒక విచిత్రమయిన సంఘటన జరిగింది. హేమ్లెట్ ప్రాణ స్నేహితుడయిన హొరేషియోకి. చనిపోయిన హేమ్లెట్ రాజు దెయ్యం కనపడింది.

దానితో మాట్లాడ్డానికి ప్రయత్నించాడు, లాభం లేకపోయింది. ఈవిధంగా కొన్ని రాత్రులు జరిగింది. తనతో ఏమీ చెప్పడం లేదు. హేమ్లెట్ తో నైనా మాట్లాడుతుందేమోనని ఆతనితో చెప్పాడు. ఆ రాత్రే హేమ్లెట్ తన మిత్రుడితో సహా తోట దగ్గరికి వెళ్ళి వేచి వున్నాడు. రోజూ వచ్చే వేళకి తన తండ్రి ఆకారంలో ఉన్న దెయ్యం వచ్చింది. హేమ్లెట్, ఎవరివి ఎందుకిలా వస్తున్నావని అడిగాడు.

సమాధానం చెప్పక ముందుకు సాగింది. హేమ్లెట్ దాని వెనుకనే వెళ్ళాడు.

అందరికి దూరంగా వెళ్ళాక-ఆ దెయ్యం హేమ్లెట్ తో, తన తండ్రి దయ్యాన్నని, తను తోటలో ఒక మధ్యాహ్నం వేళ నిద్రిస్తుంటె పాముకాటుకి చనిపోయినట్లు అందరికీ చెప్పారని, తనని కాటువేసిన పాము యిప్పుడు డెన్మార్క్ సింహాసనంమీద కూర్చుని వుందని చెప్పింది.

"నేను అనుకున్నంత పని అయిందన్నమాట. నా పిన తండ్రి యింత పని చేసాడా!" అన్నాడు హేమ్లెట్.

"అవును. వాడే, పాపీ, వరసా లేని జంతువు కంటె హీనుడు. నా ప్రాణప్రదంగా ప్రేమించిన నా భార్యని తన తుచ్ఛమయిన సుఖం కోసం నా నుంచి వేరుచేసాడు. నేను తోటలో మధ్యాహ్నంవేళ నిద్రిస్తుం డగా దొంగలా వచ్చి నా చెవిలో విషాన్ని పోసి,ఘోరమయిన మృత్యు ముఖంలో వన్ను పడవేసాడు. ఈ విధంగా ఆకస్మాత్తుగా నేను చేసిన పాపాలన్నీ నా నెత్తిమీద వుండగానే, నా ప్రాణాన్నే త్రుంచిపారేసాడు. ఎంత ఘోరమయిన చావో అది. నేను చెప్పలేను. నీలో ఏమాత్రం ప్రేమ, మానవత్వం వున్నా, ఇది భరించడానికి వీలులేదు. నీ తల్లికి

సక్కులో బల్లెంలా పొడిచే తన పాపాలకి ఆమెను వదిలెయ్యి", అంది హేమ్లెట్ తండ్రి దెయ్యం.

ఈ మాటలు విని హేమ్లెట్ నిశ్చేష్టుడయ్యాడు. "నీ కన్నతండ్రి మీద నిజమయిన ప్రేమ వుంటె, నీ తండ్రిని దారుణంగా చంపినవాడిపై కక్ష సాధించు. వాడిని హతమార్చేదాకా నిద్రపోకు." అని ఆజ్ఞాపించి ఆ దెయ్యం వెళ్ళిపోయింది.

ఇక హేమ్లెట్ పరిస్థితి మరీ దుర్భరంగా తయారయింది. దెయ్యాల మాటలు ఎలా నమ్మడం ?

ఏ దుష్ట పిశాచమయినా ఈ రూపంలో వచ్చి తన్ను నాశనం చేయడానికి ప్రయత్నించడం లేదుకదా ? ఇప్పుడేం చేయాలి ? ఇలా పరి పరి విధాలుగా ఆలోచించి, తన మిత్రుడు హొరేషియోకి ఈ విషయం ఎవ రికి చెప్పవద్దని చెప్పి, ముందు కర్తవ్యాన్ని గురించి తనలో తానే మధన పడ్డాడు, తను ఒక మతిస్థిమితం లేనివాడిలా ప్రవర్తించి, తన మనసులో దాగివున్న విషయాన్ని ఎవరికి తెలియకుండా పినతండ్రిపై నిఘా వేసి వుంటానని కూడా అతనికి చెప్పాడు.

హేమ్లెట్ వింత ప్రవర్తన తల్లి గెర్ట్రూడ్‌కి, పిన తండ్రి క్లాడి యస్‌కి ఏమీ అర్థంకాదు. ఎందుకిలా వుంటున్నాడు? తండ్రి మరణించి నందుకేనా ? ప్రపంచంలో తండ్రిని పోగొట్టుకోవడం చాలా సహజమైన విషయమని, అదంతా మరచిపోయి, తమవద్దే వుండి, తమకి ఆనందాన్ని కలిగించమని తల్లి, పినతండ్రి ఎంతో ఆప్యాయంగా కోరారు. కాని తన తల్లి పినతండ్రితో వ్యవహరిస్తున్న తీరు చూసి హేమ్లెట్ ఎంతో బాధ పడ్డాడు. మనస్సుకి ఎంతమాత్రం శాంతి లేకుండా పోయింది. తల్లిమీద ఎంతో కోపం వచ్చింది.

భర్త పోయి రెండు నెలలయినా కాలేదే! అంతటి ఉత్తమ సంస్కారంగల మహానుభావుణ్ణి మరచిపోయి, ఇటువంటి పరమనీచుడైన తన పినతండ్రితో అంత ఆనందంగా ఎలా వుండగలుగుతోంది. మృగాలు కూడా ఇంతకంటె ఎక్కువ కాలం దుఃఖంలో మునిగి ఉంటాయి. తన భర్త శవం వెంట వెళ్ళినపుడు వేసుకున్న చెప్పులు కూడా అరిగిపోక ముందె పెళ్ళిచేసుకుందే! ఇదంతా ఏదో వినాశనానికి దారితీయకుండా ఎలాగుంటుంది?" అని ఎంతగానో తనలో తాను కుమిలిపోయాడు.

రాజు క్లాడియస్‌కి అంతరంగిక సలహాదారుడుగా పొలోనియస్ అనే ఒక వయస్సు మళ్ళిన జిత్తులమారి వున్నాడు. అతనికి ఒఫీలియా అనే ఒక అందమయిన కూతురుంది. హేమ్లెట్ ఆమెను ప్రేమించాడు. ఈ విషయం పొలోనియస్‌కి తెలుసు. తన కూతురిని రాకుమారుడు ప్రేమిస్తున్నందుకు సంతోషించినా, ఒఫీలియాని మాత్రం అతనికి అంత ఎక్కువ చనువు ఇవ్వవద్దని హెచ్చరించాడు. తండ్రి అంటె ఎంతో విధేయురాలుగా వుండే ఒఫీలియా అలాగే ప్రవర్తిస్తున్నది. ఈ కారణం వల్లనే హేమ్లెట్ అలా వుంటున్నాడని, అతనికి నిజంగా మతిస్థిమితం లేకపోవడంవల్ల కాదని, రాజుగారికి, రాణిగారికి పొలోనియస్ చెప్పాడు. వారు అది నమ్మారు.

రోజులు గడిచిపోతున్నాయి, కాని హేమ్లెట్ తన తండ్రికిచ్చిన మాట నెరవేర్చలేకపోతున్నాడు. ఎంతో బాధతో కుమిలిపోతున్నాడు. కక్ష తీర్చుకుంటానని వాగ్దానం చేసాడేకాని, ఒక తోటి మానవుడి ప్రాణం తీయడం అంత తేలికయిన పనికాదు. తన స్వభావానికి వ్యతిరేకంకూడా. మరీ మరీ ఈ విషయం గురించి ఆలోచిస్తూ వుండటంవల్ల మనస్సులో సందేహాలు, అనుమానాలు, మరింత చోటుచేసుకున్నాయి. ఏ నిర్ణయానికి

రాలేకపోయినాడు. తన తండ్రి రూపంలో వచ్చిన దెయ్యం గురించి అనుమానం ఎక్కువయింది.

ఈ పరిస్థితిలో ఎటూ పాలుపోకుండా కొట్టుమిట్టాడుతుంటే హేమ్లెట్ కి తన పిన తండ్రి ఎంతవరకు దోషి అన్న విషయాన్ని రూఢి చేసుకునేందుకు ఒక అవకాశం దొరికింది. రాజుగారి ముందు నాటకం వేయడానికి ఒక నాటక సమాజంవారు వచ్చారు. వారు హేమ్లెట్ కి పరిచయం వున్న నటులే, వారు అంతకుముందు ప్రదర్శించిన ఒక నాటకం అతనికి బాగా గుర్తుంది. ఆ నాటకం పేరు "గోంజాగో హత్య". అందులో డ్యూక్ గోంజాగోని, అతని సోదరుడు తోటలో విషం పెట్టి చంపి, తరువాత అతని భార్యను వివాహమాడతాడు. ఆ నాటకం ప్రదర్శించ గలరా అని వారిని అడిగాడు. వారు సరేనన్న తరువాత అందులో తను కొన్ని వాక్యాలు చేరుస్తానని, వాటిని కూడా కలిపి మర్నాడు రాజు, రాణి సమక్షంలో ప్రదర్శించమని చెప్పి పంపాడు. తన తండ్రి హత్యోదంతానికి చాలా దగ్గరగా వుండేటట్లుగా ఈ నాటకంలో కొన్ని మార్పులు చేసాడు. ఈ నాటకం చూస్తున్నపుడు రాజు, రాణి మొహాల్లో కనబడే మార్పును బట్టి వాళ్ళు నిజంగా దోషులవునా, కాదా అని నిర్ణయించుకోవచ్చు ననుకున్నాడు. హొరేషియోకి కూడా వాళ్ళద్దర్నీ చాలా జాగ్రత్తగా చూస్తూవుండమని చెప్పాడు.

మరునాడు రాజు, రాణి వారి పరివారం అందరూ నాటకం చూడడానికి సమావేశమయ్యారు. హేమ్లెట్, తన మిత్రుడు ఒకప్రక్కగా వాళ్ళలో పరివర్తన కనిపెట్టడానికి వీలుగా కూర్చున్నారు. తెరలేవడంతోటే డ్యూక్ గొంజాగో ప్రక్కన అతని భార్య కూర్చుని ఉన్నారు. ఆమె డ్యూక్ తో. "నువ్వు చనిపోతే నేను మళ్ళి పెళ్ళి చేసుకోను, భర్తని చంపిన స్త్రీ మాత్రమే రెండోసారి వివాహ మాడగలుగుతుంది."

అంది. హేమ్లెట్ తన తల్లిలో ఈ మాటలు విన్నపుడు. ఎటువంటి మార్పు వచ్చిందో గమనించాడు. తరువాత ఘట్టంలో గొంజాగోతోటలో నిద్రిస్తుంటాడు. ఒక మనిషి రహస్యంగా వచ్చి, నిద్రిస్తున్న డ్యూక్ చెవిలో విషం పోస్తాడు. ఇంతవరకు చూసేసరికి క్లాడియస్ గట్టిగా కేక పెడతాడు, భరించలేక పోయాడు. "దీపాలు" "దీపాలు" అని అరుస్తో హాల్లొంచి బయటికి రాణితో సహా వెళ్ళిపోతాడు. అక్కడున్న వారంతా దరూ రాజు, రాణి ప్రవర్తించిన తీరుచూసి దిగ్భ్రాంతి చెందారు. దీనిలో హేమ్లెట్ కి పూర్తిగా సందేహం తొలగిపోయింది. తన తండ్రిని, పిన తండ్రే హత్యచేసాడు. ఇక ఆలస్యం చేయకూడదు, ఎంత త్వరలో వీలవుతే అంత త్వరలో తన తండ్రి ఆజ్ఞ నెరవేర్చాలి అనుకున్నాడు.

క్లాడియస్‌కి ఎంతో మనస్తాపం కలిగింది. హేమ్లెట్ కి తన తండ్రి మరణం విషయం ఎంత వరకు తెలుసోఅర్థంకాలేదు. రాణిని హేమ్లెట్ తో మాట్లాడి తెలుసుకోమని పంపాడు. కలత చెందిన మనసుతో క్లాడియస్ భగవంతుని ముందు మోకరిల్లి క్షమించమని ప్రార్థించుతూ వుంటాడు. ఆదే సమయంలో హేమ్లెట్ తన తల్లి దగ్గరకి వెళుతూ చూస్తాడు. ఒంటరిగా, నిస్సహాయుడై తనకి పినతండ్రి దొరికాడు. తన తండ్రిని హత్య చేసిన వ్యక్తి మీద కక్ష తీర్చుకోవడానికి చక్కటి అవకాశం దొరికింది. ఒక్క క్షణం నిలబడి ఆలోచించాడు.

"ఇప్పుడు చిటికెలో క్లాడియస్‌ని చంపి నాతండ్రి ఆత్మకి శాంతి చేకూర్చగలను. ఇపుడు ప్రార్థిస్తున్నాడు. ఇపుడు చంపితే తిన్నగా స్వర్గానికి వెళతాడు. కాని నా తండ్రిని నిద్రలో వుండగా, తన పాపాలన్నిటిని క్షమించమని భగవంతుడిని ప్రార్థించడానికి సమయం కూడా లేకుండా, క్లాడియస్ చంపాడు. అందువల్ల నా తండ్రికి నరకప్రాప్తి తప్పదు. నరకానికి నా తండ్రిని పంపిన ఈ దుష్టుణ్ణి యిపుడు చంపి స్వర్గానికి

పంపడం కక్ష తీర్చుకోవడం అనిపించుకోదు. నేను కూడా ఇతణ్ని నర కానికే పంపాలి." అనుకుని, ఆ అవకాశాన్ని వదులుకుని వెళ్ళిపోయాడు.

తల్లి దగ్గరకి వచ్చాడు. ఆమె ఎందుకయినా మంచిదని, పొలో నియస్‌ని తెర వెనుక హేమ్లెట్ ఆవేశంలో తనకి ఏ అపకారం చెయ్యకుండా చూడమంది. హేమ్లెట్ రావడంతోనే, "హేమ్లెట్, నువ్వు నీ తండ్రికి చాలా అపరాధం చేసావు!' అని తల్లి అంటే, అతను "అమ్మా, నువ్వు నా తండ్రికి చాలా అపరాధం చేసావు" అని సమాధానం యిస్తాడు.

"నేనెవరో తెలుసా, నన్ను మర్చిపోయావా, అలా మాట్లాడుతున్నావు. నాతో" అంది తల్లి "నేను నిన్ను మర్చిపోలేదు. నువ్వు రాణీవి. నువ్వు నీభర్త తమ్ముడు భార్యవి. అలాకాకపోతే నా తల్లివి,"
అని సమాధానం యిచ్చాడు.

ఇలా ఇద్దరూ ఆవేశంగా మాట్లాడుకుంటుంటే, తన తల్లిని చంపడానికి గట్టిగా ఆమెను పట్టుకున్నాడనుకుని, తెర వెనుకనే వున్న, పొలోనియస్ "సహాయం, సహాయం," అని అరిచాడు. క్లాడియస్ అక్కడ వెనుక దాగున్నాడనుకుని కత్తిదూసి హేమ్లెట్ పొలోనియస్‌ని పొడిచాడు. అతడు ఒక్క దెబ్బకి చచ్చిపోయాడు. "ఎంత ఘోరమయిన పని చేసావు" అని తల్లి అన్నమాటలకి, "నిజమే, భర్తని చంపి, అతని సోదరుడిని వివాహమాడినంత దుర్మార్గమయినదే ఈ పని,"అని సమాధానం యిచ్చాడు తల్లికి. తను ఎంతటి నీచమైన పనికిపూనుకుందో జరిగినదంతా చెప్పి ఆమెను తీవ్రంగా మందలించాడు. అతని మాటలు తనకు బాకుల్లా గుండెకి తగిలాయని బాధపడింది. హేమ్లెట్ అలాగట్టిగా తల్లిని పరుషమయిన పదజాలంతో నిందిస్తుండగా, తండ్రి దయ్యం

కనపడింది. నేను చెయ్యవలసిన పని ఇంత వరకు చెయ్యనందుకు, నా చేతకాని తనానికి నన్ను మందలించడానికి వచ్చావా? అన్నాడు. అవును, ఈ రాక నీ కర్తవ్యాన్నే మళ్ళీ నీకు గుర్తుచేసి నీ నిర్ణయం నీరుకారి పోకుండా చూడడానికే నంది ఆ దెయ్యం. అకస్మాత్తుగా ఈ విధంగా గాలితో హేమ్లెట్ మాట్లాడ్డం చూసి, తల్లి విస్తుపోయింది. తన తల్లిని ఏమిచేయవద్దని, పినతండ్రిని మాత్రం ప్రాణాలతో వదలిపెట్ట వద్దని చెప్పి ఆదెయ్యం వెళ్ళిపోయింది.

ఇక క్లాడియస్ పరిస్థితి. హేమ్లెట్‌ను త్వరగా వదిలించుకోకపోతే తన ప్రాణానికి ముప్పు తప్పదని అర్థమయింది. పొలోనియస్‌ని చంప డంవల్ల, హేమ్లెట్‌ని దేశంనుంచి బయటకు పంపివెయ్యటానికి అవ కాశం దొరికింది. అతణ్ణి చంపించివేసి వుండేవాడే కాని, హేమ్లెట్ తల్లికి, ప్రజలకి భయపడి అది విరమించుకొని ముఖ్యమయిన వ్యవ హారంమీద అతణ్ణి ఇంగ్లండు దేశానికి పంపడానికి నిశ్చయించు కున్నట్లు చెప్పాడు. ఇద్దరు రాజభటుల్ని కూడా పంపుతూ, ఇంగ్లండు రాజుకి ఒక వుత్తరం కూడా రాసాడు. వీరు అక్కడికి చేరిన వెంటనే హేమ్లెట్‌ని చంపివేయమని దాని సారాంశం.

ఓడలో వీరు వెళుతుండగా రహస్యంగా హేమ్లెట్ ఆ వుత్తరం తీసి చదివాడు. ఆ వుత్తరంలో తన పేరు తుడిచివేసి, దానికి బదులు ఆ రాజభటుల పేర్లురాసి, ఆ వుత్తరాన్ని మళ్ళీ యధాస్థానంలో వుంచాడు. మరువాడు ఓడదొంగలు హేమ్లెట్ ప్రయాణం చేస్తున్న ఓడని ముట్టడిం చారు. ఆ జరిగిన పోరాటంలో హేమ్లెట్‌ని దొంగలు పడవలో తీసు కెళ్ళిపోయారు. అతనెవరో తెలుసుకుని ఆ దొంగలు సురక్షితంగా హేమ్లెట్‌ని డెన్మార్క్‌లోని రాజ భవనానికి దగ్గరలో ఒడ్డుకు చేర్చారు.

తను మొదట బయలుదేరిన ఓడమాత్రం ఆ యిద్దరు రాజ భటులతో ఇంగ్లండు చేరుకుంది. వారిద్దరూ అక్కడకు చేరిన వెంటనే హతమార్చ బడ్డారు కూడా.

ఇక హేమ్లెట్ డెన్మార్క్ చేరగానే మిత్రుడు హొరేషియోకి వెంటనే వచ్చి తనని కలుసుకోమని వుత్తరం రాసాడు. హొరేషియోవచ్చి రాజు ఎంతటి దుర్మార్గానికి పూనుకున్నాడో తెలుసుకున్నాడు. ఇద్దరూ తిరిగి వస్తూండగా ఒక చర్చివెనుక ఉన్న స్థలంలో ఇద్దరు గొయ్యి తవ్వుతూ కనబడ్డారు. ఇంతలో కొందరు ఒక శవపేటికను తీసుకొని అక్కడ పాతిపెట్టడానికి వచ్చారు. ఆ వచ్చిన వారిలో ముందురాజు, రాణి, వొఫీలియా సోదరుడు లియార్టిస్ వున్నారు. వారెవరికి కనపడ కుండా దాక్కుని వాళ్ళిద్దరూ యిది ఎవరి శవమా అని తెలుసుకున్నారు. ఒఫీలియా ఆత్మహత్య చేసుకుందని అర్ధమవుతుంది. తన మూలంగా, తన తండ్రి హత్య కారణంగా ఒఫీలియా ప్రాణం తీసుకుందని హేమ్లెట్ ఎంతో దుఃఖించాడు.

లియార్టిస్ తన సోదరి శవాన్ని ఆ సమాధిలో ఉంచి, భరించలేని దుఃఖములో తను కూడా ఆ గోతిలోనికి దూకాడు. దగ్గరలోనే వున్న హేమ్లెట్ అది చూసి తను కూడా ఆ గోతిలోకి దూకాడు. వారిద్దరి మత ణాలకి కారకుడయిన హేమ్లెట్ని నిందిస్తూ, లియార్టిస్ అతని గొంతు పట్టుకున్నాడు. ఇద్దరూ తీవ్రంగా పోట్లాడారు. "నేను ఒఫీలియాను మనసారా ప్రేమించాను. నలభై వేలమంది సోదరులు ప్రేమకంటె ఎక్కువగా ఆమెను ప్రేమించాను." అని ఘోరున విలపించాడు. హొరే షియో అతణ్ణి అక్కడి నుంచి తీసుకు వెళ్ళిపోయాడు.

హేమ్లెట్ని చంపించడానికి తను వేసిన కుట్ర విఫలమయి తిరిగి డెన్మార్క్ చేరుకున్నాడని, క్లాడియస్ ఇంకొక కుట్ర పన్నాడు. ఇందులో

లియార్టిస్ పాచికగా వుపయోగించుకోవడానికి నిశ్చయించాడు. తన తండ్రి, సోదరి మరణించడానికి కారకుడయిన హేమ్లెట్ మీద పగ తీర్చుకోవడానికి లియార్టిస్ దేనికయినా సిద్ధంగానే వున్నానన్నాడు. లియార్టిస్, హేమ్లెట్‌ని కత్తి యుద్ధానికి రమ్మని సవాలు చేసాడు. ఇది స్నేహపూర్వకంగా చేసిన సవాలుగా తీసుకుని హెమ్లెట్ సిద్ధమయ్యాడు.

క్లాడియస్ పన్నిన కుట్రలో మొదటి ఎత్తు లియార్టిస్ ఉపయోగించడానికి విషంపూసిన పదునయిన మొన కలిగిన కత్తిని అతనికి ఏర్పాటు చేయడం. రెండవది. విషం కలిపిన మధు పాత్ర హేమ్లెట్‌కి దగ్గరలో వుంచడం. కత్తి యుద్ధం మధ్యలో హేమ్లెట్ అలిసిపోయినపుడు ఈ పాత్రలోని మధువును తాగుతాడని, కత్తి దెబ్బ తప్పించుకున్నా ఈ విషం తాగాక మరణించడం తప్పదని క్లాడియస్ గట్టి నమ్మకం.

ఇద్దరి మధ్యా కత్తి యుద్ధం ప్రారంభమయింది. ఏ మాత్రం అనుమానించకుండానే తన కందించిన కత్తిని హేమ్లెట్ తీసుకున్నాడు. లియార్టిస్ చేతిలో ఉన్న కత్తిని పరిశీలించనైనా లేదు. ఎంతో మంది ఈ పందాన్ని చూడడానికి అక్కడకు చేరడమే కాకుండా, ఎవరు గెలుస్తారనే విషయమై ఒకరికి మించి ఒకరు పెద్ద మొత్తంలో పందాలు కూడా వేసుకున్నారు. మొదటిలో లియార్టిస్ చాలా సరదగా ఆట ఆడుతున్నట్లుగా ప్రవర్తించాడు, హేమ్లెట్‌ని, అతని నైపుణ్యాన్ని అందరూ ఎంతగానో పొగుడుతున్నారు. అదును చూసుకుని లియార్టిస్ హేమ్లెట్‌ని తన విషం పూసిన కత్తితో గట్టి దెబ్బకొట్టాడు. హేమ్లెట్‌కి కోపం వచ్చి గట్టిగా పోరాడ్డంలో యిద్దరి కత్తులు క్రింద పడ్డాయి. మళ్ళీ యిద్దరూ వెనక్కి తీసుకోవడంలో కత్తులు మారాయి. తననుకున్న విధంగా కాకుండా, నిజంగానే లియార్టిస్ తనని గాయపరచినందుకు, హేమ్లెట్‌కి

కోపం వచ్చి, సమయం చూసుకుని లియార్టిస్‌ని అంత తీవ్రంగాను గాయ పరచాడు.

ఇదిలా జరుగుతుండగా రాణి గెర్ట్రూడ్ దగ్గరగా హేమ్లెట్ కోసం వుంచిన మధుపాత్ర తీసుకుని పొరపాటున త్రాగేసింది. తాగి తనకి ఎవరో విషం యిచ్చారని గట్టిగా అరచి మరణించింది. ఏదో మోసం ఇందులో వుందని గ్రహించి హేమ్లెట్ తలుపులన్నీ మూయించాడు. లియార్టిస్ తను చేసిన పాపానికి తనకే శిక్ష పడిందని, కత్తికి చివర విషం పూసిన సంగతి చెప్పాడు. హేమ్లెట్ శరీరంలోకి ఆ విషం వెళ్ళిందని, యింకెంత సేపో అతను కూడా బ్రతకడం కష్టమని, దీని కంతటికి కారకుడు క్లాడియస్ అని చెప్పి లియార్టిస్ కన్ను మూశాడు.

హేమ్లెట్ జరిగినదంతా అర్థం చేసుకుని తన కత్తిలో యింకా కొంచెం విషం ఉండడం చూసి దాంతో క్లాడియస్ శరీరంలో బలమయిన గాయం చేసాడు. క్లాడియస్ నేలకొరిగాడు. హేమ్లెట్ తన తండ్రికిచ్చిన మాట నిలబెట్టుకున్నాడు, హొరేషియోని దగ్గరకు పిలచి తన కథ అందరికి చెప్పమని, అతని దగ్గర శలవు తీసుకుని హేమ్లెట్ కూడా ప్రాణాలు విడిచాడు.



# "నీ ఇష్టం"

# "AS YOU LIKE IT"

ఫ్రాన్స్ దేశం కొన్ని రాష్ట్రాలుగా విభజింపబడి వుండే రోజుల్లో ఒక రాష్ట్రానికి డ్యూక్ ఫ్రెడ్రిక్ తన అన్నగారిని తొలగించి ఆయన స్థానం అక్రమంగా సంపాదించి రాష్ట్రాధినేతగా పరిపాలన సాగిస్తున్నాడు. రాష్ట్రాన్నుంచి తరిమివేయబడిన సీనియర్ డ్యూక్ ఫర్దినాండ్ కొంత మంది నమ్మకస్థులైన అనుయాయులతో దగ్గరలోని ఆర్డెన్ అడవులలోకి వెళ్ళిపోయాడు, వారందరూ ఎంతో ఆనందంగా సంతృప్తిగా కాలం గడుపుతున్నారు. ఆ ప్రశాంత వాతావరణం వాళ్ళందరికీ ఎంతో నచ్చింది. వాళ్ళకి శత్రువులు ఎవరూ లేరు, చలికాలం తప్ప. ఫర్దినాండ్‌కి ఉన్న బాధల్లా ఒక్కటే. తన కూతురు రోజ్‌లిండ్ తన దగ్గర లేదని. డ్యూక్ ఫ్రెడ్రిక్ కూతురు సీలియాకి తోడుగా వుండడానికి అక్కడ అతను వుంచేశాడు. రోజ్‌లిండ్, సీలియాలు ఒకరికి ఒకరు ప్రాణంగా వుంటున్నారు. రోజ్‌లిండ్‌కి తన తండ్రికి జరిగిన అన్యాయం ఎంతో బాధ కలిగించినా తనకి సీలియా మీద వున్న అమితమైన ప్రేమవల్ల కొంత వరకు సర్ది

పెట్టుకొని సంతోషంగానే కాలక్షేపం చేస్తోంది. సీలియాకి ఈ విషయం తెలుసు. అందువల్ల రోజ్‌లిండ్‌ని సంతోషంగా వుంచడానికి ఎన్నోవిధాల ప్రయత్నం చేసేది.

ఒకరోజున అనుకోని ఒక సంఘటన జరిగింది. అది ఆ పిల్లలిద్దరి జీవితాలనే మార్చివేసింది. డ్యూక్ సమక్షంలో మల్లయుద్ధం జరగబోతోందని, అది చూడదలుచుకుంటే వెంటనే రావలసిందని కబురొచ్చింది. చాలా విచారంగా వున్న రోజ్‌లిండ్ మనసుకి కొంత మార్పు కలిగించే దృష్టితో వెళ్ళడానికి సిద్ధమయారు. ఛార్లెస్ అనే గొప్ప మల్ల యుద్ధ వీరుడు తన శక్తి ప్రదర్శించడానికి వచ్చాడు. ముగ్గురు అన్నదమ్ములతో పోట్లాడి వాళ్ళని చిత్తుగా ఓడించాడు. ఇంకెవరితోనయినా పోరాడ్డానికి సిద్ధంగా వున్నాడు. అందమైన ఒక యువకుడు ఛార్లెస్‌కి ఎంతమాత్రం సమఉజ్జీ కానివాడు రంగంలోకి దిగాడు. ఛార్లెస్ చేతిలో యీ యువకుడు ప్రాణాలు కోల్పోయినా ఆశ్చర్యపడక్కర్లేదని అందరూ అనుకున్నారు. సీలియా, రోజ్‌లిండ్‌లు రావడం చూసి డ్యూక్, "మీరు చూడబోయే మల్లయుద్ధంలో మీకు ఆనందం కలిగించేదేమి ఉండదు. ఆ యువకుడ్ని వారించడానికి ప్రయత్నించి చూడండి!" అన్నాడు. మొదట సీలియా చెప్పింది. తరువాత రోజ్‌లిండ్ కూడా ప్రయత్నించింది. ఛార్లెస్ చేతిలో అతని ప్రాణాలకే ముప్పని చెప్పారు. వారిద్దరికీ తనమీద కనబరచిన అభిమానానికి కృతజ్ఞతలు చెపుతూ, తనను ఛార్లెస్ చంపినా పరవాలేదన్నాడు. తను చనిపోతే బాధపడేవాళ్ళు ఎవరూ లేరన్నాడు. ఈ మాటలకు రోజ్‌లిండ్‌కి మరింత జాలేసింది. ఇతడెవరో తనలాంటి దురదృష్టవంతుడు లాగున్నాడనుకుంది.

మల్లయుద్ధం ప్రారంభమైంది. ఆ యిద్దరి పిల్లల ఓదార్పు మాటలు

ఆ యువకుడికెంతో ధైర్యాన్ని యిచ్చాయి. ఎవరూ ఊహించలేనివిధంగా పోరాడాడు.

ఛార్లెస్‌ని చిత్తుగా కొట్టిపడవేశాడు. అందరూ దిగ్భ్రాంతి చెందారు. డ్యూక్‌కి కూడా ఎంతో సంతోషం కలిగింది. ఆ యువకుడు ఎవరో తెలుసుకోగోరాడు. తన పేరు ఆర్లాండో అని, తను సర్ రౌలండ్ కొడుకునని చెప్పాడు. ఆ మాట వినడంతోటె డ్యూక్‌కి, తన అన్నగారి దగ్గరి అనుచరుడి కొడుకని తెలిసింది. కోపంగా అక్కడి నుండి వెళ్ళిపోతూ సర్ రౌలాండ్ కొడుకువి కాకుండా ఇంకెవరికైనా కొడుకువి అయివుంటె సంతోషించి ఉండేవాడినని అన్నాడు. ఈ విషయం విన్నాక రోజ్‌లిండ్ మరింత ఆనందించింది. ఆ విషయం తెలిసి వుంటె, కళ్ళనీళ్ళతో ప్రాధేయపడి ఉండేదాన్నికదా మల్లయుద్ధానికి దిగవద్దని అనుకుంది.

డ్యూక్ అన్నమాటలకు ఆర్లాండో బాధపడ్డాడని చూసి, రోజ్‌లిండ్, సీలియాలు దగ్గరకెళ్ళి అతనికి మంచిమాటలతో ధైర్యం చెప్పారు. తిరిగి వచ్చేస్తూ, రోజ్‌లిండ్ మళ్ళి వెనక్కి వెళ్ళి మెడలోంచి ఒక గొలుసు తీసి అతనికిస్తూ అతడిని అది ధరించమని వేడుకొంది. నీలాగే నా పరిస్థితులు కూడా బాగాలేవు లేకపోతే యింత కంటె విలువయిన కానుకే యిచ్చేదాన్ని అని చెప్పింది.

ఆర్లాండో తండ్రి అతని చిన్నతనంలోనే చనిపోయాడు. తన అన్న ఆలివర్‌కు తనను జాగ్రత్తగా పెంచి పెద్దవాడిని చేసే బాధ్యత అప్పగిస్తే అతను తండ్రి చెప్పిన మాటలకు భిన్నంగా, సరిగ్గా చదువు కూడా చెప్పించకుండా ఆర్లాండోని చాలా బాధపెట్టాడు. అయినా కూడా మంచి గుణగణాలు కలిగిన యువకుడిగా తయారయి అందరి మెప్పు పొందుతున్నాడు. తన తండ్రికి తగిన కొడుకనిపించుకుంటున్నాడు. ఇది ఆలివర్‌కు ఎంతగానో యీర్ష్యకు కారణమయింది, అందుకే మల్లయుద్ధా

నికి ముందు ఛార్లెస్ దగ్గరికి వెళ్ళి తన తమ్ముడు అలా మంచివాడుగా కనపడతాడేకాని, చాలా దుర్మార్గుడని చెప్పాడు. తన ప్రాణాలే తీయాలని కుట్రపన్నుతున్నాడని చెప్పాడు. అందువల్ల అతన్ని చంపినాసరే ఫరవా లేదని, ప్రపంచానికే చాలా సేవ చేసిన వాడవుతాడని చెప్పి అతని దగ్గర మాటకూడా తీసుకున్నాడు, ఆర్లాండో అంతుచూస్తానని.

మల్లయుద్ధమయ్యాక అక్కడ వుండడం ఎంతమాత్రము మంచిది కాదని, డ్యూక్ ఫ్రెడ్రిక్ ఆగ్రహానికి గురికావలసి వస్తుందని గ్రహించి వెంటనే రాజ్యం నుంచి వెళ్ళిపోయాడు. రోజ్‌లిండ్ ఆర్లాండో యందు చూపించిన ప్రేమాభిమానాలు డ్యూక్‌కి ఎంతో కోపం తెప్పించాయి. కొంతకాలంగా ఎలాగోలా ఆమెను అక్కడి నుంచి పంపివేయాలనే ఆలోచనలో కూడా ఉన్నాడు. రోజ్‌లిండ్ ముందు తన కూతురు సీలియా మరుగున పడిపోతోందని, అందరూ రోజ్‌లిండ్‌నే పొగుడుతున్నారని అసలే బాధగా వుంది. వెంటనే ఆమెను దేశం విడిచి వెళ్లిపోవాలని ఆజ్ఞాపించాడు. ఆమె తరపున సీలియా ఎంత బ్రతిమాలినా కూడా వినలేదు. "నేనెందుకు వెళ్లిపోవాలి" అని అమాయకంగా రోజ్‌లిండ్ అడిగితే "నువ్వు మీ నాన్న కూతురివి. అంతకంటె యింకేం కారణం కావాలి?" అని సమాధానం యిచ్చాడు.

సీలియాకి రోజ్‌లిండ్ అంటె ప్రాణం. ఆమెను విడిచి ఒక్క క్షణం కూడా వుండలేదు, రోజ్‌లిండ్‌తో తనుకూడా వెళ్ళడానికి సిద్ధపడింది. ఇద్దరూ రోజ్‌లిండ్ తండ్రివున్న ఆర్డెన్ అడవుల్లోకి వెళ్లిపోవటానికి నిశ్చయించుకున్నారు. ఆ విధంగా వెళితే ప్రమాదం. అందువల్ల యిద్దరూ మారువేషాల్లో, ఒకరు పల్లెటూరి యువకుడిగా, మరొకరు పల్లె పడుచుగా వెళ్ళడానికి నిశ్చయించుకొని, రోజ్‌లిండ్ పొడగరి కనుక

యువకుడిగా వేషం వేసుకోవడానికి, వారిద్దరి పేర్లు "గానిమిడ్", "ఏలి యానా" అని మార్చుకోవడానికి నిర్ణయించుకున్నారు. వాళ్ళదగ్గర వున్న డబ్బు, నగలు అన్నీ తీసుకుని అన్నా, చెల్లెళ్లుగా బయలుదేరారు.

దారిలో ఎన్నో యిబ్బందులు పడుతూ,ఎంతో ధైర్యంగానే ఆర్డెన్ అరణ్యానికి చేరుకున్నారు. ఇంతవరకు డబ్బు బాగా ఖర్చుచేస్తూ, వుండడానికి వసతులు చూసుకుంటూ వచ్చారు. కాని ఈ అడవిలో అటు వంటివేమీలేవు. ఇద్దరూ బాగా అలిసిపోయారు. సీలియా యింకొక్క అడుగుకూడా ముందుకు వెయ్యలేనని చెప్పి అక్కడే కూర్చుంది. ఆ అడవిలో తన తండ్రి ఎక్కడ వున్నాడో ఎలా తెలుసుకోవడం? ఆ సమయంలో ఎవరో ఒక గొర్రెలకాపరి అటు ప్రక్కగా వచ్చాడు. అతడితో, తన చెల్లెలు అలిసిపోయిందని, వాళ్ళిద్దరూ వుండడానికి వీలుగా వున్న ఒక యిల్లు ఏదయినా చూపించమని గానిమిడ్ అడిగాడు. తను ఒక గొర్రెల కాపరి దగ్గర నౌకరునేనని, తన యజమాని యింటిని అమ్మడానికి చూస్తున్నాడని చెప్పి అక్కడికి వీళ్ళిద్దరిని తీసుకువెళ్ళాడు. ఆ చిన్నపాక వాళ్ళకి అక్కడసేద తీర్చుకోవడానికి ఎంతగానో ఉప యోగపడింది. అది వాళ్ళకి బాగా నచ్చింది కూడా. అక్కడినుండి డ్యూక్ దగ్గరికి వెళ్ళడానికి ప్రయత్నాలు చేయవచ్చుననుకున్నారు.

ఇదిలా వుండగా, ఆర్లాండో తన అన్నయింటికి తిరిగి వెళ తుంటే, తన నమ్మిన నౌకరు ఆడమ్ ఎదురువచ్చి, యింటికి వెళ్ళ వద్దని, వెళితే అతని ప్రాణానికి ముప్పు తప్పదని చెప్పాడు. "నేని ప్పుడు ఎక్కడికి వెళ్ళగలను. నాదగ్గర చిల్లిగవ్వైనా లేదే?" అన్నాడు. దానికి, ఆడమ్, "నా దగ్గర అయిదు వందల క్రౌన్లు డబ్బుజాగ్రత్తగా కూడబెట్టింది వుంది. అది తీసుకో. దానితో నన్ను కూడా తీసుకువెళ్ళు ఆన్నాడు. నేను పెద్దవాణ్ణయిపోయాను. అయినా నీకు సేవ చేయగలిగిన

శక్తినా దగ్గరుందన్నాడు. అతడి స్వామిభక్తికి ఎంతగానో అభినందిం చాడు. సరేనని యిద్దరూ బయలుదేరారు. కొంత దూరం ప్రయాణంచేసి చివరకు పెద్ద డ్యూక్, అతని అనుచరులు ఉంటున్న ఆర్డెన్ అరణ్యా నికి చేరుకున్నారు.

ఇక ఆర్డెన్‌లో రోజ్‌లిండ్, సీలియాలు ఒకచోట, ఆర్లాండో, ఆడమ్‌లు మరో చోట వుంటున్నారు. కాని ఒకరిని గురించి మరొకరికి తెలియదు. రోజ్‌లిండ్ తరచు ఆర్లాండో గురించి ఆలోచిస్తోంది. తనని గురించి మరచి పోయి వుంటాడని కూడా అనుకుంటోంది.

ఆర్లాండో, ఆడములు అడవిలో దారి తప్పి తిరుగుతున్నారు. పూర్తిగా అలిసిపోయారు. ఆడం ఒక్క అడుగుకూడా ముందుకు వెళ్ళ లేనన్నాడు. అతన్ని ఒక చెట్టుక్రింద పడుకోమని ఎక్కడైనా ఆడం ఆకలి తీరడానికి కావలసిన ఆహారం దొరుకుతుందేమోనని వెతకడానికి ఆర్లాండో వెళ్లాడు. పెద్ద డ్యూక్, అతని మనుషులు వుంటున్న చోటుకి చేరుకున్నాడు. అతనికి వాళ్లెవరో తెలియదు. అప్పుడే వాళ్ళంతా భోజ నాలకి కూర్చోబోతున్నారు. కత్తి తీసుకుని వాళ్ళ మధ్యకువెళ్ళి, నాకు తినడానికి ఏమయినా యివ్వండి, అని అరిచాడు. డ్యూక్ చాలాశాంతంగా నీ ప్రవర్తన ఏమీ బాగాలేదు కాని, దీన్నిబట్టి నీవు ఏదో ఒక పెద్ద యిబ్బందిలో వున్నట్లే అర్థమవుతోంది. ఏమిటి సంగతి చెప్పు. అని అడిగాడు. ఆడము సంగతి చెప్పాడు. అయితే వెళ్ళి, అతణ్ణి యిక్క డికే తీసుకురా అందరం కలిసే భోజనం చేద్దామన్నాడు. ఆర్లాండో పరి గెత్తుకుంటూ వెళ్ళి ఆడముని తీసుకువచ్చాడు. అందరూ సంతృప్తిగా భోజనం చేసారు. అప్పుడు తను సర్ రౌలండ్ చిన్న కొడుకునని చెప్పి తన కథంతా వివరంగా చెప్పాడు. డ్యూక్ తన మిత్రుడి కొడుకని తెలుసుకుని సంతోషించి వాళ్ళిద్దర్ని కూడా తనతోపాటు వుండమన్ని

చెప్పాడు. అందుకువాళ్ళు వొప్పుకుని, ఆ రాత్రి హాయిగా నిద్రించారు. రోజులిండ్, సీలియాలు ఉంటున్న గుడిసెకూడా డ్యూక్ ఉంటున్న స్థలానికి దగ్గరే కాని, అది వాళ్ళకి తెలియదు. వాళ్ళిద్దరూ అడివిలో తిరుగుతుంటే వాళ్ళకి ఒక విచిత్రమయిన విషయం కంటపడ్డింది. "రోజులిండ్" పేరు అనేక చెట్లమీద చెక్కబడి కనబడింది. ఆ పేరు క్రింద అనేక పద్యాలు కూడా వున్నాయి. అవన్నీ రోజులిండ్ అందాన్ని వర్ణించేపద్యాలే. ఇవి ఎవరు రాసారు? ఎవరిని గురించి? అర్థంకాలేదు. ఎవరో రోజులిండ్, గానిమిడ్‌గా మారకముందు తెలిసిన వ్యక్తి అయి వుంటాడని అర్థమయింది. వాళ్ళకి ఎంతకీ అంతుపట్టలేదు. రోజులిండ్ మాత్రం అవన్నీ రాసినది ఆర్లాండో అయివుంటే ఎంత బాగుండునో అని అనుకుంది.

ఒకరోజు ఆర్లాండో, ఎవరో స్నేహితుడితో కలిసి వస్తూండడం రోజులిండ్, సీలియాలు చూసారు. చెట్టు వెనక్కివెళ్ళి దాక్కొని వాళ్ళ సంభాషణ విన్నారు. అప్పుడర్థమయింది. ఆ పద్యాలన్నీ రాసిన కవి ఆర్లాండోయేనని. రోజులిండ్ ఎంతో సంతోషించింది.

గానిమిడ్, ఆలియానాల వేషాల్లో వున్న వాళ్ళిద్దరూ చెట్లచాటు నుంచి బయటికి వచ్చారు. ఆర్లాండో మాత్రం వాళ్ళని గుర్తుపట్టలేదు. గానిమిడ్ ఆర్లాండోని అతనికి రోజులిండ్ మీద వున్న ప్రేమని, ఆ పద్యాలని వేళాకోళం చేసింది. దానికి నీకు ఒక మందు చెప్పగలను, అంది నవ్వుతూ. రోజూ నా దగ్గరకు వచ్చి, నేనే రోజులిండ్‌ననుకొని మాట్లాడుతూవుండు. నేనుకూడా రోజులిండ్ లాగే ప్రవర్తిస్తూ ఉంటాను. త్వరలో నీకున్న ప్రేమజబ్బు కాస్తా కుదురుతుంది. అని సలహా యిచ్చింది. ఆర్లాండో రోజూ అలాగే చేయడం మొదలు పెట్టాడు. గానిమిడ్‌ని రోజలిండ్ అని సంబోధిస్తున్నాడు. రోజలిండ్‌కి చాలా

సంతోషంగా వుంది. రోజులు గడిచిపోతున్నాయి. తండ్రినివెతుక్కుంటూ వచ్చిన సంగతే మరచిపోయింది. ఒకసారి అనుకోకుండా తండ్రిని కలవడం జరిగింది. తండ్రి ఈ పిల్లవాడిని తన కూతురుగా గుర్తుపట్టలేదు. కాని ఆ కుర్రవాడికి కూతురి పోలికలు బాగా వున్నాయి, అని మాత్రం అనుకున్నాడు.

"నీ పేరేమిటి? నీ తలితండ్రులెవరు?" అని అడిగాడు.

"నా పేరు గానిమిడ్, నా తండ్రి నీలాంటి వాడే" అని సమాధానం యిచ్చాడు. డ్యూక్ నవ్వుకున్నాడు ఆ యువకుడి ధైర్యానికి, సమయస్ఫూర్తికి.

ప్రతిరోజూ ఆర్లాండో, గానిమిడ్ దగ్గరకి వెళుతున్నాడు, అనుకున్న ప్రకారంగా. ఒకరోజున అలా వెళుతుంటె ఒక విచిత్రమయిన విషయం జరిగింది. చిరిగిపోయిన గుడ్డల్లో ఉన్న ఎవరో వ్యక్తి చెట్టు క్రింద పడుకుని వున్నాడు. తీరాచూస్తే అతడు ఎవరో కాదు. తన అన్న ఆలివర్. తన అన్నని ఆ అడవిలో, అటువంటి పరిస్థితులలో చూస్తానని ఆర్లాండో కల్లో కూడా వూహించలేదు. అదే సమయంలో ఒక పెద్ద విషసర్పం అతని మెడని చుట్టేసింది. అతన్ని కాటెయడానికి సిద్ధంగా ఉంది. ఆర్లాండో వచ్చిన అలికిడికి మెల్లగా దిగిపోయి పొదల్లోకి జారుకుంది, అలా నిర్ఘాంతపోయి చూస్తోంటే, ఇంకొక భయంకరమయిన దృశ్యం అతని కంట పడింది. ఒక సింహం పొదల్లో పొంచి వుంది. నిద్రపోతున్న వ్యక్తి ఎప్పుడు కదులుతే అప్పుడు మీదకి దూకడానికి సిద్ధంగా వుంది.

మెరుపులా ఒక భయంకరమయిన ఆలోచన మనస్సులో మెదిలింది. "తను వూరుకుంటె ఆలివర్‌ని సింహం చంపేస్తుంది. తనన్ని

అంతగా బాధపెట్టిన అన్నగారిని చావనిస్తే మటుకేం తప్పు" అనుకున్నాడు. వెంటనే ఆ దురాలోచనని మనసులోంచి తోసిపారేసి, కత్తి తీసుకుని ఆ సింహంమీదకి వెళ్ళి, చాలా తీవ్రంగా పోట్లాడి దాన్ని చంపేశాడు. ఈ పోట్లాటలో తన వంటికి కూడా బాగా గాయాలు తగిలాయి. నెత్తురు ప్రవహిస్తోంది. ఆ చప్పుడికి ఆలివర్ నిద్రలోంచి లేచాడు. తను ఎంతగానో హింస పెట్టిన తమ్ముడు తన ప్రాణాన్ని రక్షించేడు. తన ముందు నిలబడి వున్నాడు. తన ప్రాణాన్ని రక్షించడానికి తమ్ముడు తన ప్రాణాన్ని త్యాగం చేయబోయాడు. తమ్ముడిని క్షమించమని వేడుకున్నాడు. తను చేసిన పనికి సిగ్గుతో తలవంచుకొని ఎంతో పశ్చాత్తాప పడ్డాడు. జరిగినదంతా మరచిపోయి, వాళ్ళిద్దరిమధ్య అన్నదమ్ముల అనుబంధం మళ్ళీ చిగుళ్ళు వేసుకుంది.

ఆలివర్ అడవిలోకి వచ్చిన ఉద్దేశ్యం, తన తమ్ముణ్ణి, డ్యూక్ ఫ్రెడ్రిక్ ఆజ్ఞ ప్రకారం పట్టుకుని తీసుకొని వెళ్ళి అతనికి అప్పచెప్పడానికి. "నీ తమ్ముడిని తీసుకు రాలేకపోతే, నీ ఆస్తంతా పోగొట్టుకుంటావు" అని బెదిరించి పంపాడు డ్యూక్ ఆలివర్ని. అందువల్ల ఆర్లాండో ప్రాణాలు తియ్యడానికి ఆలివర్ అడవిలోనికి వస్తే, తన ప్రాణాలనే తమ్ముడు రక్షించాడు. అందువల్ల ఆలివర్లో పూర్తి పరివర్తన వచ్చేసింది.

అలిసిపోయి, గాయాలతో రక్తం బాగాపోయి, ఆర్లాండో స్పృహ తప్పి పడిపోయాడు. లేచిన వెంటనే గానిమిడ్కి ఆలివర్ ద్వారా ఒక సందేశం పంపాడు. రక్తంతో తడిసిపోయిన తన చేతిరుమాలును కూడా అతనితో పంపాడు. ఆలివర్ అక్కడికి వెళ్ళి గానిమిడ్, ఆలియానాలకి జరిగినదంతా చెప్పాడు. తన ప్రాణాన్ని తన తమ్ముడు ఎలా కాపాడాడో చెప్పాడు. తనలో ఎంతటి మార్పు వచ్చిందో కూడా వివరించాడు,

అప్పుడు ఆర్లాండో పంపిన నెత్తుటి చేతిగుడ్డని చూపించాడు. అది చూసి 'గానిమిడ్' స్పృహతప్పి పడిపోయాడు. వెంటనే తను పురుషుడినన్న విషయం గుర్తువచ్చి, వూరికే అలా నటించానని చెప్పాడు.

ఆలివర్, ఆర్లాండో దగ్గరికి తిరిగొచ్చి అక్కడ జరిగినదంతా చెప్పాడు. 'గానిమిడ్' వూరికే నటించానని చెప్పాడు కాని, అది నేను నమ్మనన్నాడు. నిజంగానే అలా పడిపోయాడన్నాడు. ఈ విషయం చెబుతూ, తను అక్కడ ఆ గానిమిడ్ చెల్లెల్ని చూసానని, ఆమెను తను ప్రేమిస్తున్నానని కూడా చెప్పాడు. వాళ్ళిద్దరూ త్వరలోనే వివాహం కూడా చేసుకోబోతున్నామన్నాడు. నువ్వుంటున్న యీ గుడిసెలో మేముంటాం నువ్వు నా ఆస్తిని, డబ్బుని తీసుకో" అన్నాడు.

ఆర్లాండో తన అన్నకి వివాహం జరుగుతున్నందుకు చాలా సంతోషించాడు రేపే వివాహం, నేను వెళ్ళి డ్యూక్‌ని, ఆయన పరివారాన్ని రమ్మని ఆహ్వానిస్తాను. ఆలియానాని పెళ్ళికి సిద్ధంగా వుండమని చెప్పడానికి అన్నగారిని పంపించాడు.

ఆలివర్, ఆలియానా దగ్గరకి వెళ్ళినపుడు ఆర్లాండోని చూడ్డానికి రోజలిండ్ వచ్చింది. ఆర్లాండోకి అంత పెద్ద గాయం తగలలేదని సంతోషించింది. అప్పుడు మర్నాడు జరుగబోతున్న వివాహం గురించి ఆర్లాండో ఆమెకు చెప్పాడు. "నా సోదరుడికి పెళ్ళి అవుతున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది. నేను కూడా రోజ్‌లిండుని పెళ్ళిచేసుకోగలిగితే ఎంత బావుండునో కదా!" అని అన్నాడు.

రోజ్‌లిండ్ ఇంతవరకు తను ఆడుతున్న నాటకం ఆపి, అసలు విషయాన్ని బయటికి చెప్పవలసిన సమయం వచ్చిందనుకుంది. "నువ్వు

నిజంగా రోజ్‌లిండ్‌ని రేపే పెళ్ళిచేసుకో దలుచుకుంటె అలాగే తప్ప కుండా చేసుకుందువు గాని" అని చెప్పింది. నేను నీ కళ్ళముందు రోజ్‌లిండ్ నిలబడేలా చేయగలను, అంది. "మంచి దుస్తులు వేసుకొని, పెళ్ళికి సిద్ధమయి రేపు, స్నేహితు లందరిని పిలుచుకొనిరా. తప్పకుండా రోజ్‌లిండుని పెళ్ళిచేసుకుందువుగాని" అని చెప్పి వెళ్ళిపోయింది.

మర్నాడు పెద్ద డ్యూక్ అతని పరివారం అంతా సమావేశ మయ్యారు. రెండు వివాహాలు చూడ్డానికి. గానిమిడ్ ఆర్లాండోని తీసుకుని డ్యూక్ దగ్గరికి వెళ్ళి, నేను నీ కూతురు రోజ్‌లిండ్‌ని తీసుకువస్తే ఆమెని యీ ఆర్లాండో కిచ్చి వివాహం చేయడానికి వొప్పుకుంటావా? అని అడిగాడు. సరేనన్నాడు. ఆమెతో నా రాజ్యాన్నంతటిని యిచ్చేయ్య టానికి కూడా సిద్ధమన్నాడు. అప్పుడు ఆర్లాండోని కూడా, రోజ్‌లిండ్‌ని తీసుకువస్తె పెళ్ళి చేసుకుంటావా అని గానిమిడ్ అడిగాడు. అతనూ సరే నన్నాడు. ఇక్కడే వేచివుండండని చెప్పి గానిమిడ్, అలియానాలు చెట్ల వెనక్కి వెళ్ళారు. మళ్ళీ తిరిగి వచ్చేసరికి యిద్దరు చక్కని అమ్మా యిలు రోజ్‌లిండ్, సీలియాలు అందరి ముందు ప్రత్యక్ష మయ్యారు. అందరూ సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయారు. వాళ్ళ కళ్ళని వాళ్ళే నమ్మలేకపోయారు వాళ్ళ కధంతా విన్నాక అందరి ఆనందానికి పట్ట పగ్గాలు లేకపోయాయి.

ఆర్లాండోకి, రోజలిండు తోటి, ఆలివర్‌కి సీలియాతోటి వివాహాలు వైభవంగా జరిగాయి. విందు జరుగుతోంది. యింతలో ఒక దూత కబురు తెచ్చాడు.

"నీ తమ్ముడు ఫ్రెడ్రిక్, నిన్ను నీ పరివారాన్ని సంహరించా లనే వుద్దేశ్యంతో సైన్యంతో యీ అడివిలోకి వచ్చాడు. ఇక్కడ ఒక

సాధువుని కలుసుకున్నాడు. అతనితో మాట్లాడాక ఫ్రెడ్రిక్‌లో ఎంతో మార్పు వచ్చింది. తన తప్పు తెలుసుకున్నాడు. పశ్చాత్తాపపడ్డాడు. అందు వల్ల నీ రాజ్యాన్ని నీ కిచ్చి వెయ్యడానికి నిశ్చయించుకున్నాడు" అని చెప్పాడు.

అందరూ ఆ వార్తవిని చివరికి మంచి గెలుపు సాధించినందుకు సంతోషించారు.

•*•

# మేక్బెత్

# Macbeth

స్కాట్లండ్ దేశాన్ని డంకన్ అనే రాజు పరిపాలిస్తున్నాడు. అతని దగ్గిర బంధువు, గొప్ప పరాక్రమవంతుడు అయిన మేక్బెత్, నార్వే రాజు సహాయంతో తిరుగుబాటు చేసిన కాడర్ అనే ఒక సామంత రాజుని చిత్తుగా ఓడించాడు. నార్వే రాజు లొంగిపోయాడు. కాడర్ ని బందీగా తీసుకున్నాడు. ఈ అఖండ విజయాన్ని సాధించడానికి తనకెంతో సహాయపడిన తోటి సేనాధిపతి బాంకోతో కలిసి యింటికి తిరిగి వస్తున్నాడు. దారిలో ఒక నిర్మానుష్యమయిన అడవి ప్రదేశాన్ని దాటి వస్తూండగా, చాలా వికృతమయిన ఆకారాల్లో వున్న మూడు భూతాలు వారిని ఆపాయి. స్త్రీ రూపంలో ఉన్న వాటికి గడ్డాలు వున్నాయి. వడలిపోయిన చర్మంతో, వింత దుస్తులతో ఉన్న ఆ రూపాలు చూసేవారికి జుగుప్సాకరంగా ఉన్నాయి. భూమిమీదనే వున్నా మానవ లక్షణాలు ఏవీ వాటిలో లేవు.

"ఎవరు మీరు ? మాట్లాడగలిగితే మాట్లాడండి నాతో"

అన్నాడు మేక్బెత్. అందులో ఒక భూతం "గ్లామిస్ థేన్కి స్వాగతం" అంది మరొకటి "కాడర్ థేన్కి స్వాగతం" అంది. మూడవది, "భావి స్కాట్లండు రాజుకి స్వాగతం" అంది.

థేన్ అనేటువంటిది ఒక బిరుదు లాంటిది. ఇప్పటికే మేక్బెత్కి గ్లామిస్ థేన్ అనే బిరుదుంది. కాడర్ బతికే వున్నాడు. ఆ బిరుదు తనకెలా వస్తుంది అని ఆతను అనుకుంటె, మరీ ఆశ్చర్యం కలిగించేటట్లుగా భావి స్కాట్లండు రాజుగా తనని పిలిచాయి. విస్తుపోయాడు ఇంతలో బాంకో వాటిని ఉద్దేశించి మాట్లాడుతూ, "నా స్నేహితుడిని ఇప్పుడు వున్న బిరుదుతో పిలుస్తూ, అతనికి ముందు రాబోయే గొప్ప పదవి చెప్పారు కదా, మరి నా సంగతేమిటి, నాకేం చెప్పలేదే" అని అడిగాడు.

అప్పుడు బాంకో నుద్దేశించి, ఒక భూతం, "నువ్వు మేక్బెత్ కంటే తక్కువ, అతని కంటె ఎంతో ఎక్కువ కూడా" అంది. రెండో భూతం, "అతనికున్న సంతోషం లేదు, అతనికంటె ఎక్కువ కూడా ఉంది" అంది. మూడవ భూతం, "నువ్వు రాజువి కాకపోయినా, నీకు కలిగే సంతానం రాజులవుతారు" అంది. ఈ మాటలు చెప్పి అవన్నీ అంతర్ధానమయ్యాయి. మేక్బెత్ యింకా ఏవో అడుగుదామని ప్రయత్నిస్తున్నా వినిపించుకోకుండా ఇదంతా నిజమేనా, లేకపోతే తమకి పిచ్చెక్కిందా అనుకున్నారు. పైకి ఏదీ పట్టించుకోనట్లు ప్రవర్తించినా, మేక్బెత్ లోపల మాత్రం ఏదో తీవ్రమయిన ఆలోచనలో పడ్డాడు. బాంకోని, "నీ కొడుకులు రాజులవుతారు" అంటాడు మేక్బెత్. బాంకో, "నువ్వు రాజువి అవుతావు కదా!" అని అంటాడు. ఇద్దరూ, ఆ భూతాలు చెప్పిన విషయాన్ని గురించి చాలా తమాషాగా తీసుకుంటున్నట్లుగా మాట్లాడుకుంటూ బయల్దేరారు.

కొద్దిదూరం కూడా వెళ్ళకముందే రాజుగారి దగ్గరి నుంచి ఒక దూత వచ్చాడు. మేక్బెత్ యుద్ధంలో చూపిన పరాక్రమం రాజుగారికి ఎంతో ఆనందం కలిగించిందని, అందువల్ల తనకి కాడర్ బిరుదు ప్రదానం చేసారని చెప్పాడు. మరి కాడర్ బ్రతికే వున్నాడు కదా, అన్నాడు. దానికి సమాధానంగా, "ఉన్నాడు కాని, అతను చేసిన నేరానికి, బిరుదే కాదు, ప్రాణాన్ని కూడా పోగొట్టుకోబోతున్నాడు" అని దూత చెప్పాడు. ఈ వార్త మేక్బెత్‌ని ఎంతో కలవర పరచిందని చూసి, బాంకో అతన్ని హెచ్చరించాడు. ఇటువంటి భూతాలు తరచు మనకి చిన్న, చిన్న విషయాల్లో నమ్మకం కలిగేటట్లుగా చేసి, వాటి వలలో పడ్డట్లయితే అసలుకే మోసం వచ్చేలా చేస్తాయని చెప్పాడు. అయినా మేక్బెత్ మనసులో ఆ విషయాన్ని గురించే ఆలోచనలో పడ్డాడు. బాంకో, అతని దృష్టిని ఎంతగా మార్చడానికి ప్రయత్నం చేసినా సాధ్య పడలేదు. ఇక ఆ క్షణంనుంచి మేక్బెత్, యీ భూతాలు చెప్పినవి రెండు నిజమయ్యాయి. కనుక, మూడవది మాత్రం ఎందుకు నిజం కాకూడదు ? తను, స్కాట్లండ్ రాజు ఎందుకు కాకూడదు ? అనే తీవ్రమయిన ఆలోచన ప్రారంభించాడు.

మేక్బెత్, బాంకోలు రాజు డంకన్ దగ్గరికి వచ్చారు. రాజుగారికి ఎంతో సంతోషం కలిగింది. మేక్బెత్‌కి ఎంతగానో ఋణపడి వున్నానని, అందుకు మేక్బెత్ యింటికి స్వయంగా వచ్చి అతన్ని గౌరవించదలుచుకున్నానని చెప్పారు. వెంటనే భూతాలు కనపడిన దగ్గిర నుంచి జరిగిన విషయాలన్ని భార్య లేడీ మేక్బెత్‌కి తెలియపరిచాడు. రాజుగారు త్వరలోనే తమ యింటికి వస్తున్నారని, కావలసిన ఏర్పాట్లన్ని కూడా చేయవలసినదిగా ముందుగా కబురు పంపాడు,

లేడీ మేక్బెత్ స్త్రీలందరి వంటిదికాదు. తాము ఎంతో గొప్ప వాళ్ళము కావాలనే ఆశ ఆవిడకి చాలా ఎక్కువ. ఆ వుత్తరంలోని విషయాలు ఆవిడ అత్యాశని రేకెత్తించాయి. తన భర్త స్కాట్లండు రాజు ఎందుకు కాకూడదు? డంకన్ కంటె ఏవిషయంలోనూ తీసిపోడే! ఏమైనా సరే తన భర్తని రాజుని చేయడానికి తను చేయగలిగినదంతా చేసి తీరాలనుకుంది. తన కోరిక నెరవేరడానికి అడ్డుగావున్నదల్లా డంకన్ మాత్రమే ననుకుంది. ఆ అడ్డు తీసిపారేస్తే సరిపోతుంది కదా, అని ఆలోచించింది. రాజు తన యింటికే వస్తున్నాడు. ఇంతకంటె చక్కని అవకాశము దొరకదు, అని నిశ్చయించుకొంది. కాని తన భర్తసంగతి తనకు బాగా తెలుసు. అతని హృదయం చాలా సున్నితమయినది. అతనికి కోరికలున్నాయి. కాని ఆ కోరికలు నెరవేరడానికి అనుసరించవలసిన కాఠిన్యత, దుర్మార్గం అతనిలో లేవు. తనకి కావాలనుకున్నది సరైన మార్గంలోనే సాధించుకోవాలను కుంటాడు. "అదెలా సాధ్యపడుతుంది?" అనుకుంది.

"ఇంటికి త్వరగారా. నీలోని పిరికి తనాన్ని నా గంభీరమైన మాటలతో తరిమివేస్తాను. నీకు, ఆ కిరీటానికి వున్న అడ్డం తీసిపారేస్తాను. నిన్ను రాజుని చేస్తాను," అని తనలో నిర్ణయించుకుంది.

మేక్బెత్‌తో తను వేసిన పధకం అంతా చెప్పింది. వచ్చినరోజు రాత్రే డంకన్‌ని చంపివేయాలి. మేక్బెత్ చంపాడని ఎవరు అనుమానిస్తారు? రాజుతో కూడా వచ్చిన సేవకులకి రాత్రి బాగా త్రాగుడుపోసి, వాళ్ళు గాఢమయిన నిద్రలో వుండగా, మేక్బెత్ డంకన్ గదిలోకి వెళ్ళి నిరాయుధుడుగా, నిర్భయంగా నిద్రపోతున్న డంకన్‌ని కత్తితోపొడిచి చంపి, ఆ నెత్తురు రాజభటుల చేతులకి, మొహాలకి పూసి తిరిగి వచ్చెయ్యాలి. మర్నాడు వుదయం యీ పని చేసినదంతా ఆ భటులేనని

వారిని లేకుండా చేయడం. ఈ విధంగా ఒక చక్కని పథకం ఏర్పాటు చేసింది.

అనుకున్న విధంగా రాజు డంకన్ మేక్బెత్ భవనానికి వచ్చాడు, ఆ ప్రదేశం కూడా అతనికి ఎంతగానో వచ్చింది. ఎంతో ఆనందంగా వున్నాడు. భార్య, భర్తలు ఇద్దరూ చూపిన అతిధి మర్యాదలకు రాజు చాలా సంతోషించాడు. మేడపైన తన కోసం ఏర్పాటు చేసిన గదిలో ప్రయాణ బడలికలో వున్నరాజు త్వరగా నిద్రపోయాడు. ఆచారం ప్రకారం తన అంగరక్షకులు యిద్దరూ ఆ గదిలోనే పడుకున్నారు.

అర్ధరాత్రి సమయం ఏర్పాట్లన్నీ పూర్తయ్యాయి మేక్బెత్ సంధిగ్దావస్థలో పడ్డాడు. "ఈ రాజు నాయింట్లో, నా మీద వుండే నమ్మకంతో గాఢంగా నిద్రపోతున్నాడు. అతను నాకు బంధువే కాకుండా, నా యింటికి వచ్చిన అతిధి. అటువంటి వాడిని యితరులెవ్వరూ హాని చేయకుండా రక్షించవలసిన బాధ్యత నామీద వుంది. అలాంటిది అతన్ని నేనే, నా చేతులతో చంపడమా? ఇవన్నీ కాక, డంకన్ చాలా వుత్తముడు. అతనంటె అందరికి గౌరవం, ప్రేమ వున్నాయి. అటువంటి వాడి ప్రాణాలు విలువునా తీయడానికి నాకు చేతులు రావడం లేదు. కానీ వాటన్నిటిపై నేను రాజు కావాలనే నా కోరిక అధికమిస్తోంది" అనుకున్నాడు. లేడీ మేక్బెత్‌ని చూసి, "నిర్ణయం మార్చుకున్నాను ఇక ఈ పని విరమించుకుందాం. నన్ను కొద్ది క్షణాల క్రితం పొగిడి ఆదరించిన మనిషిని ఎలా చంపడం?" అన్నాడు. లేడీ మేక్బెత్‌కి ఎంతో కోపం వచ్చింది. "నీకింత చంచలమైన బుద్ధి అని అనుకోలేదు. ఇప్పుడు నామీద నీకున్న ప్రేమకూడా యిలాంటిదే ననుకుంటా," అని హేళన చేసింది. "అసలు ఈ విషయం ఎందుకు ఆలోచించావు. మరి యిప్పుడు ఎందుకు ఇలా పిరికి వాడివైపోతున్నావు? నువ్వు రాజువి కావాలని ఆశ

కున్నపుడు, యిప్పుడున్న అనుకూల పరిస్థితులు లేవే? అన్నీ అను కూలంగా వున్నపుడు పిరికి పందలా యిలా జారిపోతున్నావా? నేనుస్త్రీని. చంటి పిల్లకి పాలిచ్చాను నీలాగే నేను యిటువంటి నిర్ణయం ఏదైనా తీసుకుని వుంటే, నా దగ్గర పాలు తాగుతూ, నా వైపు నవ్వుతూ చూస్తున్న పాపని బలవంతంగా నా నుంచి లాగేసి చంపి పారెయ్యడానికి కూడా వెనుకాడను తెలుసా?" అని అంది చాలా కోపంగా. మేక్బెత్‌కి మతిపోయింది. ఆ మాటలు వినేసరికి. "మరి ఈ పని చేయడంలో విఫ లమవుతేనో" అని సందేహం వెలిబుచ్చాడు. ఆ భయమేమి అక్కర్లేదు, అని తను చేసిన ఏర్పాట్లన్నీ వివరంగా చెప్పి మేక్బెత్ చేయవలసిన పనేమిటో కూడా చెప్పింది. మేక్బెత్‌కి యిప్పుడు ఎక్కడలేని ధైర్యం వచ్చింది. భార్యని మెచ్చుకున్నాడు." నీ కున్న ధైర్యానికి నీ నుండి మగ సంతానం తప్ప యింకెవరు వస్తారు. అన్నాడు. కార్యనిర్వహణకి వుపక్రమించాడు

అంతా సిద్ధమయ్యాక పైకి వెళ్ళడానికి బయలుదేరిన సమయంలో మేక్బెత్ కత్తి పిడి తన వైపుకి వస్తూ కనపడింది. పట్టుకోబోతే దొరక లేదు. కళ్ళకి కనపడుతూ చేతికి అందకుండా వున్న యీ కత్తి నిజమైన దేనా లేకపోతే తనని తప్పుదారిలో పెట్టడానికి కనపడ్డ మానవాతీత శక్తి ఏదైనా తనకి కనపడిందా, అనుకున్నాడు. ఆ కత్తిమీద నెత్తుటి మర కలు కూడా కనపడ్డాయి. మేక్బెత్‌కి మరీ మతిపోయింది. ముందుకి సాగాడు.

ఇక క్రింద లేడీ మేక్బెత్ పరిస్థితి మరీ ఆందోళనకరంగా వుంది. గుడ్లగూబ అరిచింది. తలుపు తెరిచిన చప్పుడయింది, భటులు ఒళ్ళుమరచి నిద్రలో వుండి వుంటారు అనుకుంది. ఇంతలో "ఎవరు అక్కడ ?" అన్న మేక్బెత్ మాటలు వినపడ్డాయి. లేడీ మేక్బెత్ గుండెలు గుభేలు

మన్నాయి. అన్నీ అక్కడ సిద్ధంగానే వుంచానే! ఎలా కనపడకుండా వుంటాయి కత్తులు. నేను పైకి యీ ఏర్పాట్లు చెయ్యడానికి వెళ్ళినపుడు నిద్రపోతున్న డంకన్‌ని చూసినపుడు నా తండ్రి పోలికలు కనపడకుండా వుంటె ఆ కార్యం నేనే పూర్తిచేసేదాన్ని కదా, అనుకుంది. ఇంతలోనే మేక్బెత్ ఎదురుగా వచ్చాడు చేయవలసిన పనంతా పూర్తి చేసుకుని వచ్చానన్నాడు. చేతులకేసి చూసుకుంటూ ఇది భరించలేని దృశ్యం అన్నాడు. భార్య అర్థం చేసుకుంది. భర్తలో వస్తున్నమార్పుని. అలా అనుకోవడం మరీ భరించలేని విషయమంటూ అతని మనస్సు మార్చడానికి ప్రయత్నం చేసింది. మేక్బెత్ ఆ విషయాన్నే మరీ మరీ తలుచుకుని కుమిలిపోయాడు. నేను నిద్రలో ఉన్న రాజుని చంపాను. నా జీవితంలో నేను మళ్లీ నిద్రకి నోచుకోనేమో." అనుకున్నాడు. ఇదంతా చూసి అతన్ని లేడీ మేక్బెత్ మందలించింది, రక్తపు కత్తులు అలాగే చేత్తో పట్టుకుని రావడం చూసి, మళ్ళీ పైకి వెళ్ళి అనుకున్న విధంగా ఆ కత్తుల్ని భటుల చేతులలో ఉంచి, వాళ్ళ మొహాలకి రక్తపు చేతుల్ని పులిమి రమ్మని పంపించింది. నేను ఏమైనాసరే పైకి వెళ్ళి చచ్చి పడి ఉన్న డంకన్ మొహం చూడలేనన్నాడు. "పిరికిపందా! అయితే ఆపని నేను చేసివస్తాను" అని చెప్పి పైకి వెళ్లింది. తిరిగివచ్చి, "నా చేతులు చూడు, నీ చేతులున్న రంగులోనే వున్నాయి, కాని నేనుమాత్రం నీలాంటి పిరికిపందని కాదు" అంది, ఇంతలో ఎవరో వచ్చి తలుపుతట్టిన చప్పుడయింది. ఎవరి గదిలోకి వాళ్ళు వెళ్లిపోయారు.

మరునాడు ఉదయం డంకన్‌ని ఎవరో హత్యచేసిన విషయం కమక్కోవడంతోటే భయభ్రాంతులు ఆ ప్రదేశమంతా ఆవరించాయి ...క్బెత్ వెంటనే డంకన్ గదికి వెళ్ళి అక్కడ వున్న ఇద్దరు సేవ ...ల్ని, వాళ్ళే ఈ పని చేసి వుంటారని నమ్మినట్లు ప్రవర్తించి, హ...

మార్చాడు. రాజుతో కూడా రాజు కుమారులు మాల్కాం, డోనాల్బ యిన్‌లు వచ్చి ఆ భవనంలోనే మరో గదిలో ఉన్నారు. తండ్రి హత్య జరగడం హంతకులుగా భావించబడ్డ సేవకుల్ని మేక్బెత్ అనుమానించి చంపడం జరిగిందని తెలుసుకుని, అదంతా మేక్బెత్ చేసినదని నమ్మి తమకి కూడా అగతే పడుతుందని భయపడి దేశం విడిచి పారిపోయారు. ఇది కూడా ఆసరాగా తీసుకొని మేక్బెత్ డంకన్‌ని కొడుకులే హత్య చేయించారని అందరికీ నచ్చచెప్పాడు.

డంకన్‌కి మిగిలిన దగ్గర బంధువు మేక్బెత్ మాత్రమే. ఆలస్యం లేకుండా స్కాట్లండ్ దేశానికి రాజయి సింహాసనం అధిష్టించాడు. ఈ విధంగా భూతాలు మేక్బెత్ విషయంలో చెప్పినవన్నీ నిజమయ్యాయి. తను రాజయ్యాననే సంతోషంకంటె భూతాలు బాంకో సంతానం గురించి చెప్పిన విషయానికి భయం ఎక్కువయింది, ఎలాగయినా బాంకో కొడుకుని చంపిస్తేగాని తనకి మనశ్శాంతి లేదు. స్కాట్లండ్ లోని సామంతులందరికి ఒక పెద్ద విందు ఏర్పాటు చేసాడు. ఆ విందుకి బాంకోని, కొడుకుని కూడా ఆహ్వానం చేసాడు. వాళ్లిద్దరూ విందుకు ముందు బయటికి వెళ్ళి తిరిగి వస్తుంటె మధ్యలో వాళ్ళిద్దర్ని చంపడానికి యిద్దరు కిరాయి హంతకుల్ని ఏర్పాటు చేసాడు. వాళ్ళు కాపుకాసి చంపడానికి ప్రయత్నం చేయడంలో బాంకో చంపబడ్డాడు. కాని అతని కొడుకు తప్పించుకు పారిపోయాడు. మేక్బెత్ ఇప్పుడు హాయిగా గాలి పీల్చుకున్నాడు బాంకో అడ్డుతొలగిపోయినందుకు. బాంకో కొడుకు తప్పించుకు పోయిన విషయం అతన్ని అంతగా బాధపెట్టలేదు.

విందు ప్రారంభమయింది. అందరూ వచ్చారు. బాంకో రాలేదు. మేక్బెత్ దానికి ఎంతో బాధపడినట్లు ప్రవర్తించి, తన స్థానంలో కూర్చో

డానికి వెళ్లాడు. అక్కడ ఎవరో కూర్చున్నారు. ఎవరోకాదు, బాంకో దయ్యం. "ఎవరు నువ్వు? ఎందుకు వచ్చావు?" అంటూ అరిచాడు. ఎవరితో ఇలా మాట్లాడుతున్నాడో ఎవరికీ అర్థంకాలేదు. లేడీ మేక్బెత్ పరిస్థితిని అర్థం చేసుకొని మేక్బెత్‌కి అప్పుడప్పుడు ఇటువంటి మతి భ్రమించిన మాటలు అలవాటని, అందర్నీ పంపించి వేసింది. మేక్బెత్‌ని చాలా కోపంగా మందలించింది. మేక్బెత్ స్థిమితపడ్డాడు.

ఇప్పటికి భూతాలు చెప్పినవన్నీ తన విషయంలో నిజమయ్యాయి మరొకసారి వాటిని కలుసుకొని సలహా తీసుకుందామనిపించింది. తన సింహాసనం మీదకు రావటానికి యిప్పటికి నలుగురి శవాలమీద నుంచి నడిచాడు. ఇప్పుడు ఈ స్థానాన్ని ఎలాగైనా, నిలబెట్టుకోవాలని అందుకు ఇంకా ఎంతమందిని చంపాలో తప్పదు మరి అనుకున్నాడు. మేక్డఫ్ అనే ఒక థేన్ వున్నాడు. అతనిమీద ఎందుకో మేక్బెత్‌కి అనుమానం, అతన్ని కూడా హతమార్చడం మంచిదనుకున్నాడు.

భూతాలు దగ్గరకి వచ్చాడు. ఈసారి ఆ భూతాలు తీసుకోవలసిన జాగ్రత్తలు గురించి హెచ్చరించడమే కాకుండా, కొన్ని వాగ్దానాలు కూడా చేసాయి. "మేక్బెత్‌ని ఒక కంట కనిపెట్టి వుండు," అని ఒక భూతం చెప్పింది. మేక్బెత్ అనుమానం నిజమయింది. అయితే వెంటనే అతనికి వూరట కలిగించే విషయం ఒకటి చెప్పింది. "ఫరవాలేదు. నిన్నెవరూ ఏమీ చేయలేరు. స్త్రీకి పుట్టిన ఏ మానవుడు నిన్ను ఏమీ చేయలేడు" అని చెప్పింది. చివరగా "బర్నమ్ అడవి, డన్సినేన్' కొండ పైకి వచ్చేవరకు ఎవరూ నిన్ను జయించ లేరు." అని కూడా చెప్పింది.

మేక్బెత్‌కి యిప్పుడు ఎంతో ధైర్యం వచ్చింది. అడవిలోని చెట్లు తన కోట దగ్గరికి వచ్చి తనతో ఎలా యుద్ధం చేస్తాయి. అంటే ఎవ్వరూ నన్ను ఓడించలేరన్నమాట. అలాగే స్త్రీకి పుట్టని మానవుడు ఎ

వుంటాడు. అంటే ఏ మానవుడికి నేను భయపడవలసిన అవసరం లేదన్నమాట అని అనుకున్నాడు.

మేక్డెఫ్‌ని చంపడానికి మనుషుల్ని పంపించాడు. అప్పటికే మేక్డెఫ్ ఇంగ్లడుకి వెళ్ళిపోయి డంకన్ కొడుకుతో కలసి తనమీద యుద్ధానికి సన్నద్ధుడవుతున్నాడని తెలిసింది. పట్టలేని కోపం వచ్చింది. వెంటనే మనుషుల్ని వాళ్ళింటికి పంపి మేక్డెఫ్ భార్యని, పిల్లల్ని అతి క్రూరంగా చంపించాడు.

మాల్కం, మేక్డెఫ్‌లు ఇంగ్లండు నుంచి తగినంత సేన తీసుకొని స్కాట్లండ్ మీదికి యుద్ధానికి బయలుదేరారు. దారిలో ఉన్న చాలా మంది సామంతరాజులు తమ సేనలతో సహా వాళ్ళతో చేరారు. ఇప్పుడు చాలా బలమయిన సేనతో శత్రువులు తనమీదికి దండెత్తి వస్తున్నారని తెలిసింది మేక్బెత్‌కి. ఎటుపోవడానికి వీలులేకుండా సేనలు తనమీదికి వస్తున్నాయి. బాగా ఎత్తుగా వున్న డన్సినేన్ కొండమీదికి వెళ్ళాడు. భూతాలు చెప్పిన మాటలు కొంత ధైర్యాన్నిస్తున్నా, అప్పుడప్పుడు మనో నిబ్బరం కొంత సడలుతోంది. డంకన్‌ని చంపిన రాత్రినించి ఒక్క కునుకు కూడా నిద్రలేకుండా పోయింది.

ఇక లేడీ మేక్బెత్ పరిస్థితి మరీ దుర్భరంగా తయారయింది. రాత్రులు భయంకరమయిన కలలతో గడుస్తున్నాయి. నిద్రలో లేచి ఏదో మాట్లాడుతూ ఇల్లంతా తిరుగుతోంది. ఆ మాట్లాడ్డంలో "ఆ ముసలివాడి ఒంట్లో యింత నెత్తురుందని ఎవరనుకున్నారు?" అంది. ఇలాగే అనేక మయిన రహస్యాలు మాట్లాడేసేది. మేక్బెత్ ఒక వైద్యుణ్ణి పంపించాడు. ఆమె జబ్బు నయం చేయడానికి. ఆవిడ జబ్బుకి ఇతరులు ఎవరూ ఏమీ చేయలేరని వైద్యుడు చెప్పాడు. ఇది జరిగిన కొద్ది రోజుల్లోనే లేడీ మేక్బెత్ భరించలేని దుఃఖంలో తన ప్రాణాలు తీసుకుంది.

ఈ వార్త మేక్బెత్‌కి చాలా బాధ కలిగించింది. జీవితం మీద ఎంతో విరక్తి కలిగింది. తను రాజునయితే ఎన్నో సాధించవచ్చు ననుకున్నాడు. సాధించింది ఏదీ లేదు. అన్నీ పోయాయి. మనశ్శాంతి కూడా లేకుండా పోయింది. "జీవితం అంతా ఒక మాయ. ఇదంతా ఒక నాటకం ఆ నాటకంలో మనమంతా పాత్రదారులు. ఒక్కొక్కరి పాత్రతే ముగియడంతోటే వారంతా నిష్క్రమిస్తారు. మళ్లీ వాళ్ళని గురించిన ప్రసక్తి వుండదు. జీవితం అంటే ఒక పిచ్చివాడు చెప్పే ఒక అర్థంలేని కథ." అనుకున్నాడు.

ఇంతలోనే ఒక వార్త వచ్చింది, మాల్కం సేనలు చాలా దగ్గరగా వస్తున్నాయని. తనకేం ఫరవాలేదనే ధీమాతో వున్నాడు. కావేపటికి ఇంకొక వార్త. బిర్నమ్ అడవి నడిచి డన్సినేన్ కొండమీదికి వస్తోందని. ఆ వార్త తెచ్చిన వాడిమీద పిచ్చి కోపం వచ్చింది. "నువ్వు చెప్పింది అబద్ధమయితే నిన్ను ఉరి తీస్తాను, నిజమయితే ఆ పని నువ్వు నాకు చెయ్యి," అన్నాడు.

అసలు జరిగిన విషయం వేరు. మాల్కం కొండ దగ్గరికి వచ్చి, సైనికులందర్నీ చెట్టు కొమ్మలు నరికి వాటిని పట్టుకొని, పైకి నడిచి వెళ్ళమని ఆజ్ఞాపించాడు. అలాగయినట్లయితే కొండ పై నుంచి చూస్తున్న శత్రువుకి వాళ్ళకి ఎంత సైనిక బలం ఉన్నదీ తెలియకుండా వుంటుందని వుద్దేశ్యం.

రెండు సైన్యాలు ఎదురెదురుగా యుద్ధం చేస్తున్నాయి. మేక్బెత్ తన ఎదురుగా వచ్చిన వాళ్ళందరిని చంపుకుంటూ సాగిపోతున్నాడు. మేక్డఫ్ ఎదురయ్యాడు. "ఇప్పటికే నీ కుటుంబంలో వాళ్ళ రక్తం చాలా చిందించాను నిన్ను చంపదలుచుకోలేదు. నా ముందు నుంచి వెళ్ళిపో", అన్నాడు. మేక్డఫ్ తన భార్య పిల్లలని చంపిన మేక్బెత్‌ని తన చేత్తు

లతో చంపాలనే పట్టుదలతో ఉన్నాడు. తన ముందునించి వెళ్ళకుండా యుద్ధం చేస్తుంటే, నీ ప్రయత్నమంతా వృధా. నువ్వు నన్నేం చెయ్య లేవన్నాడు. స్త్రీనించి పుట్టిన మానవుడెవ్వడూ నన్నేం చెయ్యలేడు అన్నాడు. మేక్డెఫ్ దానికి సమాధానంగా అయితే ఆశవదలుకో. నేను నా తల్లి గర్భంలోంచి, పుట్టవలసిన సమయానికి ముందే నన్ను బయటికి తీసారు, అన్నాడు.

మేక్బెత్‌కి యిప్పుడు అర్థమయింది, భూతాలు ఈ రెండు విష యాలలోను తనను ఎంత మోసం చేసాయో. ఇద్దరూ తీవ్రంగా పోట్లా డారు. చివరకి మేక్డెఫ్ చేతిలో మేక్బెత్ చంపబడ్డాడు. మాల్కాం స్కాట్లండ్ దేశానికి రాజయినాడు.

# "పన్నెండవ రాత్రి"

# Twelth Night

మెసలినా అనే పట్టణంలో వుంటున్న సెబాస్టియన్, అతని సోదరి వయోలా, కవలలు. చాలా విచిత్రంగా వాళ్ళిద్దరూ అచ్చుగుద్దినట్లు ఒకేలా గున్నారు. వాళ్ళిద్దరూ ఒకే లాగున దుస్తులు ధరిస్తే ఎవరు సెబాస్టియనో, ఎవరు వయోలియో చెప్పడం చాలా కష్టం. వారి తల్లి తండ్రు లిద్దరూ పోయారు. ఈ కవలలకి ఒకరంటె యింకొకరికి ప్రాణం.

ఒకరోజున యిద్దరూ "ఇలీరియా" తీరప్రాంతంలో ఓడ ప్రయాణం చేస్తున్నారు. అకస్మాత్తుగా తుఫాను వచ్చి, వారి ఓడ ధ్వంసమయి పోయింది. అందులోని ఎంతోమంది నావికులు మునిగిపోయారు. వయోలా మాత్రం ఒక చిన్న పడవలో ఆ ఓడ కెప్టెన్, కొందరు నావికులతో పాటు క్షేమంగా ఒడ్డుకి చేరుకోగలిగింది. తను బ్రతికి బయట పడింది నీ, తన సోదరుడు ఏమయినాడో తెలియలేదు. అతను బ్రతికివున్నాడా, గతా వాళ్ళతోపాటు మునిగిపోయాడా ? కెప్టెన్ ఆమెను ఓదార్చాడు,

ఆమె సోదరుడు ఒక తెరచాప దుంగను పట్టుకుని తేలుతూ వెళ్ళిపోతూం డడం కనుచూపు వరకూ చూసానని చెప్పాడు. ఎక్కడో ఒడ్డుకి అలలు అతనివి తీసుకువెళ్ళి వుంటాయి తప్పకుండా అని చెప్పి, వయోలాకి ధైర్యం కలిగించాడు.

ఆ కొత్త ప్రదేశం ఇలీరియాలో ఏంచేయాలో వయోలాకి అర్థం కాలేదు. కేప్టెన్‌ని ఆ వూరు గురించి అడిగితే, ఆ వూరు తనకి బాగా తెలుసునని, తను పుట్టి, పెరిగిన వూరు అక్కడకి దగ్గరలోనే వుందని చెప్పాడు.

ఆ ప్రదేశాన్ని ఆర్సినో అనే ఒక డ్యూక్ పరిపాలిస్తున్నాడని, అతను చాలా ఉత్తముడని, అవివాహితుడని, అక్కడే వుంటున్న "వొలీవియా" అనే ఒక అందాలరాశిని గాఢంగా ప్రేమించాడని, అతని ప్రేమని ఆమె తిరస్కరించిందని, అయినా సరే ఆమెను తప్ప మరెవ్వ రినీ పెళ్ళిచేసుకోననే పట్టుదలతో ఉన్నాడని ఆ కేప్టెన్ చెప్పాడు. ఆమెను గురించి తెలుసుకోవాలనే కుతూహలంతో వయోలా కేప్టెన్‌ని వివరాలు అడిగింది. ఆమె ఒక గొప్ప కౌంట్ కూతురని, ఆమె తండ్రి సంవత్సరము క్రితమే, తన అన్న చేతుల్లో ఆమెను వుంచి మరణించా డని, తండ్రి మరణించిన కొద్దికాలానికే అన్న కూడా మరణించాడని చెప్పాడు. ఆ దుఃఖభారముతో ఆమె యిల్లు దాటి బయటికి ఎక్కడికి వెళ్ళలేదు. ఇంటికి వచ్చిన వారిని ఎవరినీ కూడా చూడ్డానికి యిష్టపడడం లేదని చెప్పాడు కెప్టెన్ వొలీవియా వృత్తాంతాన్ని క్లుప్తంగా. తను కూడా యిప్పుడు అన్నను పోగొట్టుకొని, వొలీవియా వున్న దురవస్థ లోనే వుండడం వల్ల ఆమె మీద ఎందుకో చాలా జాలి కలిగింది. ఆమెకు ఎలాగైనా సహాయ పడాలనిపించింది. కెప్టెన్‌తో తను ఆమె దగ్గరవుండి సేవ చేయాలని వుందని చెప్పింది. అది ఎంత మాత్రం వీలయే పని

కాదని చెప్పాడు కెప్టెన్. అయితే డ్యూక్‌కి సేవ చేస్తాననిచెప్పి కెప్టెన్‌ని దానికి కావలసిన సహాయం చేయమని అడిగింది. అతనికి కొంతడబ్బు యిచ్చి, తను పురుష వేషం వేసుకోవడానికి కావలసిన దుస్తులు తెచ్చి పెట్టమని అడిగింది. తనని డ్యూక్ దగ్గరకి తీసుకువెళ్ళి అతని దగ్గర పరిచారకులుగా వుండడానికి ఏర్పాటు చేసిపెట్టమని కోరింది. అతనికి పాటలు పాడి, ఆహ్లాదం కలిగించే అన్ని పరిచర్యలు చేస్తానని, తనను గురించిన అసలు విషయం ఎవరికీ చెప్పవద్దని కూడా అతన్ని కోరింది.

కెప్టెన్ చాలా మంచివాడు. అలాగేనని వాగ్దానం చేశాడు. యువకుడికి కావలసిన దుస్తులు తెచ్చి ఆమెకిచ్చాడు. ఆ దుస్తులు వేసుకుంటే అచ్చు తన సోదరుడు సెబాస్టియన్ లాగేవుంది. కెప్టెన్‌కి కూడా చాలా ఆశ్చర్యం వేసింది. డ్యూక్ దగ్గరకి ఆమెను తీసుకు వెళ్లాడు. ఇపుడు ఆమె "సిజేరియో"గా మారింది. ఆ యువకుడ్ని చూడ్డంతోటే డ్యూక్‌కి ఎంతో ఆప్యాయత కలిగింది. వెంటనే తన దగ్గర సేవకుడిగా వుంచుకోవడానికి యిష్టపడ్డాడు. ఈ "సిసేరియో" యువకుడు కాదు, వయోలాయేనని కెప్టెన్‌కి తప్ప మరెవ్వరికి తెలియదు.

ఇక డ్యూక్ దగ్గర "సిసేరియో" ఎంతగానో సేవచేస్తూ, అతన్ని ఆట పాటలతో ఎంతో ఆనందింప చేస్తున్నాడు. ఎప్పుడయినా అతని మనసు వ్యాకులత చెందితే మంచి మాటలతో అతన్ని వూరడిస్తున్నాడు. డ్యూక్‌కి "సిసేరియో" చాలా సన్నిహితుడయ్యాడు. దానితో డ్యూక్ తన ప్రేమ కథవంతా చెప్పాడు. వొలీవియా ఎంత కాఠిన్యంగా ప్రవర్తిస్తోందో కూడా చెప్పాడు. "సిసేరియో"కి అతని మీద ఎంతో జాలి కలిగింది. ఇలా రోజులు గడుస్తువ్న కొద్దీ "సిసేరియో" రూపంలో వున్న వయోలాకి డ్యూక్ మీద ప్రేమ కలిగింది. కానీ అది తనలోనే దాచుకొంది, పైకి వెల్లడి చేయడానికి తగిన పరిస్థితులు అనుకూలంగా దువల్ల.

కొద్ది కాలంలోనే సిసేరియోని డ్యూక్ వాలీవియా దగ్గరకి ఒక ప్రేమలేఖ తీసుకొని వెళ్ళే పనికి వినియోగించాడు. ఆమెతో నేనెంతగా ప్రేమిస్తున్నానో చెప్పు. ఆమె అంత నిర్దయగా ఉన్నా, నాకు మాత్రం ఆమెమీద ప్రేమ అధికం అవుతోందేకాని, తగ్గలేదు. నా ప్రాణంపోయే వరకు ఆమెను తప్ప యింకెవ్వరిని గురించి ఆలోచించనని కూడాచెప్పు. యవ్వనంలో వున్న కారణంగా ఈ పనికి నువ్వే సరి అయిన దూతగా భావించి పంపుతున్నాను. నీ మాటలు తప్పకుండా వింటుంది. వెళ్ళి నేను చెప్పిన విధంగా చెయ్యి, అని చెప్పి పంపాడు,

వయోలా చాలా బాధతో, భారమైన హృదయంతో బయలు దేరింది. తను ప్రేమిస్తున్న డ్యూక్ కి, డ్యూక్ ప్రేమిస్తున్న వాలీవి యాకు మధ్య తను రాయభారం నడపటమా! అనుకుంది. గేటు దగ్గరే ఆమెను, వాలీవియా భటులు ఆపేశారు. ఆవిడ ఆజ్ఞలేనిదే ఎవరూ లోపలికి వెళ్ళడానికి వీలులేదన్నారు. ఆమెతో మాట్లాడి తీరవలసినదే నని పట్టుబట్టేసరికి, యింక చేసేదిలేక ఆ భటుడు వాలీవియాతో అంతా చెప్పాడు. ఆ యువకుడు చాలా అందంగా వున్నాడని కూడా చెప్పాడు. ఆ మాట వినేసరికి వాలీవియాకి అతణ్ణి చూడాలనే కుతూహలం కలిగి లోపలికి పంపమంది.

సిసేరియో లోపలికి వచ్చేసరికి వాలీవియా, తన దాసీలమధ్య ముఖానికి పూర్తిగా పర్దావేసుకుని కూర్చుని ఉంది. "నేను వాలీవి యాతో మాట్లాడటానికి వచ్చాను. మీలో వాలీవియా ఎవరు? నేను ఒక చక్కటి ప్రసంగం కంఠోపాఠం చేసుకుని వచ్చాను. దీన్ని యింకె వరి ముందు వృథా చెయ్యదలుచుకోలేదు" అన్నాడు సిసేరియో. ఆ మాట లకి వాలీవియా నవ్వుకుని, "నేనే వాలీవియాని", అని చెప్పింది.

"అయితే మిగతా స్త్రీలందరిని పంపించి వెయ్యి. నేను చెప్పదలుచుకున్నది. కేవలం నువ్వు వినవలసినది మాత్రమే" అన్నాడు. ఇలా పరదాగా మాట్లాడుతున్న యువకుడి మీద ఎందుకో వొలీవియాకి స్నేహభావం కలిగింది. "నన్ను నీ ముఖాన్ని చూడనిస్తావా?" అని అడిగాడు. వెంటనే ముఖానికి వేసుకున్న పరదా తొలగించి వేస్తూ "బొమ్మ ఎలాగుంది?" అని అడిగింది. "చాలా బాగుంది, ఆ అందమంతా భగవంతుడి సృష్టి అయితే" అని సమాధాన మిచ్చాడు సిసేరియో. తరువాత డ్యూక్‌కి వొలీవియా మీద వున్న ప్రేమ గురించి ప్రస్తావన మొదలు పెట్టాడు. "నీ కోసం నిద్రాహారాలు మాని ఎంతో దిగులుగా వుంటున్నాడు. నేనే కనక నా యజమాని ప్రేమించినంతంగా నిన్ను ప్రేమించి వుంటె నీ ద్వారం దగ్గరే గుడిసెవేసుకొని అక్కడే పడి వుండేవాడిని. ప్రతి క్షణం నీ పేరు స్మరించుకుంటూ గడుపుతూ వుండేవాడిని. నామీద నీకు జాలికలిగి నా మాటలు వినేదాకా అలాగేవుండేవాడిని" అన్నాడు.

"అయితే నిన్ను చూసి జాలిపడుతున్నాను. నీ మాటలు వింటాను. చెప్పు" అంది వొలీవియా. ఇప్పుడామెకి సిసేరియో మీద వున్న అభిమానం ప్రేమగా మారిపోయింది. "నీ యజమాని డ్యూక్ మీద మాత్రం నాకేమీ సానుభూతి లేదు. అతని గురించి విషయాలు ఏమీ వినను. వెళ్ళి అతనితో ఆ మాటలు చెప్పు. మళ్ళీ రేపు డ్యూక్ యీ సమాధానాన్ని ఎలా తీసుకున్నాడో చెప్పడానికి రా" అంది. సిసేరియోకి కొంత డబ్బు యివ్వబోయింది. అతడు తీసుకోలేదు. వెళ్ళిపోయాడు. వెళ్ళిన మరుక్షణమే అతనిని చూడాలనే కోరిక ఎక్కువయింది. భటుడ్ని పిలిచి, డ్యూక్ పంపిన దూతకి అతను వద్దంటున్నా వినిపించుకోకుండా యిచ్చి వెళ్ళిన వుంగరాన్ని యిచ్చివేసి రమ్మని పంపింది. "మళ్ళీ నా

దగ్గర డ్యూక్ ప్రస్తావన తీసుకురావద్దని స్పష్టంగా చెప్పు. రేపు మళ్ళీ వచ్చినట్లయితే నా కారణాలేమిటో చెబుతాను. రేపు మాత్రం తప్పకుండా రమ్మని చెప్పు" అని కూడా చెప్పింది.

వెంటనే పరుగెత్తుకుంటూ వెళ్ళి వాలీవియా సేవకుడు సిసేరియోని కలుసుకుని, వుంగరాన్ని ఆమె యిచ్చిన సందేశాన్ని అందచేశాడు. సిజేరియో వాలీవియాకి ఏవిధమయిన వుంగరం యివ్వకపోవడం, యీ విధంగా ఆమె కబురంపడం చూసి సిజేరియోకి విషయ మర్థమయి పోయింది. వాలీవియా తనని ప్రేమిస్తోందని అర్థమయింది. "పాపం ఎంతటి యిబ్బందిలో పడింది యీ వాలీవియా. దీనివల్ల ఎన్ని యిబ్బందులు కలుగబోతున్నాయో? నేను డ్యూక్‌ని ప్రేమిస్తున్నాను. వాలీవియా నన్ను ప్రేమిస్తోంది. ఇక కాలమే మమ్మల్నందర్ని యీ చిక్కుముడి లోంచి బయటకు తీయగలదు" అనుకుంది.

సిజేరియో వచ్చి డ్యూక్‌తో వాలీవియా ఎంతమాత్రముస్పందించ లేదని చెప్పాడు. అయినా కూడా డ్యూక్ తన పట్టుదల వదల్లేదు. సిజేరియో అతని మనసు మార్చడానికి ప్రయత్నం చేశాడు. "నువ్వు వాలీవియా ప్రేమిస్తున్నంత గాఢంగానూ నిన్నే స్త్రీ అయినా ప్రేమిస్తే, నువ్వు ఆమెను ప్రేమించలేవనే సమాధానం యిస్తే ఆమె ఎలా సమాధాన పరుచుకుంటుందో ఆలోచించు" అన్నాడు సిజేరియో. నేను వాలీవియాని ప్రేమిస్తున్నంతగా నన్నే స్త్రీ ప్రేమించడం జరగదు. అదీగాక పురుషులు ప్రేమించినంతగా స్త్రీలు ప్రేమించలేరు కూడా" అన్నాడు డ్యూక్.

"ఎందుకు ప్రేమించలేరు? అది నిజం కాదు. నా తండ్రికి ఒక కూతురు వుండేది. ఒకరిని ప్రేమించింది. ఆ ప్రేమ పైకి ఎవరితోను

చెప్పుకోకుండా తన హృదయంలోనే వుంచుకొని ఆ ప్రేమకి బలయి పోయింది" అన్నాడు సిజేరియో. "ఏమయింది ఆమెకి? ఆమె చనిపో యిందా? అని అడిగాడు డ్యూక్ నవ్వుతూ. దానికి సమాధానంగా "నా తండ్రికి కొడుకులయినా, కూతుళ్ళయినా అన్నీ నేనే" అని మాట మళ్ళించేశాడు.

డ్యూక్ మళ్ళీ వొలీవియా దగ్గరికి వెళ్ళి ఒక వుంగరం యివ్వ మని, సిజేరియోని పంపించాడు. వొలీవియా డ్యూక్ పంపించిన సందేశం వినడానికి ఎంతమాత్రము యిష్టపడలేదు. అతని పేరు తన దగ్గర మళ్ళీ ఎత్తవద్దనికూడా హెచ్చరించింది. నువ్వంటే నాకు ప్రేమ అని కూడా చెప్పేసింది. సిజేరియో వేషంలో వున్న వయోలాకి మతిపోయింది. ఏం సమాధానం చెప్పాలో తోచలేదు. "నువ్వంటె నాకు జాలి కలుగుతోంది. కాని నిన్ను నేను ప్రేమించలేను" అని సమాధానం చెప్పింది. "నేను ఏస్త్రీని కూడా వివాహం చేసుకోను" అని కూడా చెప్పి అక్కడి నుంచి బాధతో వెళ్ళిపోయింది.

ఇక వయోలా సోదరుడు సెబాస్టియన్ విషయానికి వస్తే, అతడు ఆరోజు వుదయమే ఆంటోన్నియో అనే కేప్టెన్‌తో కూడా ఆ పట్టణంలో దిగాడు. ఆంటోనియో, సెబాస్టియన్ మునిగిపోతూవుంటె రక్షించాడు. తన పడవమీద అతనిని తీసుకువెళ్ళాడు. వాళ్ళిద్దరిమధ్య మంచి స్నేహం ఏర్పడింది. మూడునెల్లపాటు యిద్దరూ కలసి అనేక పట్టణాలు తిరిగి చివరికి ఆర్సినో భవనానికి దగ్గరగా ఒడ్డుకి చేరుకున్నారు. సెబాస్టియన్ వూరులోకి వెళ్ళి అన్ని చూడాలనుకున్నాడు. ఆంటోనియోకి అతనితో కలసి వూళ్ళో తిరగడానికి కొంత యిబ్బంది వుంది. డ్యూక్ మేనల్లుడ్ని ొతకాలం క్రితం పడవమీద జరిగినపోట్లాటలో ఆంటోనియో తీవ్రంగా ొపరచాడు అందువల్ల ఇలీరియా పట్టణంలో అతడు కనపడితే

అతన్ని బందీగా తీసుకుంటారు. ఆ కారణంచేత సెబాస్టియన్‌ని ఒంటరిగా పంపాడు తను వెళ్ళకుండా. "చాలా జాగ్రత్త, నేను నీకోసం యిక్కడే కాచుకొని వుంటాను. నీకు కావలసినంత డబ్బు యిందులోంచి వాడుకో" అని చెప్పి అతని చేతికి చాలా డబ్బున్న పర్స్ యిచ్చాడు. ఆంటోని యోకి సెబాస్టియన్ అంటె ఎంతో ఇష్టం. అతను డబ్బుకోసం యిబ్బంది పడడం యిష్టంలేదు. కొన్ని గంటల్లోనే తిరిగివస్తానని చెప్పి సెబాస్టియన్ డ్యూక్ ఆర్సినో భవనంవైపుకి బయలుదేరి వెళ్ళాడు

ఒలీవియాకి ఒక మేనమామ ఉన్నాడు. అతనిపేరు సర్ టోబీ. అతనికి "సర్ ఆండ్రూ" అనే స్నేహితుడు ఉన్నాడు. అతడు వొలీవి యాని ప్రేమిస్తున్నాడు. అతని దగ్గరనుండి చాలా డబ్బు గుంజుతూ సర్ టోబి అతడిని బాగా పురిగొల్పుతున్నాడు. అతనికి వొలీవియా మీద లేనిపోని ఆశలు కల్పించాడు వొలీవియాకి అతనన్నా, సర్ టోబీ అన్నా చాలా కోపం, చికాకు కూడా. సిజేరియో అనే యువకుడు యిప్పుడు సర్ ఆండ్రూ ప్రేమకి అడ్డొచ్చాడు. అతని మీదకి యిప్పుడు సర్ ఆండ్రూని రెచ్చగొట్టాడు, అతడిని కత్తియుద్ధంలో ఓడించి తన ధైర్య సాహసాలు వొలీవియాకి అర్ధమయ్యేలా చేయమని చెప్పాడు. సర్ ఆండ్రూ చాలా పిరికివాడని అతనికి తెలుసు. అతనిచేత, తనతో పోటీకి రమ్మని సవాలు చేస్తూ సిజేరియోకి వుత్తరం రాయించి అతనికి యిచ్చాడు. సిజేరియో యీ అనుకోని పరిణామం చూసి, వొణికి పోయాడు. దానికితోడు సర్ టోబి, అతడు చాలా ధైర్యవంతుడు, బలశాలి అని కూడా చెప్పాడు. సర్ ఆండ్రూతో సిజేరియో కత్తి యుద్ధంలో చాలా ఆరితేరిన వాడని చెప్పాడు. ఇలా ఒకళ్ళమీద ఒకరికి విపరీతమయిన భయం కలిగేలా చేశాడు. ఇద్ద రినీ యుద్ధానికి సన్నద్ధం చేసాడు. ఒకరికి ఒకరు ఎదురుగా నిలబడి వున్నారు. ఇద్దరిచేతుల్లో కత్తులు వొణికిపోతున్నాయి. సిజేరియోకి స్పృహ

తప్పి పడిపోయేంత పనయింది. సరిగ్గా ఆ సమయంలో ఎవరో అపరిచితు డయిన వ్యక్తి. వచ్చి అతణ్ణి రక్షించాడు. "ఈ కుఱ్ఱవాడితోకాదు. ధైర్య ముంటె నాతో పోట్లాడు" అని సవాలు చేసాడు. ఆ వచ్చిన వ్యక్తి, ఎవరోకాదు, ఆంటోనియో. సెబాస్టియన్ ఎంతకి తిరిగి రాకపోవడంతో ఆందోళన చెంది తనే స్వయంగా వూళ్ళోకి వచ్చేసాడు. తన ప్రాణానికి అది చాలా ముప్పని తెలిసుండి కూడా. ఇక్కడ సిజేరియో వేషంలో వున్న వయోలాని చూసి, అతనే సెబాస్టియన్ అనుకొని, అతనిమీదికి కత్తిదూసి సర్ ఆండ్రూతో పోట్లాటకి సిద్ధపడ్డాడు.

వయోలాకి యిదంతా అయోమయంగా వుంది. ఆ వ్యక్తి ఎవరో ఆమెకి అర్థంకాలేదు. తనవైపు పోట్లాటకి ఎందు కుపక్రమిం చాడో అసలే అర్థంకాలేదు ఇంతలో డ్యూక్ మనుషులు అటువచ్చి, ఆంటోనియోని గుర్తుపట్టి, ఆతడిని నిర్బంధంలోకి తీసుకున్నారు. చేయ గలిగిందేదీ లేక ఆంటోనియో వారికి లొంగిపోయి వెళ్ళిపోతూ "నీకిచ్చిన పర్సు నాకు తిరిగిచ్చెయ్యి సెబాస్టియన్" అని అన్నాడు ఇతను ఎవరో తన సోదరుడికి బాగా తెలుసున్న మనిషని అర్థం చేసుకుంది. అయినా ఆ పర్సు సంగతేమిటో తనకి తెలియదు. అదే చెప్పింది. కావలసివస్తే నా దగ్గరున్న డబ్బు తీసుకోమని చెపుతూ, తన పర్సు యివ్వబోయింది. ఆంటోనియోకి చాలా కోపం వచ్చింది. తను ఎంతో సహాయం చేసిన వ్యక్తి తనకి యిబ్బంది కలిగినపుడు యిలా ప్రవర్తిస్తున్నాడేమిటా అని చాలా బాధ కూడా కలిగింది. డ్యూక్ భటులతో యీ కుర్రవాడు తనకి ఎంత ద్రోహం చేశాడో చెప్పాడు. వారు యీ విషయము ఏమీ పట్టించు కోకుండా ఆంటోనియోని తీసుకొని వెళ్ళిపోయారు. వెంటనే వయోలా కూడా అక్కడినుంచి వెళ్ళిపోయింది, మళ్ళీ సర్ ఆండ్రూ వచ్చి తనని ఎక్కడ కవ్విస్తాడో అని భయంతో.

వయోలా అక్కడినుంచి వెళ్ళిపోయిన కొద్దిసేపటికే సెబాస్టియన్ అక్కడికి రావడం తటస్థపడింది. సర్ ఆండ్రూ కూడా అప్పుడే అక్కడికి వచ్చి అతన్ని చూసి సిసేరియో అనుకున్నాడు. ఇంతకు ముందు అతడు చాలా పిరికివాడని అర్థమయింది కనక సర్ ఆండ్రూకి ఎక్కడలేని ధైర్యము వచ్చి, కత్తి తీసి అతన్ని నెత్తిమీద కొట్టాడు. సెబాస్టియన్‌కి తనని ఉత్తపుణ్యానికి ఎందుకు కొడుతున్నాడో అర్థంకాలేదు. అయినా అతడు పిరికివాడు కాదుకదా! వెంటనే దెబ్బకి దెబ్బ కొట్టాడు. కత్తి యుద్ధానికి రమ్మని సవాలు చేసాడు. సర్ ఆండ్రూకి యిష్టం లేకపోయినా తప్పక కత్తి తీసాడు.ఇక యిద్దరూ పోట్లాటకి దిగపోతున్న సమయంలో వొలీవియాకి విషయం తెలిసి, పరిగెత్తుకుంటూ వచ్చింది, సిసేరియోని రక్షించిడానికి. ఇద్దరిని ఆపమని గట్టిగా అరిచింది. సర్ అండ్రూ మీద ఎంతో కోపం వచ్చి తన ముందు నుంచి కనపడకుండా వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపించింది. సెబాస్టియన్‌ని తనతో యింటికి రమ్మని కోరింది, అతన్ని సిసేసిరియో అనుకుని. సెబాస్టియన్‌కి యిదంతా అగమ్యగోచరంగా వుంది. అయినా ఆమెతోపాటు యింట్లోకి వెళ్ళాడు. ఆమె ఎంతో ఆప్యాయంగా మాట్లాడుతోంది. ఇదంతా నిజమా, కలా అనుకున్నాడు సెబాస్టియన్, ఆమె ఒక పిచ్చి మనిషేమో అనుకున్నాడు. కాని ఆమె యింట్లో అంద రితో, అన్ని వ్యవహారాలు చాలా చక్కగా సమర్థిస్తోందే! ఆమె మతి భ్రమించిన మనిషి మాత్రం కాదు అయితే తనతో ఎందుకలా ప్రవర్తి స్తోంది. అది మాత్రం అర్థం కావడం లేదు.

ఇంతలోనే వొలీవియా ఒక పురోహితుణ్ని పిలిపించింది, వాళ్ళి ద్దరికి వెంటనే వివాహం జరిపించడానికి. సిజేరియో యిప్పుడు తను చెప్పిన మాటలు వింటున్నాడు.మళ్ళీ ఎక్కడ మారతాడేమోననే భయంతో తొందరపడింది. సెబాస్టియన్ అడ్డు చెప్పలేదు. ఈ విషయం ఎంతకాలం

రహస్యంగా వుంచాలనుకుంటే అంతకాలం ఎవరికీ చెప్పనని కూడా వాగ్దానం చేసింది. సెబాస్టియన్ చాలా ఆనందించాడు. అకస్మాత్తుగా తనకి వచ్చిపడిన అదృష్టానికి కొంతసేపు అక్కడే సంతోషంగా ఆమెతో వున్నాడు. ఆంటోనియో విషయం అప్పుడు గుర్తుకు వచ్చింది. అతనితో యీ జరిగిన విషయమంతా చెప్పడానికి బయలుదేరి వెళ్లాడు.

వయోలా తిరిగి డ్యూక్ దగ్గరికి వచ్చి తన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయని చెప్పింది. డ్యూక్ యింకెవర్నీ పంపకుండా తనే వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. వెంటనే సిజేరియోని, మిగతా వాళ్ళందరినీ తీసుకొని వొలీవియా దగ్గరకి డ్యూక్ బయలుదేరాడు. వొలీవియా యింటి బయట వేచివున్న సమయంలో డ్యూక్ భటులు ఆంటోనియోని అక్కడికి తీసుకువచ్చారు. వయోలా ఎలాగైనా అతణ్ని రక్షించాలనుకుంది. అతనే తన ప్రాణాలను రక్షించాడని డ్యూక్‌తో చెప్పింది. కాని అతను ఏదో విచిత్రంగా మాట్లాడాడని, అదంతా తనకు అర్థంకాలేదని కూడా చెప్పింది, అతను పర్సు యిమ్మని అడిగిన విషయం చెపుతూ.

ఆంటోనియో వయోలాని సెబాస్టియన్‌గానే భావిస్తూ, డ్యూక్‌తో అతనికి ఎంత సహాయం చేశాడో, అతను యిప్పుడు ఎంత కృతఘ్నుడుగా ప్రవర్తిస్తున్నాడో చెప్పాడు. మూడు నెలలుగా వాళ్ళిద్దరూ కలిసి తిరుగుతున్నామని, ఆ ఉదయమే ఇలీరియాలో దిగామని చెప్పాడు. డ్యూక్ అతనితో అదంతా అబద్ధమన్నాడు. ఈ కుర్రవాడు తన దగ్గర మూడు నెలలుగా వుంటున్నాడని చెప్పాడు. అదే సమయంలో వొలీవియా అక్కడికి వచ్చింది, ఆవిడని చూసి ఆంటోనియోని అక్కడి నుంచి తీసుకుపొమ్మని భటులకు చెప్పాడు.

ఇపుడు అతని దృష్టి అంతా వొలీవియా మీదే. కాని ఆవె

అతన్ని ఏమాత్రం పట్టించుకోవడంలేదు. ఆవిడ దృష్టంతా డ్యూక్ సేవకుడు సిజేరియో మీదే. డ్యూక్‌కి అర్థమయిపోయింది. వొలీవియా ఆ పిల్లవాడిని ప్రేమిస్తోందని. డ్యూక్ కోపంగా సిజేరియోని తన వెంట రమ్మని, అక్కడి నుంచి బయలుదేరాడు. సిజేరియో అతని వెంబడి వెళ్ళడానికి బయలుదేరాడు. వొలీవియా అతణ్ణి ఆగమని చెప్పింది. అతను ఆమె మాట వినకుండా వెళ్ళిపోతుంటే యిక చేసేదిలేక, అతనికి యిచ్చిన మాటకూడా మరచిపోయి, "సిజేరియో నా భర్త" అని అంది. డ్యూక్‌కి యీ మాటలు ఎంతో ఆశ్చర్యం కలిగించాయి. సిజేరియో తను ఆమె భర్తకాదని, తన మాటలు నమ్మమని డ్యూక్‌ను వేడుకున్నాడు. వెంటనే వారిద్దరికి వివాహం జరిపించిన పురోహితుణ్ని పిలిపించింది నిజం చెప్పించడానికి. రెండు గంటల క్రితమే వారిద్దరికి వివాహం జరిపించానని చెప్పాడు డ్యూక్‌కి పట్టరాని కోపం వచ్చింది సిజేరియోమీద నీ మొహం నాకు మళ్ళీ చూపించకు, అని సిజేరియోమీద. విరుచుకుపడ్డాడు.

ఆ సమయంలో అక్కడికి ఆంటోనియోను వెదుక్కుంటూ వెళ్ళిన సెబాస్టియన్ వచ్చాడు. వొలీవియాని ప్రేమగా పిలిచాడు. ఆంటోనియోని చూసి, చాలా సంతోషించాడు చివరికి అతణ్ణి కలుసుకున్నందుకు. అందరూ నిశ్చేష్టులయారు. సెబాస్టియన్, సిజేరియోలకేసి అందరూ చూశారు, ఇద్దరూ ఒక ప్రతి మరొకరు. ఎవరెవరో కూడా చెప్ప శక్యం కాకుండా వుంది.

సెబాస్టియన్, వయోలాలు ఒకరినొకరు పోల్చుకుని, వాళ్ళిద్దరూ విడిపోయిన దగ్గర నుంచి యింత వరకు జరిగినదంతా చెప్పుకున్నారు. అందరూ సంతోషంగా వున్నారు. సెబాస్టియన్, వొలీవియాని, "నువ్వు ఒక స్త్రీని ప్రేమించావు, ఒక పురుషుడ్ని పొరపాటున పెళ్ళి చేసుకు

కానే ఆశలన్నీ పోయాయి. వయోలా తన దగ్గర సిజేరియోగా ఉన్న
పుడు అన్న మాటలకు యిప్పుడు అర్థం తెలిసింది. ఆమె తనని ఎంత
గానో ప్రేమించిందని నిర్ధారణ అయింది. డ్యూక్ వయోలాని పెళ్ళి
చేసుకుంటానన్నాడు. ఆమె సంతోషంగా అంగీకరించింది. ఈ విధంగా
డ్యూక్ వయోలాని, సెబాస్టియన్ వొలీవియాని వివాహం చేసుకున్నారు.
కథంతా సుఖాంతమయింది.

*

# లియర్ రాజు

# King Lear

చాలాకాలం క్రితం ఇంగ్లండు దేశాన్ని లియర్ అనే రాజు పరిపాలిస్తూ ఉండేవాడు. ఆ రాజుకు ముగ్గురు కుమార్తెలు. వారు, గానరిల్, రీగన్, కార్డీలియా. అతడు దేశాన్ని చాలా సమర్థవంతముగా పరిపాలించి ప్రజల్లో మంచి పేరు తెచ్చుకున్నాడు. ఇప్పుడు వృద్ధాప్యములో వున్నాడు. అందువల్ల రాజ్యభారాన్ని పిల్లలకు అప్పగించి తను విశ్రాంతి తీసుకుందామనుకున్నాడు. కొడుకులు లేని కారణంగా ముగ్గురు కుమార్తెలకు సమానంగా రాజ్యాన్ని పంచి యిచ్చేద్దామనుకున్నాడు. కాని ఆ పని చేసేముందు ఆ రాజుకి ఎందుకో తన కుమార్తెలు తనని ఎంతగా ప్రేమిస్తున్నారో తెలుసుకోవాలనుకున్నాడు. ఇది చాలా చిత్రమయిన కోరిక. ఏ తండ్రీ, తన పిల్లల్ని యీ విధంగా అడగడు. కాని ఎనభై సంవత్సరాలు పైబడ్డ ముసలిరాజు లియర్ మనసులో ఎందుకో ఇటువంటి కోరిక కలిగింది. ఇదే అనేక అనర్థాలకు దారితీసింది.

అప్పటికే పెద్ద కుమార్తె గానరిల్‌కి డ్యూక్ ఆఫ్ ఆల్బనీతోను రెండవ కుమార్తె రీగన్‌కి డ్యూక్ ఆఫ్ కార్న్‌వాల్‌తోను పెళ్ళిళ్ళు అయ్యాయి. మూడవ కుమార్తె కార్డిలియాని వివాహమాడ్డానికి డ్యూక్ ఆఫ్ బర్గండీ, ఫ్రాన్స్ దేశపు రాజు కూడా పోటీ పడుతున్నారు. ఇపుడు యిద్దరూ లియర్ అనుమతి కోసం కాచుకున్నారు.

లియర్ రాజు ఒకరోజున ముగ్గురు కూతుళ్ళని పిలిచి తన పైన వారికి ఎంత ప్రేమ ఉందో చెప్పమని అడిగాడు, నిండుకొలువులో.

పెద్దకుమార్తె గానరిల్, "నాన్నగారు, నేను మిమ్మల్ని ఎంతగా ప్రేమిస్తున్నానో చెప్పడానికి మాటలు చాలవు. మీరు నాకు ఈ ప్రపంచమంతటికంటె, నా కళ్ళకంటె, నా స్వేచ్ఛకంటె కూడా ఎక్కువ" అని ఎంతో తియ్యటి మాటలు చెప్పింది.

రాజుకి ఎంతో సంతోషం కలిగింది. తన రాజ్యంయొక్క పటంలో చూపిస్తూ, "ఇక్కడనుంచి, యిక్కడవరకు, మూడోభాగం నీకు యిస్తున్నాను. ఈ భూభాగం నీకు, నీ పిల్లలకి, వారి వారసులకి చెందుతుంది" అని రాజు చెప్పాడు.

ఆ తరువాత రెండవ కూతురు రీగన్‌ని అడిగాడు. తన అక్కగారికి ఎంతమాత్రం తీసిపోని విధంగా రీగన్ కూడా అదే ధోరణిలో తన ప్రేమ ఎంతటిదో చెప్పింది. "జీవితంలో నాకున్న ఆనందమంతా మీకు సేవ చేయడంలో ఉంది. మిమ్మల్ని అక్కగారి కంటె ఎంతగానో ఎక్కువగా ప్రేమిస్తున్నాను" అని చెప్పింది. రాజు ఆమె మాటలకి కూడా ఎంతో సంతోషించాడు. రీగన్‌కి ఇంకొక మూడవవంతు రాజ్యాన్ని యిచ్చాడు.

చివరగా తన ముద్దుల కూతురు, కార్డిలియాని అడిగాడు. తనకి

తెలుసు, ఆమె అందరికంటె ఎంతో ఎక్కువగా ప్రేమిస్తోందని. అలాగే చెబుతుందని అనుకున్నాడు కూడా. కార్డిలియాకి తన అక్కలిద్దరూ రాజ్యం కోసం, డబ్బు కోసం అలా చెబుతున్నంతసేపు చాలా బాధగా ఉంది. అటువంటి వారి ప్రేమతో తనకున్న నిజమయిన ప్రేమ పోటీ పడ్డమా, అనుకుంది.

"నాన్నగారు, తండ్రిగా మిమ్మల్ని ఎంతగా ప్రేమించాలో అంతగానూ మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. అంతకంటె ఎక్కువా లేదు, తక్కువా లేదు" అని నిర్మొహమాటంగానే చెప్పింది, తండ్రికి కోపం వస్తుందేమోనని తెలిసుండి కూడా. రాజుకి నిజంగా చాలా కోపం వచ్చింది.

"నువ్వు మళ్ళీ ఆలోచించుకుని చెప్పు. లేకపోతే నువ్వు సర్వస్వం పోగొట్టుకుంటావు. జాగ్రత్త" అని హెచ్చరించాడు. కాని కార్డీలియా మెల్లగా సమాధానం చెప్పింది. "నువ్వు నా తండ్రివి నాకు జన్మను యిచ్చావు. నన్ను పెంచి పెద్దదానిగా చేసావు. నన్నెంతగానో ప్రేమించావు. అందువల్ల నీకు నేను విధేయురాలుగా ఉంటాను. గౌరవిస్తాను. ప్రేమిస్తాను. నిన్ను తప్ప యింకెవర్ని ప్రేమించలేనట్లయితే నా అక్కలిద్దరూ ఎందుకు వివాహం చేసుకున్నట్లు. నేనెప్పుడు వివాహం చేసుకుంటానో, అప్పుడు నా ప్రేమ, నా కర్తవ్యంలో సగం ఆ భర్తకి చెందుతాయి. నేను మాత్రం నా యిద్దరి తోబుట్టువుల మాదిరిగా వివాహం ఆయిన తరువాత కూడా నా తండ్రికే నా ప్రేమనంతటినీ అర్పించలేను" అని చెప్పింది.

ఈ మాటలు విన్నలియర్ నమ్మలేకపోయాడు. తను ఎంతగానో ప్రేమిస్తున్న చిన్నకూతురా యీ మాటలాడుతున్నది అని బాధపడ్డాడు. పట్టలేని కోపం వచ్చింది. ఆ వృద్ధాప్యంలో పెద్దకూతుళ్ళు చెప్పిన

తియ్యటి మాటలను నమ్మాడు. కాని, చిన్నకూతురు హృదయంలోంచి వచ్చిన మాటలు రుచించలేదు. కృతఘ్నురాలా! ఈ క్షణం నుంచి నువ్వు నా కూతురివి కాదు, నీకిద్దామనుకుంటున్న మూడవ వంతు రాజ్యాన్ని కూడా పెద్దవాళ్ళిద్దరికే యిచ్చి వేస్తున్నాను" అన్నాడు. లియర్ ఆస్థానంలో వుంటున్న కెంట్, రాజుకి చాలా విధేయుడు. జరుగుతున్న దంతా గమనించి రాజుని తొందరపడి ఏ పని చెయ్యవద్దని నివారించ బోయాడు. రాజు అతన్ని త్రోసిపుచ్చి, కార్డీలియాకి యిద్దామనుకున్న రాజ్య భాగాన్ని కూడా పెద్దకూతుళ్ళ వాళ్ళ భర్తలను పిలిచి వారికి సమానంగా పంచి యిచ్చివేసాడు. కెంట్ మళ్ళీ ప్రతిమాలాడు. రాజు నిర్ణయాన్ని మార్చుకొనకపోగా కెంట్‌ని బహిష్కరించాడు. రాజు పట్టుదల చూసి కెంట్ అక్కడి నుంచి శలవు తీసుకుని వెళ్ళిపోయాడు. కార్డీలియా మంచితనం గానరిల్, రీగన్‌ల దుష్టత్వం తెలిసినవాడు కనుక పరిస్థితులు ఎలా విషమించబోతున్నాయోనని కూడా చాలా బాధపడ్డాడు కెంట్.

రాజ్యాన్నంతని యిద్దరు కుమార్తెలకి యిచ్చి, తను రాజు పేరు మాత్రం ఉంచుకుంటూ, తనతో ఉండడానికి వందమంది సైనికుల్ని తీసుకున్నాడు. కార్డీలియాని వివాహమాడ్డానికి వేచియున్న డ్యూక్ అఫ్ బర్గండీని, ఫ్రాన్స్‌రాజుని పిలిచి యిప్పుడు కార్డీలియాని వివాహమాడ్డానికి సిద్ధంగా ఎవరున్నారో చెప్పమన్నాడు. కట్నంలేని కార్డీలియాని బర్గండీ తిరస్కరించాడు. ఫ్రాన్స్‌రాజు మాత్రం కార్డీలియా నిర్మలమైన నిష్కపటమయిన మనస్సును అర్థంచేసుకున్నాడు. తను సిద్ధంగా ఉన్నానని ముందుకు వచ్చాడు. "అయితే ఆమెను వివాహం చేసుకో. ఆమె నా కూతురు కాదు. వెంటనే ఆమెను యిక్కడి నుంచి తీసుకు వెళ్ళిపో. మళ్ళీ నేను ఆ కార్డీలియా ముఖం చూడదలచుకోలేదు" అన్నాడు లియర్. తండ్రి దగ్గర నుంచి ఏడుస్తూ శలవు తీసుకుంది

కార్డీలియా. తండ్రిని ప్రేమతో చూడమని అక్కలిద్దర్ని అర్థించింది. దానికి వారు తమ కర్తవ్యమేమిటో తెలుసునని, తను వారికి చెప్పవలసిన అవసరం లేదని అంటూ, ఆమెను భర్త ఎడల ప్రేమాభిమానాలతో వుండమని హేళన చేసారు. దుఃఖభారంతో క్రుంగిపోతూ ఆ ప్రదేశాన్ని విడిచి కార్డీలియా ఫ్రాన్స్ రాజుతో వెళ్ళిపోయింది. తన తండ్రిని అక్కలు సరిగా చూడక యిబ్బంది పెడతారేమోననే సంశయంతోనే అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

కార్డీలియా భయపడినట్లుగానే పరిస్థితులు మారాయి. రాజులియర్ మొదట తన పెద్ద కూతురు దగ్గర వుండడానికి వచ్చాడు. ఆమె తండ్రిని ఎంతో నిర్లక్ష్యం చేసింది. అతనియందు ఎంతో నిర్దయగా ప్రవర్తించడం మొదలు పెట్టింది. తను అక్కడ కూతురికి అతిధిగా మాత్రమే కాని, రాజుగా అతనికి స్థానంలేదని అర్థమయింది. తన ఆజ్ఞానుసారంగా ఏ భటులు నడుచుకోవడంలేదు. అసలు తన మాటలనే ఎవ్వరూ లెక్క చేయడంలేదు. అదీగాక గానరిల్ తన సేవకుల్ని అజమాయిషీ చెయ్యవద్దని కూడా తండ్రికి సూచించింది.

అలా వుంటున్న సమయంలో అక్కడికి ఒక అపరిచిత వ్యక్తి వచ్చాడు. లియర్‌ని తన సేవకుడిగా తీసుకోమని బ్రతిమాలాడు. రాజుకి ఎందుకో అతనిమీద మంచి అభిప్రాయము ఏర్పడింది. అతడు చాలా నమ్మకస్తుడు లాగున్నాడనుకున్నాడు. వెంటనే అంగీకరించాడు, తనకు సేవచేస్తూ తన దగ్గర వుండడానికి. కొద్దిసేపటికే అతని విధేయత రాజుకి అర్థమయింది. గానరిల్ సేవకుడు ఒకడు రాజు లియర్‌ని అవమానించే విధంగా మాట్లాడాడు. ఇది భరించలేక ఆ అపరిచిత వ్యక్తి, ఆ సేవకుడికి బుద్ధిచెప్పాడు. క్రిందపడేట్లుగా కొట్టాడు. రాజుకి ఈ సంఘటనలవల్ల అతనిమీద ఎంతో గురి ఏర్పడింది. ఇతనెవరో కాదు. రాజు

చేత కోపంలో దేశాన్నుంచి బహిష్కరింపబడ్డ కెంట్. రాజుని ఆ పరిస్థితులలో విడిచి వెళ్ళిపోవడం యిష్టంలేక మారువేషంలో రాజు వున్న చోటుకి వచ్చాడు. రాజుకి దగ్గరలో సేవకుడిగా వుండినట్లయితే గానిరిల్, రీగన్‌లు పెట్టే బాధల నుండి అతణ్ని రక్షించి, వూరట కొంతైనా కలిగించవచ్చనే వుద్దేశ్యంతో అలా చేసాడు. ఇపుడు అతని పేరు "కేయిస్".

లియర్ రాజు పరిస్థితి గానరిల్ యింట్లో రోజురోజుకి దుర్భరమయిపోయింది. తండ్రిని ఏదో నెపంమీద పంపించేయాలనే ఆలోచనలో వుంది.

"నీతో వచ్చిన వందమంది సేవకులు ఒక సమస్యగా తయారయ్యారు. వాళ్ళకయ్యే ఖర్చు కూడా చాలా ఎక్కువగా వుంది. సగం మంది నీకు చాలు. మిగతా సగం మందిని పంపించెయ్యడం మంచిది" అని తండ్రితో చెప్పింది. రాజు యిష్టపడక పోవడంతో, తనే యాభయి మందిని తొలగించి వేసింది. రాజుకిప్పుడు బాగా అర్థమయింది. పెద్ద కూతురు ఎంత కఠినాత్మురాలో. "నీకు పిల్లలు కలుగకుండా గొడ్రాలుగా వుండిపో, పిల్లలంటూ పుడితే, నీకంటె దుర్మార్గుల్ని, నువ్వు నన్ను పెడుతున్న దానికంటే ఎక్కువగా హింస పెట్టేవాళ్ళని, భగవంతుడు నీ కిస్తాడు పో" అని తన కోపాన్నంతా వెళ్ళగక్కాడు.

వెంటనే తన రెండో కూతురు రీగన్ యింటికి బయలుదేరాడు. తన దగ్గర మిగిలివున్న యాభయిమంది భటులతోటి. ముందుగా రీగన్ తోటి తను వస్తున్న వార్తను చెప్పడానికి కేయిస్‌ను పంపించాడు.

ఆదే సమయంలో తన సోదరి దగ్గరికి గానరిల్ కూడా ఒక దూతని పంపించింది. తండ్రి అక్కడికి వస్తున్నాడని, తనని కూడా

తండ్రి ఎడల నిర్మోహమాటంగా వ్యవహరించమని కబురు పంపించింది. కేయిస్ ఈ దూతని రీగన్ భవనం బయట చూసాడు. వీడిని ఏదో పథకంమీదే గానరిల్, రీగన్ దగ్గరకు పంపి వుంటుందని అర్థం చేసుకున్నాడు. వాడు యింతకు ముందు గానరిల్ యింట్లో లియర్ని అవమాన పరిచినప్పుడు కేయిస్‌చేత దేహశుద్ధి జరుపబడినవాడే. మళ్ళీ యిక్కడ యిద్దరూ తగాదాకి సిద్ధపడ్డారు. కేయీస్ వాడిని గట్టిగా కొట్టాడు. రీగన్ మనుషులు వచ్చి అతన్ని బంధించి ఆరు బయట సంకెళ్ళతో నుంచోపెట్టారు. ఆ రోజుల్లో అది ఒకరకమయిన శిక్ష. కొద్ది సేపటిలో లియర్ అక్కడికి చేరుకునేసరికి యింకా యింట్లోకి ప్రవేశించకముందే అతని కళ్ళముందు కనపడ్డ దృశ్యమిది.

కోపంగా లియర్ కోటలోకి ప్రవేశించాడు. రీగన్ తన సేవకుడికి ఎందుకు అటువంటి క్రూరమయిన శిక్ష విధించిందో తెలుసుకోవడానికి. రీగన్, ఆమె భర్త ఆ సమయంలో ఎవరినీ చూడరని కబురువచ్చింది. వారు నిద్ర పోతున్నారని, లేచేవరకు వేచి వుండాలని చెప్పారు. ఈ మాటలకి రాజుకి కోపం మరింత ఎక్కువయింది. దాని కంటె కూడా ఎక్కువగా బాధ కలిగించిన విషయం రెండవ కూతురు తనని అవమానించడంలో మొదటి కూతురు గానరిల్‌కి ఎంతమాత్రం తీసిపోదని కళ్ళారా చూపినపుడు.

తరువాత రీగన్‌ని కలుసుకున్న లియర్ తనని గానరిల్ ఎంతగా బాధ పెట్టిందోచెప్పాడు. దానికి సమాధానంగా, "నా సోదరి మిమ్మల్ని అలా చూసి ఉంటుందని నేను నమ్మను. ఆమె ఏ తప్పుచేసి ఉండదనే నా నమ్మకం. అదీగాక మీరు వృద్ధులు. మీరు మాకంటె తెలివైన వాళ్ళు. మీ మంచి కోరి చెప్పే మాటలు వినాలి. మీరు మళ్లీ తిరిగి ఆమె దగ్గరికి

వెళ్ళి ఆమెకు క్షమాపణ చెప్పుకుని అక్కడే ఉండండి," అని రీగన్ అనేసరికి లియర్‌కి పిచ్చికోపం వచ్చింది. తనని మళ్ళీ గానరిల్ దగ్గరికే వెళ్ళిపొమ్మంటుందా అని చాలా బాధపడ్డాడు. నేను ముసలివాడిని. నేను యింకా బ్రతికి వుండడం అంత మంచిది కాదని నాకు తెలుసు. నేను నిన్ను వేడుకుంటున్నాను. నాకు కట్టుకోవడానికి గుడ్డలు, కడుపుకి ఇంత తిండి పెడితే చాలు." అని కూడా ప్రాధేయపడ్డాడు. రీగన్ తండ్రి మాటలు పట్టించుకోలేదు.

నా కేయిస్‌కి అంత శిక్ష ఎందుకు విధించారు, అని కూడా అడిగాడు. సమాధానం లేదు. అదే సమయంలో గానరిల్ అక్కడికి చేరుకుంది తన తండ్రిని తను చెప్పిన విధంగా రీగన్ చూస్తుందో, లేదో నని తానే స్వయంగా తెలుసుకోవడానికి గానరిల్ అక్కడికి వచ్చింది. "గానరిల్ దగ్గరికి మీరు వెళ్ళిపొండి. మీరు ఇక్కడుంటే. మీతో ఇరవై అయిదు మంది సేవకులకంటె వుంచుకోవడానికి వీలుపడదు, అని రీగన్ తండ్రితో స్పష్టంగా చెప్పింది. ప్రక్కనే వున్న గానరిల్ "మీకు అసలు సేవకులతో ఇప్పుడు అవసరమేముంది మా సేవకులే మీకు కూడా కావలసిన సేవలు అందిస్తారు కదా, మా ఇంట్లో వుంటే," అంది.

తన పెద్ద కూతుళ్ళిద్దరూ ఎంత దుర్మార్గులో లియర్‌కి ఇప్పుడు పూర్తిగా అర్థమయింది. "ఓ భగవంతుడా! నా వృద్ధాప్యంలో నా కుమార్తెలు నన్ను ఈ విధంగా చిత్రహింస చేస్తుంటే భరించడానికి కావలసిన శక్తి ప్రసాదించు ప్రభూ" అని వేడుకున్నాడు. కూతుళ్ళతో, "నేను మీరు చేసినదానికి కంటతడి పెడతానని అనుకుంటున్నారా? అలా చేయను. నేను ఏడ్వడానికి కారణం ఎంతో వుంది. కానీ ఏడ్వను. నా గుండెలు వేయి తునకలైనా సరే" అంటూ అక్కడి నుంచి బయలుదేరాడు, కేయిస్‌ని, తనతోనే వుంటున్న విదూషకుడిని వెంటబెట్టుకుని

బయట భయంకరమైన తుఫాను. ఉరుములు, మెరుపులు. ఎవరు కూడా బయటకి వెళ్ళడానికి సాహసించవి సమయమది. తన కూతుళ్ళ దగ్గర యింకొక క్షణం కూడా నిలువలేక పోయాడు, అలాగే కొంతసేపు తిరిగాడు. పిచ్చి ఎత్తిన వాడి మాదిరిగా. కేయిస్ మధ్యలో దారి తప్పాడు. ఇప్పుడు తనతో మిగిలింది ఆ విదూషకుడు మాత్రమే, వాళ్ళిద్దరూ పూర్తిగా తడిసిపోయారు. తలదాచుకోవడానికి కూడా ఎక్కడా ఏదీ కనబడలేదు. తన కుమార్తెల కాఠిన్యానికి హృదయంలో చెలరేగిన తుఫాను ముందు బయట భీభత్సం చేస్తున్న తుఫాను అంతగా ఆతన్ని బాధపెట్టలేదు. ఇలా చాలా సమయం గడిచాక చివరికి కేయిస్ వీళ్ళని కనుక్కొని దగ్గరికి వచ్చాడు. "రాత్రివేళల సంచరించే క్రూరమృగాలు సైతం యిటువంటి సమయంలో బయటికి రావే! ఈ తుఫాను, వాటిని కూడా తలదాచుకునే స్థావరాలకి పంపివేస్తోందే! మీరెలా ఇదంతా భరించగలరు?"అంటూ రాజుని చూసి కేయిస్ ఎంతగానో విలపించాడు. దగ్గరలోనే వున్న ఒక గుడిసెలోకి రాజుని తీసికెళ్లాడు. ముందు విదూషకుడు లోపలకెళ్ళి చూసి పరుగెత్తుకుంటూ వెనక్కి వచ్చి లోపల దెయ్యం వుంది. అలా వెళ్ళకండి అంటూ అరిచాడు. అక్కడున్నది దెయ్యం కాదు. "టామ్" తన పేరని చెప్పుకుంటూ ఒక పిచ్చివాడు అక్కడున్నాడు. ఆతని పరిస్థితి చూసి లియర్ నువ్వుకూడా నీ సమస్తం నీ కూతుళ్ళ కిచ్చేశావా? అని అడిగి కేయిస్‌తో, కూతుళ్ళ కృతఘ్నత తప్ప ఏ మనిషినీ యింతటి దుర్భర పరిస్థితిలోకి దిగజార్చలేవు అన్నాడు. కేయిస్‌కి లియర్ మాటలు వింటుంటే గుండె వేయి ముక్కలయినట్లనిపించింది, లియర్ ఇప్పుడు పిచ్చివాడయ్యాడు.

ఆ రాత్రంతా వాళ్ళందరూ ఆ గుడిసెలోనే గడిపారు. తుఫాను ఉధృతం పూర్తిగా తగ్గాక "కేయిస్" వేషంలో వున్న కెంట్ లియర్,

రాజుని తన ఇంటికి తీసికెళ్ళాడు. ఇది ఫ్రాన్స్ దేశానికి చాలా దగ్గరలో వున్న ప్రదేశం. ఇప్పుడు లియర్ రాజు సురక్షితంగా వున్నాడు.అక్కడ రాజుని వుంచి కెంట్ బయల్దేరి ఫ్రాన్స్‌కి వెళ్ళి కార్డీలియాకి తన తండ్రి ఎటువంటి దురవస్థలో వున్నాడో తెలియచేశాడు. కార్డీలియాభర్తని కావల సిన సైన్యాన్ని సమకూర్చుకుని తన తండ్రిని రక్షించడానికి బయలుదేర మని బతిమాలింది. ఫ్రాన్స్ రాజు సేనలు బయలుదేరాయి ఇంగ్లండ్ మీదికి. డోవర్ దగ్గరికి సేనలు వచ్చేసరికి కార్డీలియా కెంట్ భవనం లోకి తన తండ్రిని చూడ్డానికి వెళ్ళింది. లియర్ పరిస్థితి ఎంతమాత్రమూ బాగాలేదనీ, తనని గుర్తుకూడా పట్టకపోవచ్చుననీ వైద్యులు చెప్పారు. కొంచెం ఓపిక పట్టమని ఆమెకి సలహా చెప్పారు.

పిచ్చిగా మాట్లాడుతూ లియర్ ఆ ప్రదేశాన్నంతా తిరుగుతూ పాటలు పాడుతూ చూసేవాళ్ళ గుండెలు బద్దలయ్యేలా వున్నాడు. తల మీద పూలతో తయారుచేసిన కిరీటం పెట్టుకున్నాడు. వైద్యులు మాత్రం, వారిస్తున్న మందులు రోజులు గడిచినకొద్దీ మళ్ళీ మామూలు మనిషిని చేయగలవనే నమ్మకంతో వున్నారు. కార్డీలియాని తండ్రిదగ్గరికి వెళ్ళ డానికి అనుమతించేసరికి తన తండ్రిలో వచ్చిన మార్పుచూసి ఆమె హృదయం ద్రవించిపోయింది. తండ్రి దగ్గరగా చేరి ముద్దుపెట్టుకుంది. కానీ లియర్ మొదట ఆమెని గుర్తుపట్టలేదు. క్రమంగా మార్పువచ్చి కార్డీలియాని తెరుపుమరుపుగా గుర్తుపట్టాడు. “నేను ఎనభై ఏళ్ళ వృద్ధుణ్ణి నాకు తెలుసు నేను చాలా మూర్ఖుణ్ణని నేను ఎక్కడున్నానో, ఏం చేస్తు న్నానో నాకే తెలియదు. రాత్రి నేను ఎక్కడ నిద్రించానో నాకు తెలి యదే. నువ్వెవరో నాకు గుర్తువస్తోన్నట్టుంది” అన్నాడు కార్డీలియాతో. తనని గుర్తుపట్టినందుకు కార్డీలియా ఎంతో సంతోషించింది. లియర్‌కి తను కార్డీలియాకి ఎంత అన్యాయం చేశాడో గుర్తుకి వచ్చింది. తనని ఆ కారణమువల్ల ప్రేమించవేమో అనుకున్నాడు కార్డీలియా తండ్రికి

ఓదార్పు మాటలెన్నో చెప్పింది. లియర్‌కి యిప్పుడు తన చిన్న కూతురు చేతుల్లో మనశ్శాంతి కలిగింది. "నేను చేసినవన్నీ మరిచిపోయి, నన్ను క్షమించు" అంటూ పదేపదే ఆమెని కోరాడు.

ఇదిలా వుండగా గానరిల్, రీగన్‌లకి కార్డీలియా ఫ్రెంచి సేనలతో దండెత్తి వచ్చిన విషయమంతా తెలిసింది. వాళ్ళ భర్తలిద్దరూ సైన్యాన్ని సమీకరించుకుని, ఫ్రెంచి సేనల్ని ఎదుర్కోవడానికి బయల్దేరారు. ఆ రెండు సేనల మధ్య భయంకరమైన యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో ఫ్రెంచి సేనలు ఓడిపోయాయి. లియర్ రాజుని, కార్డీలియాని ఖైదీలుగా తీసుకున్నారు, కార్డీలియాని జైలులో రహస్యంగా చంపించారు కార్డీలియా మృతదేహాన్ని చూసిన ముసలిరాజు లియర్ "కుక్కకి, పిల్లికి, ఎలుకకి ప్రాణం వుంటే మరి నీకు ప్రాణం పోవడమా" అంటూ పిచ్చిగా విలపిస్తూ ఆమె ప్రక్కన పడి ప్రాణాలు విడిచాడు.

గానరిల్, రీగన్‌ల పరిస్థితి చూస్తే తండ్రికి ద్రోహం చేసిన వాళ్ళిద్దరూ భర్తలని మోసం చేయడానికి వెనుకాడలేదు. "ఎరల్ ఆఫ్ గ్లాస్టర్" అనే రాజు, కావాలనే దురాశతో వున్న ఒక దుర్మార్గుడిని, యిద్దరూ ప్రేమించారు. గ్లాస్టర్ ఆ యిద్దరిలో ఒకరిని వివాహమాడి సగం రాజ్యం సంపాదించాలని ఆశించాడు. రీగన్ భర్త. కార్న్‌వాల్ చనిపోవడంతో ఆమె గ్లాస్టర్‌ని వివాహం చేసుకుంటున్నానని ప్రకటించింది. గానరిల్ అసూయతో తన సోదరినే విషంపెట్టి చంపింది. అల్బనీ, తన భార్య గానరిల్ ఎంతటి మోసం తనకి చెయ్యాలని తలపెట్టిందో తెలుసుకుని ఆమెని ఖైదులో వుంచాడు. నిరాశతో ఆమె ఖైదులో ప్రాణాలు తీసుకుంది. ఆ విధంగా లియర్ యిద్దరు కుమార్తెలు కూడా వారి దుర్బుద్ధికి తగిన ప్రతిఫలం అనుభవించారు. వారి తరువాత డ్యూక్ అల్బనీ ఇంగ్లండ్ దేశానికి రాజయి, కెంట్ సలహాతో దేశాన్ని చాలాకాలం పరిపాలించాడు.

—0—

# "నడి వేసవి రాత్రి కల"

# A Mid Summer Night's Dream

ఈ నాటకంలో కథ చాలా విచిత్రమయినది. నమ్మశక్యము కానిది. ఇందులో కొన్ని సంఘటనలు, కొన్ని మానవాతీత శక్తులు వింతగా కనపడతాయి. నాటకంలో ప్రధాన ధ్యేయం మనకు ఆహ్లాదం కలిగించటం మాత్రమే కనుక ఇటువంటి విషయాల గురించి అంతగా పట్టించుకోవలసిన అవసరంలేదు. అదంతా ఒక కల అని అనుకుంటే యిబ్బంది వుండదు. అప్పుడు ఎంత పిచ్చి, పిచ్చిగా కనపడే విషయ మయినా మనం సరిపెట్టుకోవచ్చును. అందుకే బహుశ షేక్స్పియర్ ఈ నాటకానికి "నడి వేసవి రాత్రికల" అని పేరు పెట్టాడు.

చాలాకాలంక్రితం "ఏథెన్స్" పట్టణములో తండ్రి ఎంపిక చేసిన వరుణ్ణే కుమార్తె వివాహం చేసుకోవాలనే ఒక సంప్రదాయం ఉండేది. అంతేకాకుండా అలా చేసుకోవడానికి నిరాకరించిన కూతురికి మరణశిక్ష విధించే హక్కు తండ్రికి చట్టపరంగా ఉంది. కాని ఇటువంటి క్రూర మయిన చట్టాన్ని ఏ తండ్రి అమలు చేయటానికి ఒప్పుకుంటాడు?

అందువల్ల అది ఒక నిరుపయోగమయిన చట్టంగానే ఉండిపోయింది.

ఇలా వుండగా ఒకరోజు "ఈజియస్" అనే ఒక పుర ప్రముఖుడు డ్యూక్ 'థీసియస్' దగ్గరకి తన కూతురిమీద ఫిర్యాదు చేయడానికి వచ్చాడు. తను నిశ్చయించిన వరుడు "డెమిట్రియస్"ని పెళ్ళిచేసుకోవడానికి తన కూతురు 'హెర్మియా' నిరాకరించిందని, ఆమె 'లైసాండర్'ని ప్రేమించిందని, అతన్నితప్ప ఇంకెవరిని పెళ్ళిచేసుకో నంటోందని ఫిర్యాదు. చట్టప్రకారం ఆమెకు విధించవలసిన శిక్ష అమలు చేసి తనకు న్యాయం చేకూర్చమని ఈజియస్ నిర్దాక్షిణ్యంగా డ్యూక్‌ని ప్రార్థించాడు.

హెర్మియా తన నిర్ణయాన్ని సమర్థించుకుంటూ తనకి డెమిట్రియస్ అంటే ఎంతమాత్రం యిష్టంలేదని, అదీకాక తన ప్రాణస్నేహితురాలు "హెలెనా" అతణ్ణి గాఢంగా ప్రేమిస్తోందని, అతనుకూడా ఆమె ఎడల ప్రేమను వ్యక్తం చేసాడని డ్యూక్ ముందు చెప్పింది. డెమిట్రియస్ విధిగా హెలెనానే పెళ్ళిచేసుకోవాలని ఆజ్ఞాపించమని కూడా అర్థించింది.

యవ్వనంలో ఉన్న డ్యూక్‌కి ప్రేమ ఎంతటి బలవత్తరమయినదో తెలియనిది కాదు. హెర్మియాపై ఎంతో సానుభూతి ఉన్నా చట్టానికి వ్యతిరేకంగా తను ఎలా నిర్ణయించగలడు. అందువల్ల హెర్మియాకి తన నిర్ణయాన్ని మార్చుకోవడానికి 'నాలుగు రోజులు' గడువిచ్చాడు. నాలుగు రోజుల తరువాత కూడా తండ్రి ఆజ్ఞను శిరసావహించకపోతే ఆమెకు మరణం తప్పదు.

వెంటనే లైజాండర్ దగ్గరికి వెళ్ళి తను ఎటువంటి చిక్కుల్లో

పడిందో హెర్మియా వివరంగా చెప్పింది. లైజాండర్ కి ఒక ఆలోచన తట్టింది. ఏథెన్స్‌కి ఇరవై మైళ్ళ దూరంలో అతని మేనత్త ఒకామె ఉంది. ఆమె ధనవంతురాలు. సంతానంలేని వితంతువు. ఆ వూళ్ళో ఏథెన్స్‌లో ఉన్న ఈ క్రూరమయిన చట్టం వర్తించదు. అందువల్ల ఇద్దరూ అక్కడకు పారిపోయి వివాహం చేసుకుంటే తనని చట్టం ఏ విధంగాను శిక్షించ లేదని సలహా యిచ్చాడు. ఆ రాత్రే ఇంట్లోనించి రహస్యంగా వచ్చేయమని ఊరి బయట తను ఆమె కోసం ఎదురుచూస్తూ ఉంటానని చెప్పాడు. ఆ ప్రదేశం గుర్తులు కూడా బాగా చెప్పాడు. హెలెనాతో కూడా వాళ్ళు ఆటపాటలకి ఎన్నోసార్లు వెళ్ళిన స్థలం అది. హెర్మియా సంతోషంగా అంగీకరించింది. ఈ విషయాన్ని తన ప్రాణస్నేహితురాలు హెలెనాకి చెప్పింది.

హెలెనా అమాయకంగా ఆ విషయాన్ని డెమిట్రియస్‌కి చెప్పింది. తన స్నేహితురాలి రహస్యాన్ని బయటపెట్టటంలో హెలెనాకి దురుద్దేశ్యం లేదు. హెర్మియాని వెంబడిస్తూ అక్కడికి డెమిట్రియస్ తప్పక వెళతాడని తెలుసు. తను కూడా అక్కడికి వెళ్ళవచ్చునని అనుకుందే తప్ప దానివల్ల రాబోయే అనర్థాల గురించి ఆలోచించలేదు. తనని డెమిట్రియస్ ప్రేమించటంలేదని తెలిసి కూడా అతడంటె ఆమెకి పిచ్చిప్రేమ. అందుకే అంత తెలివి తక్కువ పనిచేసింది.

హెర్మియా, లైజాండర్‌లు ఏ అడవిలో కలుసుకుని పారిపోవాలని నిర్ణయించుకున్నారో ఆ ప్రదేశంలో ఫెయిరీస్ అనబడే మానవరూపంలో వుండి, మానవాతీతమైన శక్తులు కలిగి, కంటికి కనబడకుండా తిరిగే కిన్నెరలు తరుచు కలుస్తూ వుంటారు. ఇక్కడ అర్థరాత్రులు కలుసుకుని వినోదంలో కాలం గడిపేవారు. కాని ఈ మధ్య వారి వినోద కార్యక్రమాలన్నీ ఆగిపోయాయి.

ఆ ప్రదేశమంతా నిర్మానుష్యంగా, నిశ్శబ్దంగా అయిపోయింది. దానికి కారణం ఆకిన్నరులరాజు ఒబెరాన్‌కి, రాణి టైటానియాకి మధ్య తగాదా రావడం. రాణి, రాజు దగ్గరున్న ఒక చిన్న పిల్లవాడిని చూసి ముచ్చటపడి, తను తీసుకు వెళ్ళిపోయింది. రాజు ఎన్నిసార్లడిగినా ఇవ్వడానికి ఒప్పుకోలేదు. ఆకారణంచేత వీరిద్దరూ ఎప్పుడు కలుసుకున్నా చాలా గొడవయిపోయి వాళ్ళతోవున్న మిగతా "ఫెయిరీ"లంతా పారిపోయి దాక్కునేవారు,

ప్రేమికులు హెర్మియా, లైజాండర్‌లు కలుసుకుందామనుకున్న రాత్రి ఈ కిన్నరుల రాజు, రాణి కలుసుకోవడం తటస్థపడింది. ఆపిల్లవాడు తనకి కావాలని వెంటనే యిచ్చివెయ్యమని రాజు, ఏమైనా సరే యిచ్చి వెయ్యనని రాణి గట్టిగా పోట్లాడుకున్నారు. ఇందుకు తెల్లవారేలోపునే నువ్వు విచారిస్తావులే అని రాజు ఆమెని భయపెట్టాడు కూడా.

ఒబెరాన్ ఒక పథకం వేసాడు. ఆమెకి బుద్ధి వచ్చేలా చెయ్యడానికి. రాజు దగ్గర చాలా అల్లరిచేసే "పక్" అనే ఒక కిన్నరుడు వున్నాడు. వాడికి అల్లరిచేసి అందరినీ ఏడ్పించడమో, యిబ్బందులకి గురి చెయ్యడమో అంటే మహాసరదా. ఆ దగ్గరలోవున్న పల్లెలో వాళ్ళందరికి వీడు చేస్తున్న గొడవలు సుపరిచితమే. పాలు పులిసిపోయేటట్లు చెయ్యడం, వెన్న తీసెయ్యడం, ముసలావిడ కథలు చెప్పడానికి కూర్చోబోతుంటే క్రింద నుంచి పీట తీసివెయ్యడం వంటి చిలిపి చేష్టలు అందరికీ తెలుసు.

ఒబెరాన్ పక్‌ని పిలిచి కన్యలు "సరదా ప్రేమ" అని పిలిచే పుష్పాన్ని తెచ్చిపెట్టమని అడిగాడు. "ఆ పుష్పంలోని రసాన్ని నిద్ర

పోతున్న వాళ్ళ కనురెప్పలమీద వేస్తే నిద్రలేవడంతోటే మొట్టమొద టిగా ఎవరిని చూస్తారో వారియందు గాఢమైన ప్రేమలో పడతారు. టైటానియా నిద్రిస్తుండగా ఆమె కళ్ళమీద వేస్తాను ఈద్రవాన్ని. దాంతో కళ్ళు తెరవడంతోటే ఎవరు ముందుంటే వారి ప్రేమలో పడు తుంది. అకనబడేది ఎలుగుబంటో, సింహమో, కోతో ఏదైనా కావచ్చు. అప్పుడు నాకు ఆ పిల్లవాడిని యివ్వడానికి ఒప్పుకునే దాకా అరసావికి విరుగుడు ముందు యివ్వను" అని తన వుద్దేశ్యం వ్యక్తం చేశాడు. "పక్" వెంటనే సంతోషంతో యీ వింత పుష్పాన్ని వెతికి తీసుకు రావడానికి ఎగిరి వెళ్ళాడు.

"పక్" రాకకి ఎదురు చూస్తూ ఆఅడవిలో వుండగా"ఒబెరాన్"కు హెలెన్, డెమిట్రియస్‌లు కనపడ్డారు. వాళ్ళకి కనబడకుండా వాళ్ళు మాట్లాడుకుంటున్నదంతా విన్నాడు. కోపంగా డెమిట్రియస్, హెలె నావి నన్ను ఎందుకు వెంబడిస్తున్నావు? నువ్వంటే నాకెంతమాత్రమూ ప్రేమలేదని స్పష్టం చేశాను కదా! నేను ప్రేమిస్తున్నది హెర్మియావి. ఆమెని నేను పెళ్ళిచేసుకుంటాను, నువ్వు ఇంక నన్ను వెంబడించకు, వెళ్ళిపో" అని చెప్పేశాడు. హెలెనా ఎంతగానో ప్రతిమాలింది. కొద్ది కాలం క్రితమే తనని ఎంతో ప్రేమిస్తున్నానని డెమిట్రియస్ చెప్పిన మాటలు గుర్తుచేసింది. "నువ్వుమారిపోయావు !కానీ, నేను మాత్రంమార లేదు. నేను నిన్ను గాడంగా ప్రేమిస్తున్నాను. నీ కిష్టమున్నా, లేక పోయినా నేను నీ వెంబడే వస్తాను" అంటూ విచారంగా తన నిర్ణయం చెప్పింది. డెమిట్రియస్ దానికి సమాధానం చెప్పకుండా పొదలచాటుకి, హెలెనా తనని యింక వెంబడించడానికి వీలు లేకుండా వుండేట్లుగా వెళ్ళిపోయాడు. అయినా వదలకుండా అతణ్ని వెతుక్కుంటూ హెలెనా ముందుకు సాగింది.

ప్రేమికుల యెడ ఎంతో సానుభూతి కలిగిన ఒబెరాన్‌కి ఎంతో జాలివేసింది. ఆమె పరిస్థితి చూసి. "పక్" ఆ పుష్పాన్ని తీసుకుని వెనక్కి వచ్చాక అతనికి ఒక పని పురమాయించాడు, "ఇప్పుడే యిక్కడ ఏథెన్స్‌కి చెందిన ఒక అందమైన అమ్మాయిని చూశాను. ఆమె ఒక దుర్మార్గుడిని ప్రేమిస్తోంది. ఈ పుష్పంలో కొంత భాగం తీసుకెళ్ళి ఆకుర్రారుడు నిద్రిస్తున్నప్పుడు అతని కళ్ళమీద దాని రసం పిండు, ఆపని ఆమె అతనికి దగ్గరలో వున్నప్పుడు మాత్రమే చెయ్యి. వాడు కళ్ళు తెరిచేసరికి ఆమె మొట్టమొదటగా అతని కళ్ళముందు వుండేటట్టుగా చూడు. అప్పుడు వాడు ఆమెని ప్రేమిస్తాడు. ఆ యువకుడిని నువ్వు ఏథెన్స్ దుస్తులని బట్టి తేలికగా గుర్తుపట్టవచ్చు", అని ఒబెరాన్ పంపించాడు "పక్"ని

"పక్" వెళ్ళిపోవడంతోటే ఆ మిగిలిన పుష్పాన్ని తీసుకుని ఒబెరాన్ టైటానియాని వెతకడానికి బయలు దేరాడు. ఒకనది ఒడ్డున సువాసనలతో నిండివున్న పువ్వులమధ్య ఆమె మామూలు అలవాటు ప్రకారం పడుకుని వుంది. ఆమె నిద్రపోయాక ఒబెరాన్ నెమ్మదిగా దగ్గరకు వచ్చి ఆమె కళ్ళమీద రసం పిండాడు. ఆ పని పూర్తి చేసి వెంటనే అక్కడినుంచి ఎగిరి వెళ్ళిపోయాడు.

ఇదిలా వుండగా, హెర్మియా, లైజాండర్‌లు అనుకున్న విధంగా అడవిలో కలుసుకున్నారు. అడవంతా తిరిగి, తిరిగి యిద్దరూ బాగా అలిసి పోయారు. హెర్మియా యింక ఒక్క అడుగుకూడా ముందుకు వెయ్య లేని పరిస్థితిలో ఒకచోట కూర్చుండి పోయింది. లైజాండర్ కూడా అక్కడికి దగ్గరలోనే కూర్చున్నాడు. కాస్సేపటిలోనే, బాగా అలిసిపోయి వుండడంవల్ల, యిద్దరూ ఒళ్ళు మరచి నిద్రపోయారు.

ఒబెరాన్ చెప్పిన యువతీ, యువకుల కోసం వెతుక్కుంటూ "పక్" యీ స్థలాన్ని చేరుకున్నాడు. లైజాండర్ ఎథీనియన్ దుస్తుల్లో ఉండటం చూసి అతడేననుకుని, కళ్ళల్లో ఆ వింత పువ్వు రసం పిండి, వెంటనే అక్కడి నుండి వెళ్ళిపోయాడు. కొంత సేపటికి లైజాండర్ లేచి చూసినపుడు అక్కడ హెర్మియా వుండి వుంటే బాగానే వుండేది. కాని జరిగింది మరొకటి. హెలెనా, డెమిట్రియస్ కోసం వెతుక్కుంటూ తిరిగి, తిరిగి యిక నడవలేని స్థితిలో సరిగ్గా యిక్కడికి చేరుకుంది. అప్పుడు లైజాండర్ గాఢ నిద్రలో ఉన్నాడు. డిమిట్రియస్ కనపడక పోయినా, ఆ నిర్జన ప్రదేశంలో తను ఒంటరిగా తిరుగుతుంటె లైజాండర్ కనపడినందుకు కొంత దిగులు తీరింది. అతని దగ్గరకి వచ్చి నిద్రనించి లేపింది. లైజాండర్ వెంటనే కళ్ళు తెరిచాడు. ఆవింతపువ్వు రసం పనిచెయ్యడం మొదలు పెట్టింది. హెర్మియా సంగతి మరచిపోయి హెలెనాతో ప్రేమగా మాట్లాడం మొదలు పెట్టాడు. "నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీ కోసం నిప్పుల్లో దూకమన్నా సిద్ధంగా ఉన్నాను" అంటూ తన ప్రేమనంతా వెళ్ళబుచ్చడం మొదలు పెట్టాడు. తను ప్రేమిస్తున్నది హెర్మియానన్న సంగతి ఆమె అతనికి గుర్తు చేసింది. "కాదు నిన్నే నేను మనసారా ప్రేమిస్తున్నాను, నీ అందం ముందు హెర్మియా అందం ఎంత" అని కూడా అన్నాడు. హెలెనాకిమతి పోయింది. ముందు తనని ఏడ్పించడానికి అలా తమాషాగా మాట్లాడుతున్నాడేమోనని అనుకుంది. కానీ, అతను నిజంగానే తనని ప్రేమిస్తున్నాననే సరికి అతనిమీద ఎంతో కోపం కూడా వచ్చింది. "నేను ప్రేమిస్తున్న డెమిట్రియస్ నన్ను కాదని ఎంతగానో బాధపెడుతున్నాడు. అది చాలక నువ్వు కూడా నన్ను యిలా హింస పెడతావా? నువ్వు అలాంటి వాడివని నేను ఎన్నడూ వూహించనుకూడా లేదు," అని ఎంతగానో చెప్పి చూసింది. గత్యంతరం లేక అక్కడి

నుంచి పారిపోవడానికి ప్రయత్నించింది. లైజాండర్ కూడా ఆమెను వెంబడిస్తూ వెళ్లాడు పాపం, ఏమీ తెలియని హెర్మియా అక్కడే గాఢంగా నిద్రలో వుంది. కొంత సేపటికి హెర్మియా నిద్రలేచేసరికి తను అక్కడ ఒంటరిగా వున్న సంగతి గమనించింది. లైజాండర్ అక్కడ లేకపోవడం చూసి హెర్మియాకి భయమేసింది. లైజాండర్‌ని గట్టిగా పిలుస్తూ అడవి అంతా తిరిగింది, కానీ అతను కనిపించలేదు.

ఇదిలా వుండగా హెర్మియా కోసం వెతుకుతూ వస్తున్న డెమిట్రియస్ అలసిపోయి పడుకుని నిద్రపోయాడు. టైటానియా దగ్గర నుంచి వస్తున్న ఒబెరాన్ నిద్రిస్తున్న వ్యక్తిని చూసి, ఒక యువతి ఎడల అతిక్రూరంగా ప్రవర్తిస్తుండగా చూసిన ప్రేమికుడు ఇతడే అని గుర్తుపట్టాడు. వెంటనే చేతిలో వున్న వింత పుష్పరసం అతని కళ్ళమీద పిండాడు. కాస్సేపటికి డెమిట్రియస్ కళ్ళు తెరిచి చూసేసరికి సరిగ్గా అదే సమయానికి లైజాండర్ తరుముతుంటే పారిపోయి వస్తున్న హెలెనా, యిక్కడికి చేరుకుంది. డెమిట్రియస్ కళ్ళు తెరిచి మొట్టమొదటగా హెలెనాని చూశాడు. మరుక్షణమే, ఆ పుష్పరసం మూలంగా ఆమెను డెమిట్రియస్ గాఢంగా ప్రేమిస్తున్నానని చెప్పాడు. ఇంతకుముందు దాకా తనని నిరాకరించి హెర్మియా కోసం ఆమె వెంట తిరుగుతూ వస్తున్న డెమిట్రియస్ ఒక్కసారిగా ఇలా మారిపోవడం చూసి హెలెనాకి ఇదంతా ఏమిటో అర్థంకాలేదు. ఎందుకిలా అతని ఆలోచనలో యింత మార్పు వచ్చిందో బోధపడలేదు. తను ఈ పరిస్థితిలో వుండగా తన్ను వెంబడిస్తూ వస్తున్న లైజాండర్ కూడా అక్కడికి చేరుకున్నాడు. ఒకప్రక్క డెమిట్రియస్, మరొకప్రక్క లైజాండర్ తన ప్రేమ కోసం ఒకరికొకరు పోటీ పడుతున్నారు.

ఇంతకుముందు తన స్నేహితురాలు హెర్మియాని యిద్దరూ

ప్రేమిస్తున్నప్పుడున్న పరిస్థితిలో తను యిప్పుడుంది. "మీరు సరియైన మనుషులైతే, ఒక అమాయకురాల్నిలా బాధపెట్టడం మీకు తగదు అని గట్టిగా యిద్దరినీ మందలించింది.

హెర్మియా కొంత సేపటికి యిక్కడికి చేరుకుంది. తన కళ్ళ ముందు కనబడిన దృశ్యం యిది. తనను ప్రేమించిన యిద్దరూ, ఇప్పుడు తన ఆప్తురాలు హెలెనాను ప్రేమిస్తున్నారు. అంతటి ప్రాణమిత్రులు ఈ సంఘటనతో శత్రువులైపోయారు. హెలెనా, హెర్మియాని కోపంగా యిదంతా తనమూలంగానే జరిగిందని నిందించింది. "వాళ్ళిద్దరికీ నన్నీ విధంగా హింసించి, ఏడ్పించమని నువ్వే చెప్పి పురమాయించి ఉంటావు. మనిద్దరి చిన్ననాటి స్నేహమంతా మరిచిపోయావా? మనిద్దరం కలిసి ఆనందంగా ఆడుతూ, పాడుతూ గడిపిన మధుర క్షణాలన్నీ మరిచి పోయావా? అటువంటి నన్ను ఇప్పుడు ఆ పురుషులిద్దరితో చేరి, యిలా నిర్దయగా బాధించడం నీకెంత మాత్రం తగదు" అని వేడుకుంది. హెర్మియా దానికి సమాధానంగా "నువ్వు నాకు ద్రోహం తలపెట్టావు. నేను నీకేమీ అన్యాయం చేయలేదు. నాకిప్పుడు అర్థం అయింది నువ్వెంత నమ్మక ద్రోహురాలవో" అని తన కోపాన్నంతా వెళ్ళగ్రక్కింది. వాళ్ళిద్దరి మధ్యా శతృత్వం ఎక్కువయ్యింది. ఒకరి నొకరు తాము స్త్రీల మన్న సంగతి మరిచిపోయి కోపంలో నిందించుకున్నారు. ఇలా వీళ్ళి ద్దరూ పోట్లాడుకుంటుంటే లైజాండర్, డెమిట్రియస్‌లు హెలెనా కోసం మల్లయుద్ధానికి బయలుదేరి వెళ్ళారు.

ఈ గొడవంతా ఒబెరాన్, పక్‌లు ఎవరికీ కనబడకుండా వింటు న్నారు. "దీనికంతటికీ నువ్వే కారణం. పొరపాటున యీ పనిచేశావా?" అని పక్‌ని నిలదీసి అడిగాడు ఒబెరాన్.

భయపడుతూ పక్ నిజంగా పొరపాటువల్లనే కాని, తనకే దుర్బుద్ధి లేదని చెప్పాడు. "నేను యీ పొరపాటుకి చింతించడంలేదు. ఇకముందు జరగబోయేది, తమాషాగా మనం చూద్దాం" అన్నాడు పక్.

ఇది తమాషా స్థాయి దాటి చాలాదూరం వెళ్ళిందని ఒబెరాన్ అతణ్ణి మందలించాడు. "అడవి నంతటినీ పూర్తిగా పొగమంచుతో కప్పెయ్యి. పోట్లాడుకుంటున్న యీ రెండు జంటల్ని దూరంగా తీసికెళ్ళిపో ఒకరి నుంచి మరొకరిని వేరుచెయ్యి. బాగా అలిసిపోయాక వాళ్ళని నిద్రపోయేట్లు చెయ్యి లైజాండర్ నిద్రలో ఉన్నప్పుడు ఇంతకు ముందిచ్చిన పుష్పరసానికి విరుగుడుగా పనిచేసే యీ పుష్ప రసాన్ని అతని కళ్ళల్లో పిండు. అతను లేచేసరికి అంతా మరిచిపోతాడు. అంతకుముందు హెర్మియామీద తనకున్న ప్రేమ మాత్రమే గుర్తుంటుంది. దీనివల్ల ఇద్దరు యువతులు సంతోషిస్తారు. జరిగినదంతా ఏదో పీడ కలగా భావిస్తారు. ఇద్దరూ మళ్ళీ స్నేహితులవుతారు. వెంటనే వెళ్ళి యీ పని పూర్తిచెయ్యి. నేను వెళ్ళి నా టైటానియా సంగతి ఏమైందో చూస్తాను. తను కళ్ళు తెరిచిన వెంటనే ఎటువంటి ప్రేమికుడిమీద కళ్ళు పడతాయో చూసి ఆ తరువాత ఏంచేయాలో ఆలోచిస్తాను" అని ఒబెరాన్, పక్‌ని పంపించి తను కూడా టైటానియా వున్న చోటుకి బయలుదేరాడు.

టైటానియా హాయిగా నిద్రపోతోంది. దగ్గరలోనే అడవిలో దారి తప్పి నిద్రిస్తున్న "బాటమ్" అనే ఒక పరమమూర్ఖుడు నిద్రిస్తున్నాడు. ఒబెరాన్ వాడికి ఒక గాడిద తలకాయ తగిలించాడు. అది వాడికి సరిగ్గా సరిపోయింది. నిద్రలేచి అక్కడే తిరుగుతూ టైటానియా వున్న ప్రదేశం చేరుకున్నాడు. అతణ్ని, నిద్రనుంచి లేవడంతోటే చూసిన టైటానియా

ప్రేమగా పిలిచింది. తనని విడిచి వెళ్ళవద్దని, తనని ఎంతగానో ప్రేమిస్తున్నానని కూడా చెప్పింది. తన దగ్గరున్న ఫెయిరీస్‌ని పిలిచి అతడికి పరిచర్యలు చేయమని ఆదేశించింది. బాటమ్ వారిచేత తనకి కావలసిన పరిచర్యలు చేయించుకుంటున్నాడు. అతని గాడిద తలమీద పూలకిరీటం వుంచి తన ఒడిలో అతణ్ణి నిద్రపుచ్చింది. ఆ పరిస్థితిలో వుండగా ఒబెరాన్ అక్కడికి వచ్చి గాడిదని ప్రేమిస్తున్నందుకు టైటానియాను హేళన చేశాడు. ఆమె చాలా సిగ్గుపడింది. ఆ అదను చూసుకుని తనకి కావాలని అడుగుతున్న పిల్లవాణ్ణి యివ్వమని మళ్ళీ అడిగాడు. టైటానియా చేసేదేదీలేక యిచ్చివేసింది. తనమాట నెగ్గింతర్వాత ఒబెరాన్‌కి టైటానియామీద జాలి కలిగింది.

అప్పుడు తన దగ్గరున్న రెండో పుష్పరసం పిండి, ఆమెను మళ్ళీ మామూలు స్థితిలో కొచ్చేట్లు చేశాడు. ఇద్దరు మళ్ళీ యథా ప్రకారంగా, అన్యోన్యంగా వున్నారు. అప్పుడు ఆమెకు ఆ రెండు జంటల ప్రేమ కథంతా చెప్పాడు. ఇద్దరూ బయలుదేరి వీళ్ళందరూ వున్న ప్రదేశానికి వచ్చారు. ఒబెరాన్ ఆదేశానుసారం పక్ లైజాండర్ కళ్ళల్లో విరుగుడు రసం పిండాడు. హెర్మియా ముందుగా లేచి తన దగ్గరలోనే పడుకున్న లైజాండర్‌ని చూచింది. అతనివైపు ఎంతో ఆశ్చర్యంగా చూసింది. ఎందుకలా తనతో ప్రవర్తించాడో అర్థంకాక. అంతలోనే లైజాండర్ కూడా నిద్రలేచి ఆమెను చూసి ప్రేమగా పలకరించాడు. మళ్ళీ యిప్పుడు మామూలుగానే మాట్లాడుతున్నాడు. ఇద్దరూ జరిగినదంతా తలుచుకుని ఒక పాడు కలగా భావించుకుని సంతోషించారు. అదంతా నిజం కానందుకు.

హెలెనా, డెమిట్రియస్ మరికొంతసేపటికి లేచారు. హెలెనాకి

యిప్పుడు కోపమంతాపోయి డెమిట్రియస్ ప్రేమతో చెపుతున్న మాట లన్నీ వింటోంది. ఆతని మాటలన్నీ నిజమేనని నమ్మింది.

ఇప్పుడు హెర్మియా, హెలెన్‌లు, డెమిట్రియస్, లైజాండర్‌లు స్నేహితులయ్యారు. మధ్యలో కలిగిన మనస్పర్థలన్నీ మరిచిపోయారు.

ముందు జరగవలసిన కార్యక్రమం ఆలోచించడం మొదలు పెట్టారు.

డెమిట్రియస్ ఏథెన్స్‌కి తిరిగి వెళ్ళి హెలెనాని వివాహం చేసుకుంటానని, ఆమె తండ్రికి చెప్పేయ్యాలని హెర్మియాని లైజాండర్ వివాహానికి అనుమతించమని కోరాలని నిర్ణయించారు.

డెమిట్రియస్ ఏథెన్స్‌కి బయలుదేరబోతుంటే డ్యూక్ థీసియస్, రాణితో సహా అక్కడికే వచ్చాడు. అడవికి వేటకోసం వచ్చి వీళ్ళని చూసి "అంత ప్రొద్దుటే అక్కడేం చేస్తున్నారని" అడిగాడు

లైజాండర్ "తను హెర్మియాని తీసుకుని అక్కడున్న క్రూరమైన చట్టాన్నుంచి తప్పించుకోవడానికి వచ్చానని" చెప్పాడు.

హెలెనానే వివాహమాడతానని హెర్మియాని చేసుకోదలుచుకోలేదని తన నిర్ణయాన్ని డ్యూక్‌కి చెప్పాడు. డ్యూక్ విని సమస్య ఆ విధంగా తీరినందుకు సంతోషించాడు. హెర్మియా తండ్రి ఈజియస్ కూడా ఆమె వివాహం లైజాండర్‌తో జరగటానికి అంగీకరించాడు.

ఆ విధంగా ఆ రెండు ప్రేమ జంటల కథ సుఖాంతమయ్యింది.

ఇదంతా చూస్తున్న ఒబెరాన్, టైటానియాలు కూడా చాలా సంతోషించి వేడుకగా అందరినీ విందులో పాల్గొనమని చెప్పారు.

అటు ఏథెన్స్, ఇటు ఫెయిరీ లున్న ప్రదేశం కూడా ఆనందోత్సాహాలలో మునిగిపోయాయి.

-o-

# ఒథెల్లో

# Othello

వెనిస్ పట్టణంలో "బ్రబాన్షియో"అనే ఒక శ్రీమంతుడైన సెనేటర్ ఉండేవాడు.అతనికి "డెస్డిమోనా" ఏకైక పుత్రిక.అమె చాలా అందగత్తె. ఆమె అందాన్ని చూసి ఎందరో శ్రీమంతుల కుమారులు ఆమెను వివాహమాడటానికి ముందుకు వచ్చారు. కానీ అమె వారెవరినీ కూడా పెళ్లాడడానికి ఒప్పుకోలేదు. అమె "ఒథెల్లో" అనే అఫ్రికాకి చెందిన "మూర్"ని ప్రేమించడమే దానికి కారణము. ఒథెల్లో చాలా పరాక్రమవంతుడు. అతని ధైర్య, సాహసాలవల్లనే యిపుడు, దేశానికి సేనాధిపతి పదవికి చేరుకోగలిగాడు. టర్కులమీద యుద్ధంలో చూపిన పరాక్రమానికి అందరి మెప్పు పొందాడు. సెనేట్ కి అతనిమీద చాలా గురి ఏర్పడింది. అతన్ని గౌరవించింది కూడా.

బ్రబాన్షియో అతన్ని తరుచూ ఇంటికి పిలిచేవాడు. అప్పుడు ఒథెల్లో తన వీరోచిత కృత్యాలను, అనుభవాలను చెపుతుంటే తండ్రి, కూతురు ఎంతో ఆశ్చర్యంతో వింటుండేవారు. తను చేసిన యుద్ధాలు,

తను చూసిన ప్రదేశాలు చాలా వివరంగా చెప్పేవాడు. మనుష్యుల్ని తినే వాళ్ళ గురించి, చాలా వింత ఆకారంలో వుండే వాళ్ళ గురించి కూడా చెపుతుండేవాడు.

ఇవన్నీ వినడంతో డెస్డిమోనా ఒథెల్లోవైపుకి ఎంతగానో ఆకర్షింపబడింది ముఖ్యంగా అతని జీవితాన్ని గురించి వివరాలు తెలుసుకున్నప్పుడు చాలా ఆశ్చర్యం కలిగింది. అతనంటే జాలికలిగింది. అతనుపడ్డ బాధలు విన్నప్పుడు కళ్ళనీళ్ళు పెట్టుకుంటునే యింకా తెలుసుకోవాలని కుతూహలంగా చూసేది. క్రమేణావారి స్నేహం ప్రేమగా మారింది. డెస్డిమోనా ఒథెల్లోలు ఒకరికొకరు స్పష్టంగానే తెలియచేసుకున్నారు. ఒకరోజున 'ఒథెల్లో' ఆమెను పెళ్ళిచేసుకోమని అడిగాడు. ఆమె వెంటనే ఒప్పుకుంది. కానీ అంత తేలికైన విషయం కాదది. తన తండ్రికి కూడా ఒథెల్లో అంటే సదాభిప్రాయమే వున్నా, పెళ్ళికి మాత్రం సుతరామూ యిష్టపడడని తెలుసు. ఒథెల్లో మూర్, పరాయి దేశస్థుడు, నల్లరంగు జాతివాడు. అతడు ఎంత గుణవంతుడైతే మాత్రమేం, ఎంతటి పరాక్రమవంతుడైతేనేం? అందువల్ల తన తండ్రికి తెలీయకుండా రహస్యంగా ఆమె ఒథెల్లోని వివాహం చేసుకోవాలి. అలాగే చేసింది.

బ్రబాన్షియో ఆమెకు యిష్టమైన వాడిని పెళ్ళిచేసుకోవడానికి స్వేచ్ఛ యిచ్చాడు. కానీ అది వెనిస్‌లోని యువకుల విషయంలోనే, ఒక మూర్‌ని చేసుకోవడానికి కాదు. వీళ్ళిద్దరూ వివాహమాడారన్న వార్త విని బ్రబాన్షియో మండిపడ్డాడు. సెనేట్‌లో, డ్యూక్ ముందు ఒథెల్లో తన కూతురుని మంత్రశక్తి వుపయోగించి మోసంచేసి పెళ్ళిచేసుకున్నాడని నిందించాడు. ఇది చాలా తీవ్రమైన ఆరోపణ. వెనిస్ చట్ట

[illegible] నేరం [illegible]

కానీ ఒథెల్లో సామాన్యమైన వ్యక్తి కాడు. దేశానికి అతని సేవలు ఎంతగానో అవసరం. అదే సమయంలో ఒక నూతన వెనిస్ పాలనలో వున్న 'సైప్రస్' పైకి దండెత్తి రావడానికి "టర్కీ" సేనలు సిద్ధంగా వున్నాయని కబురు తెచ్చాడు. సెనేటు ఒథెల్లోని సైన్యాన్ని తీసుకుని వెంటనే వెళ్ళమని కోరింది. సైప్రస్ రక్షణ ఒథెల్లో చేతుల్లో వుంది. సెనేటు బ్రబాన్షియో చెప్పిందంతా విన్నాక, అతని మీద వుండే గౌరవంకొద్ది అతని అభియోగం పూర్తిగా త్రోసి పుచ్చెయ్యలేక ఒథెల్లోని సెనేటు ముందుకి పిలిపించి అతను చెప్పినదంతా కూడా విన్నారు. "నేను ఆమె ప్రేమను ఎలా పొందగలిగానో చెపుతాను విని మీరే నిర్ణయించండి నా తప్పేమిటో. ఆమె తండ్రికి నా మీదుండే అభిమానంతో నన్ను వారింటికి తరుచు పిలుస్తూ వుండేవాడు. నా సాహసకృత్యాలని చెప్పమని అడిగాడు. మెల్లి మెల్లిగా నా కథంతా చెప్పాను. నన్ను శత్రువులు ఎలా ఖైదీగా తీసుకుని ఒక బానిసగా ఎలా అమ్మారో చెప్పాను. వాళ్ళ నుంచి ఎలా తప్పించుకున్నానో కూడా చెప్పాను. ఒక సారి మేమిద్దరమే వున్నప్పుడు నా కథంతా మళ్ళీ చెప్పమని విని కళ్ళ నీళ్ళు పెట్టుకుంది. నేను అనుభవించిన కష్టాలకు ఆమె నా యందు సానుభూతి చూపినందుకు నేను ఆమెను ప్రేమించాను. నేను వుపయోగించిన మంత్రశక్తి యిదే," అని ఒథెల్లో వివరించాడు. ఆ మాటలన్నీ విన్న డ్యూక్ "నా కూతురైనా కూడా యిటువంటి పనేచేసేదేమో." అన్నాడు.

ఆ తరువాత డెస్డిమోనాని కూడా సెనేటుకి పిలిపించారు, బ్రబాన్షియో కూతురుని, "నేను నీ తండ్రిని కాదా? నువ్వు నేను చెప్పిన మాట వినక్కరలేదా." అని సూటిగా అందరి ముందు అడిగాడు, "మీరు నాకు జన్మనిచ్చారు. నన్ను పెంచి పెద్దదాన్నిగా చేశారు. నన్ను ఎంతగానో ప్రేమించారు. నేను మిమ్మల్ని తండ్రిగా ప్రేమిస్తున్నాను.

కానీ నా భర్తకి కూడా నావిధి నిర్వహణలో ఏలోపం రానియ్యకూడదు కదా! నా తల్లి మీ యందు ఎంత విధేయురాలిగా వుండాలని మీరు ఆశించారో, నేను కూడా అంత విధేయురాలిగా నా భర్త యందు వుండ వద్దా?" అని డెస్డిమోనా సమాధానం చెప్పింది తండ్రికి.

బ్రబాన్షియోకి అర్థమైంది. ఇంక తన కూతురు విషయంలో తను చేయగలిగిందేదీ లేదని. "నా చేతులో వుంటే నా కూతురుని నీకివ్వకుండా తీసుకుని వెళ్ళిపోదును. కానీ అది చెయ్యి జారిపోయిందని నాకు తెలుసు నువ్వు అంతకు ముందే నీ సొంతం చేసుకున్న నా కూతురిని నీకిస్తున్నాను తీసుకెళ్ళు. నాకింకో కూతురెవ్వరూ లేనందుకు సంతోషిస్తున్నాను. వుంటే డెస్డిమోనా చేసిన పనివల్ల ఆమెపట్ల చాలా క్రూరంగా ప్రవర్తించేవాడిని," అని చాలా బాధగా ఒథెల్లోతో చెప్పాడు. "కానీ నువ్వు మాత్రం జాగ్రత్తగా వుండు. తండ్రిని మోసం చేసిన డెస్డిమోనా నీకు కూడా మోసం చేయగలదని గుర్తుంచుకో" అని కసిగా హెచ్చరించాడు కూడా ఒథెల్లోని.

డ్యూక్ ఒథెల్లోతో సైప్రస్ పైకి టర్కీ సేనలు దండెత్తి వస్తున్న సంగతి చెప్పి "ఆదేశమంతా నీకు తెలుసున్నదే. అందువల్ల నువ్వు వెంటనే అక్కడికి వెళ్ళి రక్షించు. నీ భార్యని యిక్కడే విడిచివెళ్ళక తప్పనందుకు నాకూ బాధగానే వుంది," అని అన్నాడు. ప్రక్కనే వున్న డెస్డిమోనా తను కూడా ఒథెల్లోతో వెళ్ళడానికి అనుమతించమని అడిగింది. ఒథెల్లో కూడా ఆమెను తీసుకువెళ్ళనియ్యమని కోరాడు. "ఆమె నాతో ఉండడంవల్ల నా విధి నిర్వహణలో ఏ మాత్రం లోటురాదు. అదే కాకుండా ఆమె నాకు సహాయకారిగా కూడా వుంటుంది యీ క్షణంలోనే బయలుదేరి వెళ్ళడానికి సిద్ధంగా వున్నాను. తరువాత నా భార్యని నాకు చాలా విధేయుడైన ఆఫీసరు "ఇయాగో," అతని భార్య 'ఎమిలియా'తో

కూడా పంపించండి, అతను చాలా నిజాయితీ పరుడు, విశ్వాసపాత్రుడు అని చెప్పి బయలుదేరి వెళ్ళాడు. డెస్డిమోనా కూడా వెను వెంటనే ఇయాగో, ఎమీలియాలతో కూడా వెళ్ళడానికి సిద్ధపడింది.

ఆదే సమయంలో సముద్రంలో పెద్ద తుపాను చెలరేగింది. సైప్రస్ గవర్నర్ కూడా చాలా ఆదుర్దాగా వున్నాడు. ఒథెల్లో పడవలు "సైప్రస్" చేరక ముందే టర్కీ సేనలు వచ్చేస్తాయేమోనని ఈ తుపానుకి ఓడలన్నీ ధ్వంసమై పోతాయేమోనని కూడా భయపడుతూ అందరూ సముద్రం వొడ్డునచేరి ఎదురుచూస్తున్నారు.

ఇంతలోనే వుప సేనాపతి "కాసియో" అక్కడికి చేరుకున్నాడు. శత్రువుల ఓడలన్నీ తుపాను తాకిడికి మునిగి పోయాయని, ఒథెల్లో క్షేమంగా ఉన్నాడని శుభవార్త తీసుకువచ్చాడు. కొంత సేపటికి ఇయాగో ఓడకూడా ఒడ్డుచేరుకుంది. గవర్నర్ భవనం చేరుకుని తన భర్త సమాచార మేమైనా తెలిసిందా అని కాసియోని డెస్డిమోనా అడిగింది, ఇంకా రాలేదని, అతని కోసమే వాళ్ళంతా ఎదురు చూస్తున్నారని చెప్పాడు. డెస్డిమోనాకి కంగారుగా ఉంది. కాసియో ప్రక్కనే నిలబడి చూస్తూ కంగారులో అతని చేతులు పట్టుకుంది. కాసియో ఒథెల్లో డెస్డిమోనాలకి చిరకాల స్నేహితుడు. వారిద్దరి వివాహం కావడానికి కూడా ఎంతగానో అతడు సహాయం అందించాడు. అందుకు ఆమె ఎంతగానో అతనికి రుణపడి ఉంది. కాసియో అంటే ఆమెకు గౌరవం, సోదరభావం కూడా. కానీ ఒథెల్లో ఆమెకి ప్రాణానికి ప్రాణం.

ఈ పరిస్థితిలో ఇయాగో వీళ్ళిద్దరినీ చూశాడు. కాసియో, డెస్డిమోనాలు ఒకరిచేతులు మరొకరు పట్టుకుని వున్నప్పుడు ఇయాగో మంచి అవకాశం దొరికిందనుకున్నాడు. వాడి ఆలోచనలు వక్రంగా పోవడం మొదలు పెట్టాయి.

నిజానికి ఇయాగో చాలా దుష్టుడు ఒథెల్లో చేసిన పెద్ద పొరపాటు యితని విషయంలోనే. ఎందుకో యితడు చాలా విశ్వాసపాత్రుడనీ, పెద్ద మనిషనీ మనస్సులో అభిప్రాయం ఏర్పడింది. ఒథెల్లోని ఇయాగో ద్వేషిస్తాడు, అతనంటే అసూయ. కాసియో అన్నాకూడా అతనికి అసూయ. ఒథెల్లో తనకి కాకుండా కాసియోకి ముఖ్యమైన స్థానం, వుపసేనాధిపతి పదవి యిచ్చాడు. అప్పటి నుంచి ఇయాగో లోపల వాళ్ళిద్దర్నీ ఎలాగైనా నాశనం చేయాలని చూస్తున్నాడు. డెస్డిమోనాని ఒథెల్లో వివాహమాడ్డం కూడా అతనిమీద ద్వేషానికి తోడయింది. అందుచేత డెస్డిమోనాని కూడా వీళ్ళతోపాటు సర్వనాశనం చేయాలన్నది ఇయాగో మనస్సులో నాటుకున్న ధృఢ సంకల్పం. పైకి మాత్రం అందరితో తియ్యగా మాట్లాడుతూ వెనకగా గోతులు తీసే మనస్తత్వం కల దుష్టబుద్ధి ఇయాగో. ఇకముందు కథంతా ఇయాగో తను వేసుకున్న పథకం ప్రకారం నడిపిస్తాడు. అతడు ఎంత దుర్మార్గుడో తెలిసొచ్చేసరికి, అప్పటికే చాలా ఆలశ్యం అయిపోయింది.

ఒథెల్లో ఓడ సురక్షితంగా చేరుకుంది. అందరూ సంతోషించారు. డెస్డిమోనా భర్త దగ్గరకు పరుగెత్తుకుంటూ వెళ్ళి ఆతని రాకకోసం ఎంత ఆదుర్దాగా కాచికుని వుందో, యిప్పుడు తనకి ఎంత ఆనందంగా వుందో చెప్పింది. ఒథెల్లోకి డెస్డిమోనాకి తనంటే ఎంత ప్రేమో యిప్పుడింకా బాగా అర్థమయింది. గవర్నరుతో తను యుద్ధం చేయవలసిన అవసరం లేకుండానే తమ తరపున తుఫాను పనిచేసి శత్రువుల్ని తుదముట్టించిందని చెప్పాడు. ఈ వార్త సైప్రస్‌లోని వారందరికీ ఎంతో సంతోషం కలిగించింది. జనమంతా ఆనందోత్సాహాలతో, కోలాహలంగా వున్నారు. విందులు, వినోదాలతో వుల్లాసంగా వున్నారు. సైప్రస్ వీధులన్నీ కేరింతలతో, నవ్వులతో మారుమోగుతున్నాయి. ఆ రాత్రి ఆ

ద్వీపాన్ని రక్షించేపని కాసియోకి అప్పగించారు. ఆనందంలో సైనికులు తప్పతాగి హద్దులుమీరి ప్రవర్తించకుండా చూడమని ఒథెల్లో, కాసియోకి చెప్పాడు, ఈ అవకాశాన్ని ఎలాగైనా జారవిడవకూడదనుకున్నాడు ఇయాగో. మెల్లిగా కాసియో దగ్గర చేరి అతనిచేత తాగించడానికి ప్రయత్నించాడు. మొదట అసలు తాగడానికే ఒప్పుకోలేదు కాసియో. ఇయాగో తియ్యటి మాటలకీ కాసియో మెల్లిమెల్లిగా అతని మాయలో పడ్డాడు. ఒళ్ళు తెలియని పరిస్థితి వచ్చేవరకు ఇయాగో అతని చేత తాగించాడు. ఆ పరిస్థితిలో ఇంకొక సేనా నాయకుడిని కాసియోపైకి పురికొల్పాడు. మాటామాటా పెరిగి యిద్దరూ పోట్లాటకి దిగారు. సైప్రస్ గవర్నర్ అడ్డువచ్చి వారిద్దరినీ నివారించడానికి ప్రయత్నిస్తే కాసియో అతన్ని గాయపరిచాడు. దాంతో అక్కడున్న సైనికుల్లో చాలా గందరగోళ పరిస్థితి ఏర్పడింది. ఇది అదనుచూసుకుని ఇయాగో రహస్యంగా ఒక వ్యక్తిని కోట గంట గట్టిగా కొట్టమని పంపించాడు. దాంతో పట్టణంలో వారంతా భయభ్రాంతులయ్యారు. ఒథెల్లో కూడా నిద్రనుంచి కంగారుగా లేచాడు. గొడవ జరుగుతున్న ప్రదేశానికి వెంటనే బయలుదేరి వెళ్లాడు. ఇయాగోని అదంతా ఎలా జరిగింద్రో దానికంతటికీ కారణమెవరో చెప్పమని అడిగాడు. ఇయాగో కాసియోని కాపాడడానికి ప్రయత్నం చేస్తున్నట్లుగా నటించాడు, కానీ నిజానికి కాసియో చేసిన నేరానికంటె ఎక్కువగ కనబడేటట్లు మాట్లాడాడు. "తప్పులు చెయ్యడం మానవ సహజం. ఎంత మంచివాళ్ళు కూడా అప్పుడప్పుడు వళ్ళు మరచి ప్రవర్తిస్తుంటారు" అన్నాడు. దానికి సమాధానంగా "ఇయాగో, నాకు తెలుసు నీ నిజాయితీ. నువ్వు కాసియోని సమర్థించడానికి ప్రయత్నిస్తున్నావు. నా దృష్టిలో క్రమశిక్షణ చాలా ముఖ్యం," అని చెప్పి ఒథెల్లో కాసియోని ఆ పదవి లోంచి తొలగించాడు.

ఇయాగో పన్నాగంలో యిది మొదటి గెలుపు. ఒకడిని తన కడ్డు లేకుండా చేశాడు. ఇప్పుడు రెండో ప్రయత్నం ప్రారంభించాడు. కాసియో దగ్గరకి వెళ్లాడు. అతనికి సహాయం చేయడానికి వచ్చినట్లుగా నటిస్తూ కాసియో జరిగిన దానికి సిగ్గుతో, అవమానంతో ఎంతో క్రుంగిపోయాడు. ఇయాగో అతన్ని ఓదారుస్తూ ఒక సలహా ఇచ్చాడు. "ఇప్పుడు నీకు సహాయం చేయగలవారెవరైనావుంటే డెస్డిమోనా మాత్రమే. ఒతెల్లో ఆమె మాట కాదనలేడు. ఆమె వద్దకు పోయి బ్రతిమాలుకో. ఒథెల్లోతో చెప్పి పోయిన నీ అధికారాన్ని నీకిప్పించమని అడుగు ఆమె ఏదడిగినా యిప్పుడు చేసి తీరుతాడు," అని ఇయాగో చెప్పాడు. కాసియోకి కూడ యిది చాలా మంచి సలహాగా కనబడింది. అతనికి ధైర్యం వచ్చింది. "రేపు ఉదయమే ఆమెదగ్గరకు వెళ్ళి నాకు ఈ సహాయం చేసిపెట్టమని అడుగుతాను నాకు తెలుసు ఆమె కాదనదు. నువ్వు నాకిచ్చిన మంచి సలహాకి కృతజ్ఞుడిని. నువ్వు నాకు నిజమైన స్నేహితుడివి" అంటూ పదే పదే ఇయాగోని మెచ్చుకున్నాడు కాసియో.

తన వలలో పడుతున్నందుకు లోలోపల సంతోషిస్తూ ఇయాగో తదుపరి చర్యకి ఉపక్రమించాడు. కాసియో మర్నాడు డెస్డిమోనా దగ్గరికి వచ్చి విషయమంతా చెప్పాడు. తననెలాగయినా కాపాడమని అర్థించాడు. డెస్డిమోనా అతనికి అభయహస్తం యిచ్చింది. మళ్ళీ వాళ్ళిద్దరినీ అంతకు ముందున్నట్లుగా స్నేహితుల్నిగా చేస్తానని వాగ్దానం చేసింది. ఒతెల్లో తనడిగిన విధంగా చేసేవరకు అతన్ని విశ్రమించనియ్యనని కూడా చెప్పింది. "నీకు యీ విషయంలో నేను సహాయం చెయ్యలేక పోతే నేను చనిపోవడానికైనా సిద్ధమే" నని కూడా అంది. కాసియో, ఆమె మాటలకి ఎంతగానో సంతోషించి కృతజ్ఞతతో ఆమె చేతుల్ని తన

12)

చేతులలోనికి తీసుకున్నాడు. సరిగ్గా అదే సమయానికి ఒథెల్లో ఆ గది లోకి వచ్చి చూశాడు. కాసియో అంతకు ముందు జరిగిన దానికి తన మొహాన్ని ఒథెల్లోకి చూపించలేక, సిగ్గుతో తలవంచుకొని అక్కడినుంచి వెంటనే వెళ్ళిపోయాడు.

కానీ ఒథెల్లో కళ్ళముందు మాత్రం ఆ దృశ్యం మరొక విధంగా కనబడింది. ఏ తప్పూ చెయ్యనివాడైతే, మొహం చాటేసుకుని ఎందుకు వెళ్ళిపోవాలి. ప్రక్కనే వున్న ఇయాగో ఈ అవకాశాన్ని వదలదలుచు కోలేదు. "ఇది నాకు ఎంతమాత్రం నచ్చలేదు" అన్నాడు ఇయాగో.

ఏమిటదని ఒథెల్లో నిలదీస్తే ఇయాగో తన మనసులో అనుమా నాన్ని చెప్పడానికి ఇష్టంలేదన్నట్లు దాచెయ్యడానికి ప్రయత్నం చేశాడు. ప్రతి మాటలోనూ విపరీతార్థం వచ్చి, ఒథెల్లో అనుమానం మరీ ఎక్కు వయ్యేటట్లు చేశాడు. ఒథెల్లో మనస్సులో అసూయకి అంకురార్పణ జరి గింది. ఇయాగో అంటే మంచి అభిప్రాయం వుండడంవల్ల యీ అను మానం గట్టిపడ్డం త్వరత్వరగా జరిగింది. అనుమానం పెనుభూతం. అక్కడినుంచి ప్రతి మాటా, ప్రతి సంఘటనా ఒథెల్లోకి అతని మనస్సు లోని అనుమానాన్ని ధృవీకరిస్తున్నట్లుగా కనబడింది. ఇదంతా ఏమీ ఎరు గని డెస్డిమోనా అమాయకంగా భర్తని కాసియో చేసిన తప్పు క్షమించి, అతనితో ఎప్పటిమాదిరిగానే స్నేహంగా వుండమని ప్రార్థించింది.

"అలా చేస్తానని యిప్పుడే నాకు వాగ్దానం చెయ్యి" అని అడిగింది. ఒథెల్లో అప్పుడు కాదన్నాడు.

"అయితే ఎప్పుడు ? ఈ రాత్రా ? రేపా ? ఎల్లుండా ? ఎప్పుడు అతన్ని పిలిచి మాట్లాడతావో చెప్పు. కాసియో తను చేసిన తప్పుకి చాలా బాధపడుతున్నాడు" అంటూ ఒథెల్లోతో మరీ మరీ అతని విషయాన్ని

గురించే ప్రస్తావిస్తుంటే ఒథెల్లో గుండెల్లో చెలరేగిన మంటలకి ఆద్యం పోసినట్లయింది.

చేయవలసిన పనిచేశాక ఇయాగో ఒథెల్లోని మనస్సులో అసూయకి స్థానం యివ్వవద్దని, అసూయ చాలా భయంకరమైన భూతమనీ హెచ్చరించాడు.

"నాకు తెలుసు. నా భార్య అందగత్తె. ఆట పాటలు, విందు, వినోద, విహారాలు అంటే ఆమెకెంతో యిష్టం. అంతమాత్రంచేత అసూయపడను. తగిన సాక్ష్యాధారాలు లేందే ఎలా ?" అన్నాడు.

దానికి సమాధానంగా ఇయాగో తనదగ్గరెటువంటి సాక్ష్యాధారాలు లేవన్నాడు. ఇదంతా నిజం కాకపోవచ్చు. నిజం కాకూడదనే నా కోరిక. కానీ ఆమెని కాసియోతో మాట్లాడుతున్నప్పుడు మాత్రం కొంచెం కని పెట్టి వుండు. నాకు వెనిస్‌లోని స్త్రీల సంగతి నీకంటే బాగా తెలుసు. భర్తలని మోసం చెయ్యడంలో వారికి వారే సాటి. అదీకాక తండ్రిని మోసం చేసిన కూతురు యింకెవరిని ...... అంటూ మధ్యలో ఆగాడు ఇయాగో.

ఇది మనస్సులో బాగా నాటుకుంది ఒథెల్లోకి. "అవును. నన్ను ఎందుకు మోసం చెయ్యదు?" అనుకున్నాడు.

అప్పటినుంచి ఒథెల్లోకి మనశ్శాంతి లేదు. ఆమె కృతఘ్నురాలు. ఆమె నేంచేసినా పాపంలేదు. నిద్ర సుఖం మరిచిపోయాడు. విశ్రాంతి లేదు. యుద్ధంలో, సైనికులలో ఆసక్తిలేదు. ఆమెను గూర్చి మనస్సులో పరి పరివిధాలుగా పోవడం మొదలు పెట్టింది. మరి ఇయాగో ఎలాంటి వాడు? అతని మాటలు నమ్మవచ్చా? ఏమో ! అతని గురించి కూడా ఏమీ అర్థంకావడంలేదు. ఇయాగో గొంతు పట్టుకున్నాడు. డెస్డిమోనా తనని

మోసం చేస్తుందనడానికి ఋజువు కావాలని. తను చెప్పే దాంట్లో అబద్ధాలు ఏమీలేవని, కావాలంటే వెంటనే రుజువు చేయగలనని, అన్నాడు.

"నీ భార్య దగ్గర చక్కటి ఎంబ్రాయిడరీ కలిగిన చేతిరుమాలు వుందా?" అని అడిగాడు ఇయాగో.

ఒథెల్లో వుందని, దాన్ని తనే ఆమెకు యిచ్చానని చెప్పాడు.

"అది యిప్పుడు కాసియో దగ్గరుంది. దానితో అతడు మొహం తుడుచుకుంటుంటే చూశాను" అన్నాడు ఇయాగో.

ఒథెల్లో కోపంతో వణికిపోయాడు. "అయితే కక్ష సాధించుకు తీర్తాను" అన్నాడు.

"దానికి నా ప్రాణాలైనా సరేయివ్వడానికి సిద్ధంగా వున్నాను" అని ఇయాగో ముందుకి వచ్చాడు, "మూడు రోజులలో కాసియో ప్రాణాలతో లేడన్న వార్త నేను వినాలి" అన్న ఒథెల్లో మాటలకి.

"అలాగే జరిగి తీరుతుంది. కానీ డెస్డిమోనాని మాత్రం ఏం చేయవద్దు" అని అడిగాడు ఇయాగో.

"వీల్లేదు, ఆ జిత్తులమారి మంత్రగత్తె ఏమైనాసరే బ్రతకడానికి వీల్లేదు" అన్నాడు ఒథెల్లో.

నిజానికి డెస్డిమోనా చేతిరుమాలు విషయంలో జరిగిన సంగతి వేరు. డెస్డిమోనా తన చేతిరుమాలును కాసియో కివ్వలేదు. ఇయాగో భార్య ఎమీలియాకి దొరికింది. ఆమె దగ్గర్నుంచి దానిని తీసుకుని ఇయాగో కాసియో గదిలో పడవేశాడు.

ఒథెల్లో డెస్డిమోనా దగ్గరకు వచ్చి తలనొప్పిగా వుందని, తలకి కట్టుకోవడానికి ఆమె దగ్గరున్న చేతిరుమాలుని అడిగాడు. ఇంకోటివ్వ

పోతే, అది కాదని, తను ఆమెకు బహూకరించిన రుమాలే యివ్వమని అడిగాడు. వెతికి అది కనబడడంలేదని చెప్పింది డెస్డిమోనా.

"అలాగా! ఒక జిప్సీ, ఆ రుమాలుని మా అమ్మకిచ్చి అది తన దగ్గరున్నంతకాలం తన భర్త ప్రేమిస్తాడని, అది పోతే అతని ప్రేమ కూడా అంతటితో సరి అని చెప్పింది మా అమ్మ చనిపోతూ దానిని నాకిచ్చి, నా భార్య కిమ్మని చెప్పింది. నేను నీకిచ్చాను" అన్నాడు.

డెస్డిమోనా తన భర్త ప్రేమ కూడా పోతుందేమోనని భయపడి పోయింది. పైకి గంభీరంగానే కనిపిస్తూ, "నేను మళ్ళీ కాసియో విషయం అడక్కుండా చేయడానికి అనవసరంగా రుమాలు విషయం తీసు కొచ్చావు. కాసియోని క్షమిస్తావా, లేదా?" అంటూ మళ్లీ అతని ప్రస్తావన తీసుకొచ్చి అతని గుణగణాలు పొగడ్డం మొదలు పెట్టింది. ఒథెల్లొ గదిలోనించి బయటికి వెళ్ళిపోయాడు. ఎందుకిలా తన భర్త ప్రవర్తిస్తు న్నాడు? ఏమైనా అనుమానిస్తున్నాడా? అని అనుకుంది. మళ్లీ వెంటనే తన భర్త అలాంటివాడు కాడని సమాధాన పరుచుకుంది.

అలా వుండగా వొకరోజు ఆమెతోటి "నువ్వు నాకు మోసం చేస్తున్నావు, నువ్వు కులటవి" అన్నాడు.

నిర్ఘాంతపోయి, "నేనా! ఎవరితో?" అని డెస్డిమోనా అడిగింది.

"నువ్వెంత అందమైన దానివో, అంత గుణహీనురాలివి. అసలు నువ్వు పుట్టి వుండకపోతే ఎంత బాగుండేది?" అంటూ ఏడ్వడం మొదలు పెట్టాడు.

అతని ప్రవర్తన అంతా అగమ్యగోచరంతా వుంది ఆమెకు. ఎమీలియాతో తన బాధంతా చెప్పుకుంది. ఆమె ఓదార్చడానికి ప్రయ త్నించింది. తరువాత అమ్మెను పంపేసి నిద్రపోవడానికి ప్రయత్నించింది.

కలత నిద్రలో వుంది. ఒథెల్లో ప్రవేశించాడు. నిద్రపోతున్న ఆమె మొహంవైపు క్రొవ్వొత్తి కాంతిలో తీక్షణంగా చూశాడు. ఈమె ఇంక బ్రతికుండడానికి వీల్లేదని నిశ్చయించుకున్నాడు.

వంగి ఆమెను ముద్దుపెట్టుకున్నాడు. "మరొకసారి, ఆఖరిసారి" అనుకున్నాడు. డెస్డిమోనా నిద్రలేచింది. ఒథెల్లో కళ్ళలో చిందులు త్రొక్కుతున్న క్రోధాగ్ని చూసింది. డెస్డిమోనాకి అర్థమయ్యింది, తనని దంపబోతున్నాడని.

"ప్రార్థన చేసుకున్నావా ?" అని అడిగాడు. "క్షమించమని వేడుకో" అన్నాడు. "రుమాలు కాసియో కిచ్చావు కదా" అన్నాడు. "ప్రమాణ పూర్తిగా నేనివ్వలేదు. కావాలంటే నువ్వే అతణ్ణి పిలిపించి అడుగు" అంది. "అతను ఈపాటికి చచ్చిపోయుంటాడు. ఆ పనికి ఇయాగోని పంపాను" అన్నాడు.

ఒథెల్లో ఆమెను దిండుతో గొంతు నొక్కివేస్తూంటే, నన్నొక్క గంట బ్రతకనియ్యి, దేవుని మళ్ళీ ప్రార్థించుకోనియ్యమని వేడుకుంది. ఒథెల్లో వినలేదు. ఎమీలియా తిరిగి వచ్చేసరికి డెస్డిమోనా చచ్చిపడుంది. తనే ఆమెని చంపేశానని, ఆమె కాసియోతో ప్రేమకలాపాలు సాగిస్తూ తన్ని మోసం చేసిందనీ, ఆ విషయమంతా ఇయాగో తనకి చెప్పాడని అనడంతోటే ఎమీలియా కెవ్వున అరుస్తూ "అదంతా అబద్ధం. డెస్డిమోనా ఏ పాపం ఎరుగదు" అని చెప్పింది.

అంతలో ఇయాగో అక్కడికి వచ్చాడు. "నీ అబద్ధాలవల్ల ఆమె ప్రాణాలు పోయాయి" అంది ఇయాగోతో. అతను ఆమె నోరు మూయించడానికి ప్రయత్నించాడు. "పిచ్చి ఒథెల్లో. ఆ రుమాలు నాకు దొరికితే నేను నా భర్త కిచ్చాను. ఆమె కాసియో కివ్వలేదు. ఇదంతా ఇయాగోవల్ల జరిగింది" అని చెప్పేసింది.

ఒథెల్లో కోపంతో కత్తిదూశాడు ఇయాగోని చంపడానికి. ఇంతలో ఇయాగో కత్తితీసి ఎమీలియాని పొడిచి పారిపోయాడు. పశ్చాత్తాపంతో ఒథెల్లో తన కత్తిని తన శరీరంలోనే దింపుకుని ఆఖరిసారిగా భార్యని ముద్దుపెట్టుకుని ఆమె ప్రక్కనే ప్రాణాలు విడిచాడు.

తరువాత ఇయాగోని పట్టుకుని చిత్రహింసచేసి, సెనేటు ఆజ్ఞానుసారం యిందరి మరణాలకు కారకుడయిన ఆ కిరాతకుడిని చంపారు.

ఈ విధంగా ఒథెల్లో కథ విషాదాంతమయ్యింది.

# "గయ్యాళిని లొంగదీయడ మెలా?"

## Taming of the Shrew

ఇటలీలోని "పాడ్యువా" అనే ఒక పట్టణంలో "బాప్టిస్టా" అనే పెద్దమనిషి వుండేవాడు. అతను చాలా ధనవంతుడు. అతనికి బియాంకా, కేథరీన్ అనే యిద్దరు కుమార్తెలున్నారు. బియాంకా అందగత్తె. సాధు స్వభావం కలది. కేథరిన్ కూడా చాలా అందగత్తే. కాని ఆమె కోపిష్ఠి, పెద్ద గయ్యాళి కూడా. ఆమె నోరంటే అందరికి భయం. అందువల్ల ఆమె అందగత్తె అయినా కూడా ఆమెను మెచ్చుకునే వాళ్ళెవరూ లేరు.

కేథరీన్ పెద్దకూతురు. ఆమెను పెళ్ళాడ్డానికి ఎవరయినా సాహసించి వస్తారా, లేదా అనే బాధ తండ్రి బాప్టిస్టాకి ఎక్కువైంది. రెండవ కూతురు బియాంకాని పెళ్లాడ్డానికి మాత్రం చాలామంది ఇష్టపడుతున్నారు. పెద్ద కూతురు వివాహం కాకుండా చిన్నకూతురు వివాహం చెయ్యడం ఆ తండ్రికి యిష్టంలేదు. ఈ విషయం బియాంకాని పెళ్ళాడ్డానికి వచ్చిన వారందరికి స్పష్టం చేసాడు. అందువల్ల బియాంకా కోసం కాచుకున్న

పెళ్ళి కొడుకులు, కేథరిన్‌కు తగిన పెళ్ళి కొడుకు కోసం వెతకడం ప్రారంభించారు. ఆమె విషయం అప్పటికే చాలా మందికి తెలిసి వుండటంవల్ల ఆమెను పెళ్ళాడ్డానికి ఎవరూ సాహసించడం లేదు.

ఇటలీలోని మరొక పట్టణం వెరోనాలో పెట్రూకియా అనే ఒక ధనవంతుడైన యువకుడున్నాడు ఆతని తండ్రి ఆతనికి చాలా ధనాన్ని యిచ్చి కొద్ది కాలం క్రితమే మరణించాడు. ప్రపంచమంతా చూడాలని, తగిన భార్యను కూడా సంపాదించాలనే ఉద్దేశ్యంతో బయలు దేరి పాడువాలో వున్న మిత్రుడు "హార్టెన్సియో" దగ్గరకు వచ్చాడు. బియాంకాను వివాహమాడ్డానికి వేచి ఉన్న యువకులలో అతనొకడు. పెట్రూకియో, తను పెళ్ళాడ్డానికి తగిన అమ్మాయిని వెతుకుతున్నానని చెప్పేసరికి హార్టెన్సియోకి కేథరిన్ విషయం గుర్తుకువచ్చింది. పెట్రూకియో చాలా గుండె నిబ్బరం కలవాడు. మొండివాడు. ఇతను కేథరిన్‌ను తగినవాడు అనిపించింది హార్టెన్సియోకి. ఇతనయితే ఎలాగోలా ఆమెను లొంగదీసుకోగలడనుకున్నాడు. మంచి సరదా అయినవాడు, తెలివైన వాడు కూడా కనుక తన సలహాని తప్పుగా భావించడనుకున్నాడు. విషయమంతా చెప్పాడు. తను బియాంకాని ప్రేమిస్తున్నానని, ఆమెను పెళ్ళిచేసుకోడానికి సిద్ధంగా ఉన్నానని, అయితే ఆమెకున్న గయ్యాళి అక్కగారు కేథరిన్‌కి పెళ్ళయ్యేదాకా తన కోరిక నెరవేరే అవకాశం లేదని చాలా విచారంగా చెప్పాడు, ఈ విషయం వినడంతోనే పెట్రూకియోకి కేథరిన్‌ని చూడాలని, ఆమె గయ్యాళి అయితే తను మొండి వాడినని, పెళ్ళంటూ చేసుకుంటే అటువంటి యువతినే చేసుకుని లొంగ తీసుకోవాలనుందని చెప్పాడు.

ఇద్దరూ కలిసి బాప్టిస్టా యింటికి వెళ్ళారు."నువ్వు సంగీతవిద్వాం

సుడిగా నటించు. ఆమెకు సంగీత పాఠాలు నేర్పు. నేను ప్రేమపాఠాలు నేర్పుతాను. మనిద్దరం కలసి కేథరిన్ పొగరు అణిచి లొంగదీద్దాం" అన్నాడు పెట్రూకియో హార్టెన్సియోతో.

బాప్టిస్టా యింటికి చేరి పెట్రూకియో తను కేథరిన్ అందచందాలు, అణుకువ తనం గురించి విని ఆమెను వివాహం చేసుకోవడానికి అనుమతి కోసం వచ్చానని చెప్పాడు. హార్టెన్సియోని ఆమె దగ్గరికి సంగీతం నేర్పమని పంపించి, పెట్రూకియోతో తన కూతురు కేథరిన్ అతనికి తగిన భార్య కాదేమోనన్న సందేహాన్ని వెలిబుచ్చాడు. దానికి సమాధానంగా పెట్రూకియో, "నన్ను అల్లుడుగా చేసుకోవడం యిష్టంలేకనో, మీ అమ్మాయిని మీ దగ్గరవించి పంపించి వేయడానికి యిష్టంలేకనో అలా చెవుతున్నారు." అన్నాడు బాప్టిస్టాతో. అదేంకాదని చెబుతూ బాప్టిస్టా ఆతని గురించి వివరాలు అడిగాడు. అతను తన స్నేహితుని కుమారుడని తెలుసుకుని సంతోషించాడు. తనకూతురు, పెట్రూకియో అనుకున్నంత సౌమ్యంగా ఉండదని, చాలా తొందరపాటుగా ప్రవర్తిస్తుందని, అయినా తను ఆంతగా వివాహమాడాలని సంసిద్ధత చూపిస్తున్నందువల్ల తను అడ్డుచెప్ప దలుచుకోలేదని, అదృష్టముంటె వాళ్ళిద్దరూ అన్యోన్యంగా వుంటారేమో చెప్పలేనని బాప్టిస్టా అంటూవుంటే హార్టెన్సియో వారున్న గదిలోనికి పరిగెత్తుకుంటూ వచ్చాడు. అతనితల బ్రద్దలయి నెత్తురు కారుతోంది. మొహం భయంతో, కోపంతో వివర్ణమయింది" అలా ఎందుకయింది? నా కూతురికి సంగీతం బాగా వస్తుందా అని బాప్టిస్టా అడిగాడు. ఆమె సైనికుడుగా బాగా రాణిస్తుంది." అని చెబుతూ జరిగినదంతా చెప్పాడు హార్టెన్సియో. ఆమె తప్పుగా వాయిస్తూ వుంటె, సరి చెయ్యడానికి ప్రయత్నించానని, దాంతో కోపం వచ్చి ఆ వయొలిన్‌తోటె తన నెత్తిమీద కొట్టిందని, ఆ దెబ్బకి తన తల,

వయొలిన్ కూడా బ్రద్దలయ్యిందని చెప్పాడు. అది చాలక తనను నానా తిట్లు తిట్టి అక్కడినుంచి పంపించిందని కూడా చెప్పాడు. ఈ సంఘటన విన్న పెట్రూకియో భయపడక పోగా, పగలబడి నవ్వుతూ, "కేథరిన్ చాలా ధైర్యమైన పిల్లన్నమాట. దీనితో నాకు ఆమె అంటే ప్రేమ పదిరెట్లు ఎక్కువయ్యింది" అన్నాడు. ఆమెను వెంటనే వెళ్ళి కలుసుకోవాలని వుందని చెప్పాడు. బాప్టిస్టాకి హార్టెన్సియో మీద జాలి కలిగి, తన రెండవ కూతురు బియాంకా చాలా మంచిదని, బుద్ధిమంతురాలని, ఆమెకు సంగీతం నేర్పమని అతణ్ణి పంపించాడు. హార్టెన్సియోకి కావలసింది కూడా అదే.

పెట్రూకియోని అక్కడ ఒంటరిగా వదలి, తన కూతురు కేథరిన్‌ని తీసుకురావడానికి బాప్టిస్టా వెళ్ళాడు. ఆమెను ఎలా లొంగదీసుకోవాలా అని ఆలోచించడం మొదలుపెట్టాడు. ఆమె తిడితే తను మధురంగా పాడినట్లుందని చెప్పాలని, ఆమె కోపంగా మొహం ముడుచుకుంటె, మంచుతో తడిసి అపుడే వికసించిన గులాబీ పువ్వులా ఆమె ముఖం వుందని, ఆమె మాట్లాడకుండా మూతి బిగుంచుకుని కూర్చుంటె, ఆమె ఎంత బాగా మాట్లాడుతోందోనని, అక్కడినుంచి తనను వెళ్ళిపొమ్మంటె, తనని అక్కడే వారంరోజులు ఉండమన్నందుకు కృతజ్ఞత చెప్పాలని, ఆమె తనని పెళ్ళాడనంటె ఏ రోజున వారిద్దరి వివాహం జరగాలని తనకుందో చెప్పమని, యిలా అనేక విధాలుగా తను ఆమె ముందు ప్రవర్తించబోయే తీరు గురించి ఆలోచించుకున్నాడు.

కేథరిన్ తనని చూడాలంటున్న వ్యక్తి ఎవరా, అంత ధైర్యంగా తనకి రమ్మని కబురు పంపాడు, అనుకుంటూ వచ్చింది. పెట్రూకియో ఆమెను చాలా కాలంగా పరిచయమున్న వాడిలాగా "కేట్" అని పిలుస్తూ పలకరించాడు. "నా పేరు కేథరిన్" అని కర్కశంగా సమాధానం

యిచ్చింది. "నువ్వు చెప్పేది అబద్ధం." "నీ పేరు కేట్, అందరూ నిన్ను అలా పిలుస్తారు. కొందరు నిన్ను గయ్యాళి కేట్ అని కూడా పిలుస్తారు. కాని నువ్వు నాదృష్టిలో అతిలోక సుందరి కేట్వి. నీఅందం, మంచితనం, నీ గుణగణాలు అందరూ పొగడగా విని, నిన్ను వివాహ మాడాలనే కోరికతో వచ్చాను అన్నాడు పెట్రోకియో. "నీకెంత ధైర్యం తక్షణమే యిక్కడ నుంచి వెళతావా. లేదా?" అని కేథరిన్ గట్టిగా అరి చింది. అయినా పెట్రోకియో చలించలేదు. అతన్ని దుర్భాషలాడింది. పోట్లాడానికి ప్రయత్నించింది. అయినా అవేవి విననట్లే ప్రవర్తించాడు పెట్రోకియో. మళ్ళీ ఆమె అందాన్ని, ఆమె సాధు స్వభావాన్ని పొగిడి ఆమెను గురించి చెడ్డగా చెప్పిన వారంతా వట్టి అబద్ధాలకోరులు అన్నాడు. చివరగా తన నిర్ణయాన్ని చెప్పాడు. "నీ కిష్టం వున్నా, లేకున్నా నేను నిన్ను పెళ్ళి చేసుకోబోతున్నాను. మీ నాన్న యిందుకు సమ్మతించాడు. నేను నిన్ను గయ్యాళి కేట్ నించి, "సాధు" కేట్ కి మార్చడం మాత్రం ఖాయం. మీ నాన్న వస్తున్నాడు. ఆయన ముందు కాదనకు. నూరు అరయినా, ఆరు నూరయినా కేథరిన్ నా భార్య. అది గుర్తుంచుకో" అని హెచ్చరించాడు.

బాప్టిస్టా వచ్చాడు. అతనితో తనూ, కేథరిన్ వచ్చే ఆదివారం పెళ్ళి చేసుకోవటానికి నిశ్చయించుకున్నామని పెట్రూకియొ చెప్పాడు. కోపంతో మండిపడుతూ, "మన పెళ్ళికి ముందు నిన్ను వురి తీసేటట్లు చూస్తాను జాగ్రత్త" అని అంది. తన తండ్రి ఒక పిచ్చివాడికిచ్చి, తన పెళ్ళిచేసి తనని వదుల్చుకోవాలని చూస్తున్నాడని కూడా నిందించింది. —నికి పెట్రూకియో అడ్డువస్తూ బాప్టిస్టాతో, అదంతా చూసి కంగారు పడ న్లని, తనముందే అలా ప్రవర్తిస్తోందని, తను లేనప్పుడు ఎంతో పేమగా తనతో మాట్లాడిందని చెప్పాడు. "నన్ను కేట్ ఎంత ప్రేమి

స్తోందో మీరు చూస్తే కాని నమ్మలేరు," అని చెపుతూ, "కేట్! నా దగ్గరకు వచ్చి, నన్ను ముద్దు పెట్టుకో. నేను వెంటనే వెనిస్‌కి బట్టలు, ఆభరణాలు కొనుక్కోవడానికి వెళ్ళాలి. మరి మన పెళ్ళి వచ్చే ఆదివారమే కదా," అన్నాడు. కేథరిన్‌ని వుద్దేశించి కోపంతో ఆమె నోట మాట రాలేదు. ఈ వింత మనిషి. అసందర్భ ప్రేలాపనకి ఆశ్చర్యపోయి, మరొకమాట మాట్లాడకుండా అక్కడినుంచి వెళ్ళిపోయింది.

ఆదివారం రానే వచ్చింది. రావలసిన అతిథులంతా వచ్చి కూర్చున్నారు. కాని పెట్రూకియో జాడలేదు. కేథరిన్ కోపంగానే పెళ్ళి దుస్తులన్నీ ధరించి, ముస్తాబై కూర్చుంది. ఎంతకి పెట్రూకియో మాత్రం రాలేదు. వచ్చిన వాళ్ళందరూ గుసగుసలాడుకుంటున్నారు. కేథరిన్ యింక భరించలేక తనని తను తిట్టుకుంటూ కోపంతో, వుక్రోషంతో ఏడ్వడం మొదలుపెట్టింది. పెట్రోకియో తనని ఏడ్పించడానికే యిలా చేసాడు. కాని నిజంగా అతనికి తనని పెళ్ళి చేసుకోవాలనే వుద్దేశ్యం లేదు అనుకుంది.

అందరూ కూడా యింక పెట్రూకియో రాడని నిర్ధారణ చేసుకున్న సమయంలో అకస్మాత్తుగా ఒక ముసలి గుర్రం మీద స్వారీ చేసుకుంటూ ప్రత్యక్ష మయ్యాడు. ఇక పెట్రూకియో వాలకం చూస్తే మరీ అధ్వాన్నంగా ఉంది. చిరిగిన గుడ్డలు, బెల్టుకి తుప్పు పట్టిన కత్తి, దుమ్ము కొట్టిన మొహం అన్నీ చూస్తే అతడు చూడ్డానికి బిచ్చగాడిలా కనపడుతున్నాడు. అందరూ అతనికేసి వింతగా చూస్తున్నారు. గుర్రంమీదనుంచి ఒక్క గంతువేసి దిగి, "నా కేట్ ఏదీనా ముద్దులభార్య కేట్ ఎక్కడ?" అంటూ అరవడం మొదలు పెట్టాడు.

ఇదంతా చూసేసరికి బాప్టిస్టాకి అతిథులందరి ముందరా తల తీసేసినట్లయింది. అది తన పెళ్ళిరోజని, వెంటనే పోయి మంచి దుస్తులు

ధరించిరమ్మని చెప్పాడు. పెట్రూకియో దానికి ఎంత మాత్రం ఒప్పుకో లేదు. "కేథరిన్ పెళ్ళాడుతున్నది నన్ను కాని, నా దుస్తుల్ని కాదు"అని తిక్కగా సమాధానం కూడా చెప్పాడు. ఎంతమంది ఎన్ని విధాలుగా చెప్పిచూసినా ఏమాత్రం లాభంలేకపోయింది. ఇక చేసేదేమీలేక అందరూ బయలుదేరి, అయిష్టంగానే చర్చికి చేరుకున్నారు. అక్కడ కూడా పెట్రూకియో ధోరణి యిలాగే కొనసాగింది. అక్కడ వివాహం జరిపిస్తున్న పురోహితుడిని గట్టిగా తిట్టేసరికి భయంతో అతని చేతిలో ఉన్న పుస్తకం నేలమీద పడింది. అది తీసుకోవడానికి వంగితే, అతణ్ణి గట్టిగా తన్నాడు. అలాగే అరుస్తూ, కాలితో నేలమీద కొడుతూ, అందర్నీ తిడుతూ పిచ్చిపిచ్చిగా ప్రవర్తిస్తూ వచ్చాడు. అందరూ యిదంతా చూసి ఆశ్చర్యపోవడమే కాకుండా, భయమంటే అసలే ఎరుగని కేథరిన్ కూడా భయంతో వణికిపోయింది. వివాహ కార్యక్రమం అంతా పూర్తయ్యాక ఒక కప్పు "వైన్" కావాలని గట్టిగా అరచి, తెచ్చి యిచ్చిన తరువాత సగం త్రాగి, మిగిలినదంతా పురోహితుడి ముఖంమీద పోసాడు.నవ్వుతూ "అతని గడ్డం చిక్కిపోయి, ఆకలితో వుంది. వైన్ కాస్త మంచి చేస్తుందని చేశాలు అలా" అని తనే సమాధానపరచుకున్నాడు.

అతికష్టంమీద పెట్రూకియోని, అక్కడినుంచి బయలుదేరి, తన తండ్రి యింటి దగ్గరకి వచ్చేటట్లుగా చేసింది కేథరిన్ చివరికి. వచ్చాడే కాని, వివాహ భోజనానికి మాత్రం ససేమిరా వుండనన్నాడు. కేథరిన్ ఎంతో బతిమాలింది. పెళ్ళికొచ్చిన అతిధులంతా వాళ్ళిద్దరూ విందుకి వుండకుండా వెళ్ళిపోతే చాలా బాధపడతారని చెప్పింది. దానికీ లెక్క చెయ్యలేదు. చివరికి, తనమీద ప్రేమ వుంటే, విందుకి ఆగమని అడిగింది. అదీ వినిపించుకోకుండా, గుర్రాన్ని తీసుకురమ్మని సేవకుల్ని పంపాడు

దాంతో కేథరీన్ మండిపోయి, "అయితే నువ్వెళ్ళు, నేను మాత్రం చచ్చినా నీతో రాను యీ రోజు" అని ఖచ్చితంగా చెప్పేసింది.

అప్పుడు పరిస్థితి చెయ్యిజారిపోతుందేమోనని భయపడి, అంత కోపగించుకోవద్దని కేట్‌ని ప్రతిమాలాడు. "నేను వుండమన్నంతసేపు నువ్వు యిక్కడ ఉండాల్సిందే," అని చెప్పి అతిథులతో కలిసి భోజనానికి బయలుదేరబోతుంటె, "నా భార్య ఆదేశించినట్లు మీరందరూ వెళ్ళండి, కాని నా భార్య మాత్రం నా ఆజ్ఞానుసారం, నాతోటే వస్తుంది. మీతో భోజనానికి రాదు" అని అతిథులతో చెప్పాడు.

ఇక కేథరిన్ చేయగలిగేది ఏమీలేక, ఏం జరుగుతుందో తెలుసుకునే లోపలే పెట్రూకియోతో గుర్రంమీద అతని ఇంటికి బయలుదేరింది. ఏ క్షణాన్నయినా చనిపోవడానికి సిద్ధంగా వున్న ఆ గుర్రం మీద ప్రయాణంచేసి యిల్లు చేరేసరికి ఆమె ఒళ్ళు హూనమయిపోయింది. పూర్తిగా అలిసిపోయింది దారి మధ్యలో క్రిందపడి, గుడ్డలన్నీ మురికయిపోయి, యిద్దరూ చాలా ఘర్షణపడి, చాలా పొద్దుపోయి చేరుకున్నారు. దారిలో అతని ప్రవర్తనంతా చూసి తను నిజంగానే ఒక పిచ్చివాడి చేతిలో చిక్కుకున్నానని కేథరీన్‌కి ధృవపడింది. యింటికి చేరాక కూడా ఆమె కష్టాలు అంతం కాలేదు ఆకలి దహించుకుపోతోంది. ఇంటిదగ్గర అతని సేవకులందరూ భార్యాభర్తలిద్దరికి స్వాగతం పలకడానికి వస్తే, వాళ్ళందరిని తిట్టి పంపేసాడు, కేథరీన్ ఎంత నివారిస్తున్నా వినకుండా.

సేవకులు భోజనం తీసుకువచ్చారు. అది బాగుండలేదని, మాడిపోయిందని, తినడానికి పనికిరాదని, వారిమీద మండిపడ్డాడు. కేథరీన్‌కి భోజనం బాగానే ఉన్నా, ఆమెని తిననియ్యకుండా, అది తింటే ఆమెకు జబ్బు చేస్తుందని చెప్పి, వాళ్ళు తెచ్చినవన్నీ నేలమీద విసరికొట్టాడు.

అదే కాకుండా ఆమెను తెల్లవార్లు ఒక్క కునుకైనా నిద్రపోనీ లేదు. అక్కడున్న ప్రతి వస్తువు విషయంలో తప్పు పట్టుకోవడం మొదలుపెట్టి, పనిచేసే వాళ్ళందర్నీ రాత్రంతా పెద్ద గొంతుపెట్టి తిడుతూనే వున్నాడు. ఇదంతా తన రోగం కుదర్చడానికి పెట్రూకియో పన్నిన పన్నాగమని మాత్రం ఆమెకి తెలియలేదు. నోరు పెట్టుకుని, అందరినీ రాత్రింబవళ్ళు తిట్టిపోసే మనిషితో కాపురం చెయ్యడం ఎంత కష్టమో ఆమెకి తెలిసేటట్లు చెయ్యాలని అతని వుద్దేశ్యం.

మర్నాడు కూడా ఇదే విధంగా ప్రవర్తించాడు. ఆమెతో మంచిగా మాట్లాడుతూనే యింట్లో పరిస్థితి దుర్భరం చేసాడు. ఆకలి బాధ సహించలేక కేథరీన్ ఒక పనివాడికి భోజనం తెమ్మని చెప్పింది వాడు 'యజమాని చెప్పందే తీసుకురానని స్పష్టం చేసాడు.

"తనని మాడ్చి చంపేందుకే పెళ్ళిచేసుకున్నాడా ? తిననియ్యడు, నిద్రపోనియ్యడు. ఇదంతా తనమీద ప్రేమతో చేస్తున్నట్లు నటిస్తాడు. ఇదంతా ఏమిటి?" అంటూ బాధపడింది.

ఇంతలోనే పెట్రూకియో ఒక ప్లేటులో భోజనం తీసుకు వచ్చాడు. అదంతా తనే స్వయంగా తయారు చేసి తీసుకువచ్చానని చెప్పాడు.

దానికి కేథరీన్ ఏమీ మాట్లాడకపోయేసరికి, "ఏం మాట్లాడవు ? నేను తయారుచేసిన పదార్థాలు నీకు యిష్టంలేదా ?" అంటూ కోపంగా వాటిని తీసుకు వెళ్ళిపొమ్మని సేవకుడికి చెప్పాడు.

ఆకలితో బాధపడుతున్న కేథరీన్ వాటిని వుంచమని ఎంత అడిగినా కూడా వినిపించుకోకుండా, కొంచెం మాత్రం తిననిచ్చి, అంతకంటే ఎక్కువ తినడం మంచిది కాదని, పంపించి వేసాడు.

ఆ తరువాత ఒక టైలరుని, తను తయారు చెయ్యమన్న దుస్తులు తీసుకురమ్మని కబురు పంపాడు. అతను కేథరీన్‌కి చక్కటి టోపీ చూపించాడు. అది చాలా చిన్నదై పోయిందని, చంటిపిల్లల టోపీలాగా ఉందని, వొంక పెట్టి, యింకా పెద్దది కావాలన్నాడు. కేథరీన్ అదెంతో బాగుందని, అదే అప్పటి 'ఫ్యాషన్' అని తనకి అంతకంటె పెద్దది వద్దని ఎంత చెప్పినా వినిపించుకోకపోతే, వారిద్దరి మధ్య పెద్ద ఘర్షణ జరిగింది అలాగే టైలరు కుట్టి తెచ్చిన దుస్తుల గురించి కూడా యిద్దరూ పోట్లాడుకున్నారు. కేథరీన్ ఏదయితే బాగుంటుందంటుందో, అదేది బాగుండలేదని పెట్రూకియో విమర్శిస్తున్నాడు. కొత్త దుస్తులు తిప్పి పంపేసి పాత వాటితోటే యిద్దరూ బాప్టిస్టా ఇంటికి బయలుదేరారు.

అప్పుడు నిజంగా మధ్యాహ్నం రెండు గంటలయ్యింది. పెట్రూకియో ఏడు గంట లయ్యిందన్నాడు. కాదని కేథరీన్ అంటే, తను అన్నది ప్రతిదీ కాదనడమే ఆమె మతం లాగున్నదని కోపించి, ఆ రోజున వెళ్ళనని భీష్మించుకుని కూర్చున్నాడు. కేథరీన్ అర్థం చేసుకుంది. అతను ఏదన్నాసరే తను ఒప్పుకోవడం తప్ప వేరే గత్యంతరం లేదని.

మర్నాడు యిద్దరూ బయలుదేరారు. మధ్యలో కొంత సేపు ఆగి విశ్రాంతి తీసుకుందామన్నాడు. ఆహ్లాదకరమయిన ఉదయం సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. "చంద్రుడు ఎంత కాంతితో ప్రకాశిస్తున్నాడో!" అన్నాడు పెట్రూకియో.

అప్పుడు "ప్రకాశిస్తున్నది సూర్యుడు కాని, చంద్రుడు కాదని" కేథరీన్ అంది.

ఇద్దరూ వాళ్ళు చెప్పిందే నిజమంటూ పోట్లాడుకున్నారు. అంత

లోనే అక్కడికి ఒక ముసలాయన వచ్చాడు. ఆయనని పెట్రూకియో ఒక చక్కటి స్త్రీ అన్నట్లుగా సంబోధించాడు. "ఇంతకంటె అందమైన స్త్రీని నువ్వు ఎక్కడైనా చూసావా?" అని అడిగాడు కేథరీన్‌ని, కేథరీన్ యిప్పటికే యిటువంటి విషయాల్లో బొప్పికట్టి వుండటంవల్ల తనూ ఆ ముసలి మనిషిని అలాగే సంబోధించింది.

పెట్రూకియో ఆశ్చర్యంగా, "ఏమిటీ నువ్వనేది ? ఇతను ఒక వృద్ధుడు. చిన్న ఆడపిల్ల కాదు. నీకేమయినా పిచ్చి ఎత్తిందా ?" అని మందలించాడు.

ఆ వృద్ధుడికి వారిద్దరి ప్రవర్తన చూసి మతిపోయింది. అతని పేరు విన్సెన్షియో. అతను కూడా పాడువా వెళుతున్నానని చెప్పి, వారితో కలసి ప్రయాణం సాగించాడు. తన కొడుకు లూసెన్షియో బియాంకాని పెళ్ళి చేసుకోబోతున్నాడని, ఆ పెళ్ళికి వెళుతున్నానని చెప్పాడు. పాడువా చేరుకునేసరికి సరిగ్గా పెళ్ళిభోజనాలు జరుగుతున్నాయి. పెట్రూకియో స్నేహితుడు, సంగీత విద్వాంసుడిగా నటించి, దెబ్బలు తిన్న హోర్టెన్సియో బియాంకాని పెళ్ళిచేసుకోవడానికి చేసిన ప్రయత్నంలో విఫలుడై, మరొక స్త్రీని వివాహమాడాడు. సరిగ్గా అదే సమయానికి అతను కూడా భార్యతో అక్కడికి వచ్చాడు.

భోజనాలు అయ్యాక స్త్రీ లందరూ గదిలోంచి వెళ్ళిపోయాక, అక్కడున్న హర్టెన్సియో. లూసెన్సియోలు, పెట్రూకియోని, తన భార్య గయ్యాళితనాన్ని గురించి ఆట పట్టిస్తున్నారు. బాప్టిస్టా కూడా వాళ్ళకి వంత పాడాడు. పెట్రూకియో అది నిజంకాదని, అందరి భార్యల కంటె తన భార్య చాలా మంచిదని అప్పుడే రుజువు చేస్తానని మిగతా యిద్దరితో ఒక పందెం వేసాడు.

మీరు మీ భార్యలకోసం కబురు చేయండి. నేను కూడా చేస్తాను. ఎవరి భార్య, భర్తమాట వింటుందో చూద్దామని అన్నాడు.

లూసెన్షియో, హార్టెన్సియోలు ఇద్దరూ వెంటనే అంగీకరించారు. ముందు లూసెన్సియో ఒక సేవకుడిని పంపాడు. తన భార్యని రమ్మని. వెంటనే అప్పుడు రావడానికి తనకి వీలులేదని కబురుపంపింది. తరువాత హార్టెన్సియో పంపాడు. వీళ్ళు ఏదో పరిహాసము ఆడుతున్నారని తెలుసు కుని, అతన్నే తన దగ్గరకు రమ్మని కబురు పంపింది. పెట్రూకియో వంతు వచ్చింది. అతనికి ఎటువంటి సమాధానం వస్తుందో అందరికీ తెలిసిందే కదా అంటూ మిగతా యిద్దరూ ఆతన్ని హేళన చేసారు.

వెంటనే కేథరిన్ ఎందుకు పిలిచారంటూ, అందర్ని ఆశ్చర్యంలో ముంచెత్తేటట్టుగా వచ్చింది. మిగతా యిద్దరి భార్యల్ని కూడా పిలుచుకుని రమ్మని ఆమెను పంపాడు పెట్రూకియో.

మాట్లాడకుండా ఆమె వెంటనే వెళ్ళింది. అందరూ ఆశ్చర్య పోతుంటే అప్పుడే అంతా అయిపోలేదని, ఒక్క క్షణంలో ఇంకా విచిత్ర మయిన సంఘటన చూస్తారని వాళ్ళతో చెప్పాడు. వాళ్ళని వెంటపెట్టుకుని కేథరీన్ వచ్చింది. "నీ తలమీద వున్న టోపీ బాగా లేదు అది తీసి పారెయ్యి" అన్నాడు పెట్రూకియో భార్యతో. వెంటనే ఆమె తీసి నేల మీద తీసిపారేసింది.

హార్టెన్సియో భార్య ఆశ్చర్యపోయి, నాచేతమాత్రం ఎవరూ ఇటు వంటి పిచ్చిపని చేయించలేరు అంది. బియాంకా, ఇది భార్య విధేయత కాదు. తెలివితక్కువతనం అనిపించుకుంటుంది అనడంతోటే, నీ తెలివి తక్కువతనానికి నాకు వంద క్రౌన్లు నష్టం వచ్చిందన్నాడు అలాంటి పందెం వేయడం నీ తప్పేనంది బియాంకా భర్తతో.

పెట్రూకియో అప్పుడు కేథరీన్‌ని భార్యలు, భర్తల యందు ఎటువంటి భక్తిశ్రద్ధలతో ప్రవర్తించాలో చెప్పమన్నాడు. అందరికీ ఆశ్చర్యం కలిగించే విధంగా కేథరీన్ భార్యల ప్రవర్తన ఎలా ఉండాలో వివరించి చెప్పింది.

ఆ తరువాత పాడ్యువా నగరంలో కేథరీన్‌కి గయ్యాళి అన్న పేరు పోయి, విధేయురాలైన భార్యగా పేరు సంపాదించుకుంది.

# జూలియస్ సీజర్
# Julius Caesar

రెండువేల సంవత్సరాలకి పూర్వం రోమ్ సెనెట్ పరిపాలనలో వుండేది. నిస్వార్థ సేవకి, నిజాయితీకి పేరుబడ్డ ప్రముఖులయిన రోమన్లు యీ సెనేట్‌లో సభ్యులుగా వుండేవారు. వారి పరిపాలనలో రోమ్ ఎంతో సుభిక్షంగా వుండేది. కాలక్రమేణా, రోమ్ సిరి సంపదలతో తులతూగుతున్నపుడు స్వార్థం, సంకుచితత్వం వారిలో చోటుచేసుకున్నాయి. వారిలో చీలికలొచ్చాయి. పదవీ వ్యామోహంతో వారిలో వారు యుద్ధాలకి దిగారు. వారి నాయకుల్లో పాంపే, జూలియస్ సీజర్‌లు చాలా పరాక్రమవంతులయిన సేనాధిపతులు. ఈ కథా సమయానికి వారిద్దరి మధ్య శత్రుత్వమేర్పడి అతి భీకరమయిన పోరాటంలో సీజర్ పాంపేని ఓడించి రోమ్‌కి విజయపతాకం ఎగరవేసుకుని తిరిగి వచ్చాడు. రోమన్లందరూ సీజరుకి అపూర్వమయిన స్వాగతం పలికారు.

ఇదిలా వుండగా, సీజరు దగ్గిర స్నేహితుల్లోనే కొందరికి అతని గురించిన కొన్ని అనుమానాలు లేకపోలేదు. అతనికి రాజు కావాలనే

కోరిక వుందని, యిప్పుడు పాంపేకూడా అడ్డుతొలగి పోవడంతో తన చిరకాల వాంఛ నెరవేర్చుకోవడానికి అన్ని విధాల ప్రయత్నం చేస్తాడని వాళ్ళభయం. ప్రజాస్వామ్యం పద్ధతులకి అలవాటు పడ్డ కొందరికి యిది ఎంత మాత్రం యిష్టం లేదు. అటువంటి వారిలో ముఖ్యుడు బ్రూటస్. అతడు సీజరుకి ప్రాణస్నేహితుడు. దేశభక్తుడుగా, ఉత్తమ సంస్కారవంతుడుగా, సరళ స్వభావుడుగా, సహృదయుడుగా ప్రజల మన్నన పొందిన మహామనీషి కూడా. అందుకే తన మిత్రుడికి రాజు కావాలనే మితిమీరిన ఆశ ఆతడిని ఎంతోకలవర పరచింది. అటువంటి వ్యక్తివలన దేశానికి ఎంత మాత్రం మంచి జరుగదని అతని బాధ.

ఆరోజు సీజరు ఘన విజయాన్ని పురస్కరించుకొని ప్రజలు ఆనందోత్సాహాలతో పండుగ చేసుకుంటున్నారు. ఆ సందర్భంగానే ఆటల పోటీలు నిర్వహించబడుతున్నాయి. జనం తండోప తండాలుగా వాటిని చూడడానికి వచ్చారు. సీజరు ఆ ప్రదేశానికి వెళుతుంటె చూడ్డానికి జనం రోడ్లకిరువైపులా బారులు తీసి నుంచున్నారు. ఇళ్ళ పై కప్పుమీద కూడా కూర్చుని చూస్తున్నారు. ఇదే జనం, ఇంతకోలాహలంగానూ పాంపేని చూడ్డానికి నిలబడి ఎంతో కాలం కాలేదు. అదంతా వారు యిపుడు పూర్తిగా మర్చిపోయి. ఆ పాంపేని ఓడించి వస్తున్న సీజరు కోసం నిలబడి వున్నారు. ఆ సమయంలో బ్రూటస్ అక్కడికి వచ్చి, అతడి స్నేహితుడు కాషియస్‌ని కలుసుకున్నాడు. దూరంగా ప్రజల అరుపులు వినబడ్డాయి, "సీజర్‌ని ప్రజలు రాజుగా చేస్తారేమోనని భయంగా వుంది నాకు" అన్నాడు బ్రూటస్. సీజర్ రోజు రోజుకి అంత పెద్దవాడుగా ఎదిగిపోవడం చూసి ఎంతో అసూయగా గమనిస్తున్న కాషియస్‌కి బ్రూటస్ అన్నమాటలు కొంత ధైర్యాన్నిచ్చాయి. "అయితే సీజర్ రాజు కావడం నీకు యిష్టం లేదన్నమాట?

అన్నాడు. "లేదు, సుతరాము యిష్టంలేదు. అయినా కూడా సీజర్‌ని నేను గాఢంగా ప్రేమిస్తున్నాను" అన్నాడు బ్రూటస్.

సీజర్ ఆటస్థలానికి వూరేగింపుగా వెళుతున్నాడు. దారి పొడుగునా జనం అతణ్ణి చుట్టు ముడుతున్నారు. సీజర్ ప్రక్కనే అతని మరొక ఆప్తమిత్రుడు మార్క్ ఆంటోని వున్నాడు. మరొక ప్రక్క బ్రూటస్ వున్నాడు. దారిలో భవిష్యత్తులో జరుగబోవు విషయాన్ని చెప్పగల ఒక వ్యక్తి ముందుకు త్రోసుకువచ్చి "సీజర్! సీజర్!మార్చి 15 జాగ్రత్త!" అని అరిచాడు. ఎవరిలా అన్నాడో అడిగి తెలుసుకొని, వాడెవడో పిచ్చివాడయ్యుంటాడనుకుని ముందుకి సాగిపోయాడు,

బ్రూటస్ ఆలోచన ఏ విధంగా వుందో తెలుసుకున్న తరువాత కాషియస్, సీజర్ విరోధుల్ని కొందర్ని కలుసుకుని చెయ్యవలసిన కార్యక్రమాన్ని గురించి చర్చించాడు. వారందరూ బ్రూటస్ తమనాయకుడుగా వుంటే బాగుంటుందని, ప్రజలెవ్వరూ వారిని అనుమానించరని అందుకు బ్రూటస్‌ని ఒప్పించమని కాషియస్‌ని పంపారు. మెల్లగా బ్రూటస్‌ని తమ వైపు తిప్పుకోవడానికి ప్రయత్నం ప్రారంభించాడు. "ఏమిటి సీజర్ గొప్పదనం? మనమూ సీజర్‌లాగానే స్వేచ్ఛా జీవులుగా పుట్టామే! సీజర్ తింటున్న ఆహారమే తింటున్నామే! మనం అతని కంటె ఎందులోను తీసిపోం. ఆ మాటకొస్తే. ఒకసారి సీజర్ మునిగి పోతూంటే నేను అతణ్ణి రక్షించి ఒడ్డుకి చేర్చాను. లేకపోతే అతను ఆరోజే మరణించి వుండేవాడు," అంటూ సీజర్ ఎంత సామాన్యుడో, ఎంత పిరికివాడో బ్రూటస్ ముందు ప్రస్తావించాడు. చివరగా, సీజర్ రాజయి, కిరీటం ధరించే, రోమన్ స్వాతంత్ర్యాన్ని దోచుకోకుండా ఆపుచేయడం ప్రతి రోమన్ యొక్క విధి అన్నాడు. సీజర్ తిరిగి వెళ్ళిపోయిన తరువాత ఆటస్థలం దగ్గరనుంచి తిరిగివస్తున్న కాస్కాని అడి

గాడు,అక్కడ ఏమిటి జరిగిందని,ఎందుకంతగా ప్రజలు మిన్నుముట్టేలా అరిచారని, సీజర్ ఎందుకంత కోపంగా వున్నాడని. "మార్క్ ఆంటోని సీజర్‌కి కిరీటం పెట్టడానికి ముందుకు వచ్చాడు. సీజర్ వద్దని అతణ్ణి వారించాడు. మూడుసార్లు ఆంటోని కిరీటాన్ని అందించపోయాడు. మూడు సార్లు నిరాకరించాడు. కాని, మొదటి సారి కంటె, రెండవసారి తక్కువ అయిష్టంగాను, అంతకంటె ఎక్కువ అయిష్టంగా మూడోసారి సీజర్ కిరీటాన్ని నిరాకరించాడు. అది చూసి ప్రజలు పెద్దపెట్టున హర్షధ్వానాలు చేసారు. మరొకసారి కిరీటం యిస్తే సీజర్ తప్పకుండా తీసుకునేవాడు. అలా చేయనందుకు అతనికి కోపం కూడా వచ్చింది" అని కాస్కా వివ రంగా అక్కడ జరిగింది చెప్పాడు.

ఇదంతా విన్న బ్రూటస్ మనస్సు కలవరపడింది. "ఇప్పుడేం చేయాలి? సీజర్ గర్వం ఎలా అణచాలి? నియంతగా తయారవడానికి సిద్ధంగా వున్న సీజర్ బారినుంచి రోముని రక్షించడం ఎలా?" అను కుంటూ రాత్రంతా నిద్రలేకుండా గడిపాడు. "సీజర్ మరణించి తీరవల సిందే. లేకపోతే అతని చేతికి సర్వాధికారాలు సంక్రమిస్తే అతను ఎంత దుష్టత్వానికి దిగుతాడో చెప్పలేం," అనుకున్నాడు.

ఇంకా తెల్లవారకముందే కాషియస్, కాస్కా, డీషియస్ రహ స్యంగా బ్రూటస్ దగ్గరికి వచ్చారు. మంతనాలు జరిపారు. పధకం పూర్తి యింది. మర్నాడు సెనేట్ భవనంలో సీజర్ ప్రసంగించే ముందు అతణ్ణి చంపాలని నిర్ణయించారు. సీజర్‌ని మాత్రమేనా, మార్క్ ఆంటో నిని కూడా చంపాలా అన్న ప్రశ్న వచ్చింది. కాషియస్ మాత్రం సీజర్‌ని చంపాక అతడి ప్రాణమిత్రుడు ఆంటోనిని వదలడం మంచిది కాదన్నాడు. "అతను తెలివయినవాడు, అటువంటి శత్రువు బ్రతికి వుండడం మనకి క్షేమం కాదు" అన్నాడు కాషియస్. బ్రూటస్ దానికి

సమ్మతించలేదు. "మనం పూనుకున్న కార్యక్రమం సీజర్‌లో ప్రబల మవుతున్న నిరంకుశత్వాన్ని హతమార్చడం. ఆ పని సీజర్‌ని చంప కుండా సాధించగలిగితే ఎంతో బాగుండును. అలా వీలుకాదు కనుకనే సీజర్‌ని చంపడానికి సిద్ధపడుతున్నాను. సీజర్ పోయాక అతని శరీరం లోని అంగాలు ఎంతో, ఆంటోని కూడా అంతే. మనం దేశం కోసం ప్రాణాలయినా అర్పించడానికి సిద్ధపడే వారమే కాని, స్వార్థం కోసం హత్యలుచేసే కసాయివాళ్ళం మాత్రం కాదు," అన్నాడు బ్రూటస్. మిగతావాళ్ళందరూ బ్రూటస్ మాటకి ఎదురు చెప్పలేక ఆంటోనీని ఏమి చేయకుండా వదలివేయాలని, యిష్టం లేకపోయినా ఒప్పుకున్నారు. అది మార్చి 14వ తేదీ. చాలా భయంకరంగా వుంది.

అదే రాత్రి జూలియస్ సీజర్ యింట్లో కూడా అతని భార్య కాల్పూర్నియాకి నిద్రలేదు. భయంకరమయిన కలొచ్చి నిద్రలేచింది. మర్నాడు తన భర్తకి ఏదో ప్రమాదం జరుగబోతోందని కలొచ్చింది. భయంతో వణికిపోతూ భర్తని సెనేట్‌కి వెళ్ళవద్దని ప్రార్థించింది. "నాకు కలలో నీ శిలా విగ్రహం నుంచి రక్తం చిందుతున్నట్లు, రోమన్లు నవ్వుతూ వచ్చి నీ రక్తంలో చేతులు కడుక్కుంటున్నట్లు కనపడింది. అదీగాక రాత్రంతా కనీవినీ ఎరుగని సంఘటనలెన్నో బయట జరిగాయి, నాకు మూఢ నమ్మకాలంటె గిట్టదు. కాని, నా కెందుకో యివన్నీ దుశ్శకు నాలుగా అనిపిస్తున్నాయి అని బ్రతిమాలింది.

సీజర్ అదంతా తన భ్రమ అని తోసిపారేసాడు. "ఈ శకునాలు నాకొక్కడికి మాత్రమే అని ఎందుకు అనుకోవాలి?ఇది జన సామాన్యా న్నందర్ని వుద్దేశించి చేసిన హెచ్చరికలు ఎందుకు కాకూడదు?" అని అడిగాడు. "బిచ్చగాళ్ళు పోతే తోకచుక్కలు కనపడవు. కాని ఆకాశా

న్నుంచి రాజుల మరణాలనే మనకి ముందుగా అనేక సూచనల ద్వారా అతీత శక్తులు తెలియపరుస్తాయి" అని సమాధానం చెప్పింది కాల్పూర్నియా.

చివరికి సీజర్ ఆరోజు సెనేట్‌కి వెళ్ళకుండా యింట్లో వుండడానికి ఒప్పుకున్నాడు. అంతలోనే కుట్రదారులు పంపించిన డీషియస్ సీజర్‌ని సెనేట్‌కి తీసుకు వెళ్ళడానికి వచ్చాడు. సీజర్ తను ఆరోజు రావడంలేదని చెప్పాడు. దానికి కారణం కాల్పూర్నియాకి వచ్చిన కల అని తెలుసుకుని డీషియస్ అదంతా తప్పుగా అర్ధంచేసుకున్నారన్నాడు. నిజానికి దాని అర్ధం సీజర్ నుంచి రోము రక్తం తీసుకుని, క్రొత్త జీవితం ప్రారంభించ బోతోందని, అంటే సీజర్ పరిపాలనలో రోము యింతకు ముందెన్నడూ లేని అత్యున్నత స్థానాన్ని పొందబోతోందని చెప్పాడు. సీజర్‌కి అతను యిచ్చిన వివరణ నచ్చింది. "నా భార్యకి చెడ్డకలొచ్చింది. అందుకు ఈ రోజు నేను సెనేట్‌కు రావడం లేదని కబురుచేస్తే ఈరోజు వారివ్వదలుచుకున్న కిరీటాన్ని నీ భార్యకు మంచి కల వచ్చేదాకా వాయిదా వేయవచ్చుకదా" అని కూడా హేళన చేస్తూనే సీజర్‌ని హెచ్చరించాడు, వెంటనే, మనస్సు మార్చుకుని సెనేట్‌కి డీషియస్‌తో పాటు బయల్దేరాడు.

దారిలో అంతకుముందు సీజర్‌ని "మార్చి 15 జాగ్రత్త" అని హెచ్చరించిన వ్యక్తి సీజర్‌కి ఎదురయ్యాడు. అతణ్ణి చూసి, "మార్చి 15 వచ్చింది కదా" అని అతణ్ణి హేళన చేశాడు. దానికి సమాధానంగా "అవును సీజర్, కాని యింకా వెళ్ళిపోలేదే" అన్నాడు. సీజర్ ముందుకి సాగిపోయాడు, ఆతడి మాటల్ని అంతగా పట్టించుకోకుండా.

సెనేట్‌కి చేరుకున్నాడు. అతనికి తెలియకుండా అతనికి సెనేట్‌లో చాలామంది శత్రువులున్నారు. [illegible]

సీజర్ దగ్గరగా వచ్చారు. ముందు వేసుకున్న పథకం ప్రకారం "సింబర్" సీజర్ ముందు వంగి దేశాన్నించి బహిష్కరింపబడిన తన అన్నని తిరిగి దేశానికి రానియ్యవలసిందిగా ప్రార్థించాడు. సీజర్ వీల్లే దన్నాడు. తరువాత బ్రూటస్ అతడిని క్షమించమని అడిగాడు. బ్రూటస్ ఇటువంటి విషయంలో తన నిర్ణయాన్ని మార్చుకోవలసిం దని అడుగుతున్నందుకు సీజర్ దిగ్భ్రాంతి చెందాడు. ఆ తరువాత కాషియస్ వచ్చి అదే విధంగా ప్రార్థించాడు. సింబర్ సోదరుణ్ణి క్షమిం చనని, తన నిర్ణయం తిరుగులేనిదని, ఎవరు తనకి ఎంత చెప్పినా లాభంలేదని ఖచ్చితంగా చెప్పాడు. మిగతా అందరూ కూడా దగ్గరగా వచ్చి సీజర్ ముందు మోకరిల్లి ప్రార్థించారు. అందరికి అదే సమాధా నం చెబుతూ, బ్రూటస్‌కి కాదన్నది, యింకెవరికి సాధ్యపడదనిచెప్పాడు. వెనకగా వచ్చి కాస్కా కత్తితో సీజర్‌ని పొడిచాడు. వెంట వెంటనే కాషియస్, డీషియస్ కూడా పొడిచారు. వాటినుంచి తప్పించుకోడానికి ప్రయత్నిస్తూ బ్రూటస్ పై పుకితిరిగాడు. తనని కాపాడకపోగా బ్రూటస్ కూడా సీజర్‌ని కత్తితో పొడిచాడు. ఇది సీజర్ కలలో కూడా వూహిం చని విషయం "నువ్వు కూడా నా బ్రూటస్!" అంటూ నేల కొరిగాడు. "స్వేచ్ఛ, స్వాతంత్ర్యం. సీజర్ మరణించాడు." అంటూ సిన్నా అరి చాడు. కుట్రదారులందరూ సీజర్ దగ్గరికి వచ్చి సీజర్ నెత్తుటిలో చేతులు తడుపుకున్నారు. ఇదంతా చూస్తున్న ప్రజలందరూ భయభ్రాంతులయి, చెల్లా చెదురయి, పరిగెత్తి పోవడానికి ప్రయత్నించారు. ఆసమయంలో బ్రూటస్ ముందుకువచ్చి వాళ్ళని భయపడవద్దని, మిగతా వాళ్ళందరికి ఎటువంటి ప్రమాదం లేదని వారికి అభయమిచ్చాడు. వారందరూ బ్రూటస్ మాటలు వినడానికి ఆగారు. ఈ వార్తవిని మార్క్ ఆంటోని కూడా అక్కడికి చేరుకున్నాడు. బ్రూటస్‌తో, తనని కూడా చంపడం

వాళ్ళ ధ్యేయమయితే, సీజర్‌తోపాటే చనిపోవడంకంటె మంచి అవ
కాశం తనకి దొరకదని, తను సిద్ధంగానే వున్నానని చెప్పాడు. బ్రూటస్
సీజర్‌కి రాజుకావాలనే వ్యామోహం మితిమీరినదని, అందువల్లరోముని
అతని నిరంకుశ పాలననుంచి కాపాడ్డానికి మాత్రమే చంపామని, ఆంటో
నీని కాని మరింకెవరినీ కూడా చంపే ఆలోచన తమకెవ్వరికి లేదని
చెప్పాడు. తను ప్రజలను ఉద్దేశించి మాట్లాడి వారిని శాంత పరచిన
తరువాత, సీజర్ ప్రాణమిత్రుడిగా తను మాట్లాడ వచ్చునని ఆంటో
నికి చెప్పి, సీజర్ శవంతోపాటు అందరూ మార్కెట్ ప్లేస్‌కి చేరు
కున్నారు.

ముందు బ్రూటస్ మాట్లాడుతూ, "సీజర్‌లో పెరిగిన అత్యాశను
చూసి, నేను సీజర్‌ని చంపాను. అతను రాజుకావాలనుకున్నాడు.
రోముని ప్రజాస్వామ్యాన్ని కాపాడ్డానికి నేను ఈ పని చెయ్యక తప్ప
లేదు. దేశంకోసం, నా ప్రాణ మిత్రుడిని కూడా త్యాగం చెయ్యక తప్ప
లేదు. సీజరు బ్రతికుండి మీరందరూ అతని దగ్గర బానిసలుగా బ్రతక
డమో, మీరందరూ స్వేచ్ఛా జీవులుగా బ్రతకడానికి సీజర్ మరణిం
చడమో, మీరే నిర్ణయించుకోండి, అని ఎంతో ఆవేశంగా మాట్లా
డాడు. ప్రజలు అందరూ అతడి మాటలు నమ్మి హర్షధ్వానాలతో
బ్రూటస్ చేసిన పనికి వారి సమ్మతికి తెలియపరిచారు. ప్రజలందరూ
తన తోటే వున్నారని నిర్ధారణ అయిన తరువాత, వాళ్ళని అక్కడే
వుండి ఆంటోని మాటలుకూడా వినమని చెప్పి బ్రూటస్ సెలవు తీసు
కుని వెళ్ళిపోయాడు.

ఆంటోని ప్రజలముందు నిలబడేసరికి, వాళ్ళందరూ బ్రూటస్
చేసిన పని మంచిదనే నమ్మకంతో వున్నారు. తన వాగ్ధాటినంతా ఉప
యోగించి, కుట్రదారులెవ్వరినీ ఏమీ అనకుండా, చాలా చాకచక్యంగా

మెల్ల మెల్లగా ప్రజలందరిని తన వైపుకి త్రిప్పుకున్నాడు. బ్రూటస్ చెప్పేదంతా పచ్చి అబద్ధమని, ప్రజలంటె సీజర్‌కి ఎంతో ప్రేమని, వారికోసం తన ఆస్తినంతా రాసివుంచాడని, సీజర్ మరణంతో రోమన్లు ఒక నిస్వార్థుడు అయిన నాయకుణ్ణి పోగొట్టుకున్నారని చెప్పి వాళ్ళని పూర్తిగా తన అదుపులోనికి తీసుకున్నాడు. ఆంటోని వాళ్ళని ఏం చెయ్యమంటె అది చెయ్యడానికి వాళ్ళు సిద్ధంగా వున్నారని తెలుసు కున్నాడు. సీజర్ శరీరం మీదవున్న గాయాల్ని వాళ్ళకి చూపించి వాళ్ళు కంట తడిపెట్టేలా చేసాడు. అందరూ ఏక కంఠంతో "ప్రతీకారం"అని అరుస్తూ, కుట్రదారులని పట్టుకోవడానికి బయలుదేరారు. జరిగినదంతా తెలుసుకుని బ్రూటస్, అతని స్నేహితులంతా వెంటనే పట్టణం విడిచి పారిపోయారు. సీజర్‌కి విధేయుడయిన సేనాధిపతి ఆక్టేవియస్ సీజర్ తన సేనలను తీసుకుని రోము చేరుకున్నాడు. ఆంటోనివెళ్ళిఆక్టేవియస్‌ని కలుసుకుని యుద్ధానికి ప్రయత్నాలు మొదలు పెట్టాడు.

బ్రూటస్, కాషియస్ ఇటలీ విడిచిపెట్టి గ్రీకు చేరుకున్నారు. సంవత్సరం కాలం గడిచింది. ఆంటోని, ఆక్టేవియస్ సీజర్, ఎపిడస్ యిప్పుడు రోముకి అధిపతులు అయ్యారు. సీజర్‌కి వ్యతిరేకంగా ఉన్న సెనేటర్లని, యితరులని కూడా నిర్ధాక్షిణ్యంగా చంపివేశారు. పరిస్థితి పూర్తిగా అదుపులోకి వచ్చాక సైన్యాలని తీసుకుని, ఆక్టేవియస్, ఆంటోని బయలుదేరి శత్రు సైన్యాలని ఎదుర్కోవడానికి వెళ్లారు, "ఫార్డిన్" అనే పట్టణం దగ్గర బ్రూటస్, కాయస్ వారి సేనలు "ఫిలిప్పి" నగరం దగ్గర ఆంటోని, ఆక్టేవియస్ వారి సేనలు, యుద్ధానికి సన్నద్ధులయి సమయంకోసం ఎదురు చూస్తున్నారు.

బ్రూటస్ కాంపులో పరిస్థితి చాలా అధ్వాన్నంగా తయారయింది. సీజర్ పైకి ఎదురుతిరిగిన వారందరిలోకి తను ఒక్కడే నిజంగా దేశ

శ్రేయస్సు దృష్ట్యా సీజర్ హత్యకి పూనుకున్నది మిగతా వారందరూ స్వార్థంతో, పదవుల కోసం, ధనార్జన కోసం, ముందుకు వచ్చిన వారని అర్థమయింది. కాషియస్ వారిలో అగ్రగణ్యుడని తెలుసుకున్నాడు. అవినీతిపరుడని, లంచగొండని కూడా బ్రూటస్‌కి తెలిసింది.

ఈ విషయాలన్నీ అతని మనస్సుని ఎంతగానో బాధపెడుతుంటే, సార్డిస్‌లో ఉండగా ఒకనాటి రాత్రి తన భార్య పోర్షియా మరణించిందన్న వార్త వచ్చింది. ఈ సమయంలో కాషియస్ వచ్చి బ్రూటస్‌తో తగాదాకి దిగాడు. కొంతసేపు అలా ఒకరి నొకరు నిందించుకున్న తరువాత పోర్షియా పోయిందన్న వార్త విని, అటువంటి దుఃఖ సమయంలో బ్రూటస్‌ని నిందించినందుకు కాషియస్ బాధపడ్డాడు. ఇద్దరూ కలసి యుద్ధ ప్రయత్నాలు చర్చించారు.

అక్కడ కూడా మళ్ళీ ఇద్దరికి ఏకాభిప్రాయం కుదరలేదు. బ్రూటస్ సేనలతో ఫిలిప్పికి వెళ్ళి ఏంటోనీ సేనలను ఎదుర్కోవాలన్నాడు. దానికి కాషియస్ ఒప్పుకోలేదు. మనం ఉన్నచోటుకే శత్రువులు వచ్చినట్లయితే మనదే పైచేయిగా ఉంటుందని కాషియస్ అన్నాడు. దానికి బ్రూటస్ సమాధానంగా అలా శత్రువుని మన దగ్గరికి వచ్చేదాకా చూస్తూ కూర్చుంటె, మధ్యలో ఉన్న ప్రజలందరూ, ఏంటోనీతో చేరి, అతనికి సహాయపడతారు, అన్నాడు. అదీగాక వాళ్ళకి పరిస్థితులు అప్పుడు అనుకూలంగా ఉన్నాయని, ఆ అవకాశం వదులుకోవడం తెలివి తక్కువ తనమని కూడా బ్రూటస్ వాదించాడు. వేరే గత్యంతరం లేక కాషియస్, బ్రూటస్ చెప్పినట్లుగానే ఫిలిప్పికి సేనలతో దండెత్తి వెళ్ళడానికి ఒప్పుకున్నాడు.

ఈ వార్త ఆంటోనీకి సంతోషం కలిగించింది సార్డిస్ నించి ఫిలిప్పి వరకు ప్రయాణంచేసి వచ్చిన సైనికులు బాగా అలిసిపోయారు. కాని ఆంటోని సైనికులు మాత్రం ఉన్నచోటనుంచి కదలకుండా, విశ్రాంతి తీసుకుని యుద్ధం చేయడానికి సంసిద్ధులుగా ఉన్నారు.

రోజంతా తీవ్రంగా రెండు సేనల మధ్య పోరాటం సాగింది. మధ్యాహ్నానికల్లా ఆంటోనీ సేనలదే పైచేయిగా ఉందని తెలిసిపోయింది. శత్రుసేనలు కాషియస్ మీదకి దూసుకు వస్తున్నారని ఒక దూత కబురు తెచ్చాడు. బ్రూటస్ సేనలని చూసి పొరపాటున ఆంటోనీ సేనలనుకుని, యుద్ధంలో ఓడిపోయినట్లేనని నిర్ణయించుకున్నాడు. తన సేవకుడిని పిలిచి ఆఖరుసారిగా తనకొక పనిచేసి పెట్టమని అడిగాడు. తను సీజర్‌ని చంపిన కత్తి వాడికిచ్చి, దానితో తనకి విముక్తి కలిగించమని కోరాడు. వాడు ఆజ్ఞ శిరసావహించి, కత్తితో కాషియస్‌ని పొడిచి చంపాడు

కొంతసేపటికి అక్కడికి బ్రూటస్ చేరుకున్నాడు. చచ్చిపడివున్న కాషియస్‌ని చూసాడు.

"సీజర్, నువ్వింకా బ్రతికే వున్నావ్! నీ శక్తి అనన్య సామాన్యం. మా కత్తులతో మమ్మల్నే చంపగలుగుతున్నావు?" అన్నాడు. అంతా అయిపోయిందని, ఇంక చేయగలిగింది ఏమీలేదని గ్రహించి, ఆఖరి ప్రయత్నంగా శత్రుసేనలమీదకి వెళ్ళాడు. వాళ్ళ చేతిలో చిత్తుగా ఓడిపోవడానికి ఎంతోసేపు పట్టలేదు. చాలామంది ఖైదీలుగా పట్టుబడ్డారు. కాని, బ్రూటస్ మాత్రం తప్పించుకొని బయటపడ్డాడు. బ్రూటస్‌ని పట్టుకొని అక్టేవియస్ గుడారానికి తీసుకురమ్మని ఆంటోని సైనికుల్ని పంపాడు ఈలోపున బ్రూటస్ నిరాశతో, తను రోమ్లో మంచి కోసం చేసిన పనంతా పూర్తిగా విఫలమయిందని, జీవితంమీద విరక్తి కలిగి,

కాషియస్ మాదిరిగానే సేవకుడి సహాయంతో తన ప్రాణాలు తీసుకున్నాడు.

ఆంటోని, బ్రూటస్ శవం ప్రక్కన నిలబడి ఒక మహానుభావుడి జీవితం అలా వృధా అయిపోయినందుకు చింతించారు. "రోమన్లందరిలోనికి ఇతడు చాలా ఉత్తముడు. మిగతా అందరూ సీజర్‌పై అసూయతో చంపారు. కాని, బ్రూటస్ ఒక్కడూ మాత్రం, దేశం బాగుకోరి యీ పనికి పూనుకోక తప్పదని విశ్వసించాడు. ఇతడు మహామనిషి" అని ఆంటోని బ్రూటస్‌కి మనస్ఫూర్తిగా శ్రద్ధాంజలి ఘటించాడు.

# "గోరంతలు కొండంతలు"

## Much Ado About Nothing

లీయోనాటో మెసీనాకి గవర్నర్. హీరో ఆయన కూతురు. బియాట్రిస్ ఆయన మేనకోడలు. ఇద్దరూ ఒకరి కొకరు ప్రాణం. హీరో చాలా సౌమ్యురాలు, మితభాషి, చాలా వినయమైన స్వభావం కలది. బియాట్రిస్ ఈమెకి పూర్తిగా విరుద్ధమయినది. చాలా సరదాగా, హుషారుగా వుండే స్వభావం ఆమెది. హీరోని వేళాకోళం చెయ్యడం, ఆట పట్టించటం అంటే ఆమెకి మహాసరదా.

అప్పుడే ముగిసిన ఒక యుద్ధంలో ఎంతో ధైర్యసాహసాలు ప్రదర్శించి, మెసీనా మీదుగా ఇంటికి తిరిగి వెళుతున్న కొందరు యువకులు గవర్నర్ లీయోనాటోని చూడ్డానికి వచ్చారు. వారిలో ఆరగన్ యువరాజు డాన్‌పీడ్రో, అతని స్నేహితుడు ఫ్లారెన్స్‌కు చెందిన క్లాడియో, పాడ్యువాకి చెందిన బెనిడిక్ వున్నారు. లీయోనాటో వీరందరినీ తన కూతురికి, మేన

కోడలికి పరిచయం చేశాడు. ఆ వచ్చిన యువకులు వీరికి కొత్తవారు కాదు. ఇంతకుముందు మెసీనా వచ్చినపుడు పరిచయమయ్యారు.

అప్పుడు బియాట్రిశ్ అవకాశము దొరికినపుడల్లా బెనిడిక్‌తో వ్యంగ్యంగా మాట్లాడుతూ, వేళాకోళం చేస్తూ ఉండేది. బెనిడిక్ కూడా ఆమెకేమీ తీసిపోయేవాడు కాదు. ఒకరిమీద ఒకరు విమర్శనాస్త్రాలు వేసుకోకుండా యిద్దరూ కలిసినపుడల్లా ఒక్క క్షణం కూడా వూరుకునేవారు కాదు. వీరిద్దరూ ఇలా వుంటే హీరో మాత్రం ఒక్కమాటైనా మాట్లాడకుండా చూస్తూ ఊరుకున్నేది.

యుద్ధాన్నించి తిరిగి వస్తూ ఈసారి కలిసినప్పుడు మళ్ళీ ఇద్దరి మధ్యా పాత ధోరణిలోనే మాటలతో యుద్ధం ప్రారంభమైంది.

బెనిడిక్‌ని ఆమె, "నువ్వేదో మాట్లాడుతూనే ఉన్నావు కానీ విన్నెవరూ పట్టించుకున్నట్లు లేదే" అంటూ కవ్వించింది.

అది వినిపించుకోకుండా, కాస్సేపయింతర్వాత అంతవరకు ఆమెని చూడలేదన్నట్లుగా నటిస్తూ, "ఓహో, గర్విష్ఠి అమ్మగారు ఇంకా బాగానే వున్నారన్నమాట" అన్నాడు.

ఆమె అతడిన్ని యువరాజుగారి విదూషకుడని పిలిచింది. యువరాజు ఇతని మాటలు జాగ్రత్తగా వినడం చూసి అతణ్ణి పిరికివాడన్నట్లుగా మాట్లాడినా అంత పట్టించుకోలేదు కానీ, యిప్పుడు హాస్యగాడనడంతో కోపంవచ్చి ఆమెమీద అతను ఏర్పరచుకున్న అయిష్టత పెరిగి ద్వేషంగా తయారయింది.

క్లాడియో వీళ్ళిద్దరి మధ్యా తమాషాగా వున్న వాగ్యుద్ధం వింటూనే ఒక కంట హీరోని జాగ్రత్తగా కనిపెడుతున్నాడు. తను అంతకుముందు చూసిన హీరోకి యిప్పటి హీరోకి చాలా తేడావచ్చింది. ఇప్పుడు

చాలా అందంగా తయారయింది. బెనిడిక్, బియాట్రిస్‌ల మధ్య జరిగిన సూటీ పోటీ మాటలువిని యువరాజు డాన్‌పీడ్రో, లియొనాటోతో మెల్లగా వాళ్ళిద్దరికీ పెళ్ళయితే బాగుంటుందని అన్నాడు. అదే జరిగితే తన మేన కోడలు బియాట్రిస్ బెనిడిక్‌కి వారంరోజులలో పిచ్చెత్తేటట్లు చేసేస్తుందన్నాడు. పీడ్రో మాత్రము వాళ్ళిద్దరినీ కలపాలన్న ఉద్దేశ్యాన్ని అంత తేలికగా మానుకోలేదు.

యువరాజు క్లాడియోతో బయటికి వచ్చేసరికి తను కలప దలుచుకున్న జంట కాకుండా మరొక జంట వ్యవహారం కూడా తెలిసింది. క్లాడియో తను హీరోని ప్రేమిస్తున్నానని యీ ప్రేమకి అంకురార్పణ అంతకు ముందు చూసినప్పుడే జరిగిందని, కానీ యుద్ధానికి వెళ్ళిపోవడం వల్ల ఆ ప్రస్తావన తీసుకురాలేదని, తనప్రేమ వ్యవహారమంతా పీడ్రోకి చెప్పాడు.



ఇక ఆలస్యమెందుకని వెంటనే లియోనాటోతో విషయమంతా చెప్పాడు. దానికి లియోనాటో సంతోషించి, హీరోతో మాట్లాడి ఆమెని కూడా వొప్పించాడు.

పీడ్రో, లియోనాటోని త్వరలోనే వివాహ ముహూర్తము కూడా నిర్ణయించమని కోరాడు. లియోనాటో అందుకు సమ్మతించాడు.

అంతా నిశ్చయమైనది కానీ, కొద్ది రోజుల వ్యవధి తప్పనిసరైంది. క్లాడియోకి క్షణం యుగంలా వుంది. ఆ రోజువరకు ఊరికే ఉండడం అతనికి చాలా విసుగ్గా వుంది. ఇంతలో డాన్‌పీడ్రోకి ఒక ఆలోచన వచ్చింది. బియాట్రిస్, బెనిడిక్‌ల నిద్దరినీ ఒకరినొకరు ప్రేమించుకునేటట్లుగా చేస్తే ఎలాగుంటుందా అని తీవ్రంగా ఆలోచించాడు. ఏదో మోసం చేసయినాసరే యిద్దరినీ కలపాలని ఒక నిర్ణయానికి

వచ్చాడు. క్లాడియో అలా జరగడానికి కావలసిన సహాయం ఇవ్వడానికి ముందుకు వచ్చాడు. లియోనాటో, హీరో కూడా ఈ నాటకంలో భాగం పంచుకోవడానికి సిద్ధమయ్యారు. లియోనాటోకి ఎలాగోలా తన మేన కోడలు దారిలో పడి అందరి మాదిరిగా వివాహమాడితే చూడాలని అతని కోరిక. హీరోకి కూడా అంతకంటె కావలసినదేముంది? తన ప్రాణానికి ప్రాణమయిన బియాట్రిస్ విషయంలో క్లాడియో, డాన్‌పీడ్రోవేసిన పథకం ప్రకారం వాళ్ళందరూ చేయవలసినదేమంటే, బెనిడిక్‌ని బియా ట్రిస్ గాఢంగా ప్రేమిస్తోందని నమ్మేట్లుగా చేయడం, అలాగే బియా ట్రిస్‌ని బెనిడిక్ తనంటే ప్రాణమివ్వడానికి కూడా సిద్ధంగా వున్నాడని నమ్మించడం. ఈ నాటకంలో మొదటి అంకం డాన్‌పీడ్రో, లియోనాటో, క్లాడియోలు కలిసి ప్రారంభించారు. అవకాశం కోసం కాసుకుని ఉండగా బెనిడిక్ తోటలో పొదల వెనుక కూర్చుని పుస్తకం చదువుకుంటూ కన బడ్డాడు. అతనికి దగ్గరలో అతనికి కనబడకుండా చేరి, వాళ్ళల్లో వాళ్ళు మాట్లాడుకోవడం మొదలు పెట్టారు. క్లాడియో, లియోనాటోతో, బియా ట్రిస్, బెనిడిక్‌ని ప్రేమిస్తోందని చెప్పావుగా, అసలు బియాట్రిస్ ఎవరి నైనా ప్రేమిస్తుందంటే నమ్మడానికి వీలుందా, అని అడిగాడు. నేను కూడా నమ్మలేకుండా వున్నాను. కానీ తన కూతురు ఈ విషయంలో రూఢిగా చెప్పిందనీ, అతనంటే ఎంత ప్రేమిస్తున్నదంటే బెనిడిక్ కనుక నిరాకరిస్తే ఆమె తన ప్రాణాలు కూడా తీసుకుంటుందేమోనన్న భయంగా వుందనీ, లియోనాటో చెప్పాడు. బెనిడిక్‌కి స్త్రీ జాతంటేనే చాలాకోపం, అందులోనూ బియాట్రిస్ అంటే మరీ ఎక్కువ. అందువల్ల వీళ్ళిద్దరూ భార్యాభర్తలవడం కల్లో వార్తని క్లాడియో, లియోనాటోలిద్దరూ గట్టిగా నమ్ముతున్నట్లు మాట్లాడుకున్నారు. డాన్‌పీడ్రో ఇదంతా చాలా సానుభూతితో ఆలోచించి యీ విషయం బెనిడిక్‌కి చెపితే బాగుంటుందే

మోసని సూచించాడు. దానివల్ల ప్రయోజనమేమీ లేకపోగా అతను బియాట్రిస్‌ని ఇంకా ఆటపట్టించి వేధిస్తాడేమోనన్న అనుమానం క్లాడియో వ్యక్తం చేశాడు. అలాగే కనుక బెనెడిక్ చేస్తే అతడిని వురి తీసినా పాపంలేదని, బియాట్రిస్ చాలా మంచిదని, డాన్‌పెడ్రో అన్నాడు. మెల్లిగా అందరూ అక్కడినించి జారుకున్నారు.

ఇదంతా బెనిడిక్ విన్నాడు. నిజంగా బియాట్రిస్ తనని ప్రేమిస్తోందన్న మాట అని ఆశ్చర్యపోయాడు. ఇందులో మోసమేదీ వుండడానికి వీల్లేదని, వాళ్ళకి హీరో దగ్గర నుంచి యీ సంగతి తెలిసిందంటె నిజమే అయి వుండాలని నమ్మాడు. ఆమె తనని అంతగా ప్రేమిస్తోంటే, తను కూడా ఆమెని ప్రేమించి తీరవలసిందేననుకున్నాడు. తను బ్రహ్మచారిగ్గానే చనిపోదల్చుకున్నట్లు చెప్పినప్పుడు, తను పెళ్ళయ్యేదాక బ్రతికుంటానని అనుకోలేదంటూ తన పట్టింపు నిరర్థకం చేస్తున్నందుకు తనని తాను సమాధాన పరచుకున్నాడు. వాళ్ళ మాటల్నిబట్టి చూస్తే ఆమె తనకి అన్ని విధాల తగిన వ్యక్తేనని నిర్ణయించుకున్నాడు.

ఇంతలోనే బియాట్రిస్ అక్కడికి వచ్చి, తనకి యిష్టంలేకపోయినా బెనిడిక్‌ని భోజనానికి వేళయింది, రమ్మని పిలవడానికి రావలసి వచ్చిందని, చెప్పింది. బెనిడిక్ ఆమెతో అంతకు ముందెన్నడూ లేనంత సౌమ్యంగా మాట్లాడాడు బియాట్రిస్ మాత్రం మామూలు ధోరణిలోనే అతని కెంతో బాధ కలిగించే విధంగా మాట్లాడి అక్కడినుంచి వెళ్ళిపోయింది. ఇప్పుడు బెనిడిక్‌కి ఆమె ప్రవర్తనలోను, మాట్లాడిన ప్రతి మాటలోను ఏదో కొత్త అర్థం కనబడింది, ఆమెను తను ఇప్పటికీ

ప్రేమించకుండా వేధించినట్లయితే తనొక హృదయంలేని క్రూరుడి క్రింద లెక్కవేసుకున్నాడు.

ఈ విధంగా బెనిడిక్ వలలో చిక్కిన తరువాత, నాటక సూత్రధారులు యిప్పుడు బియాట్రిస్ పని పట్టారు. ఈపనికి హీరోని వినియోగించారు. ఆమె ఒక చెలికత్తె మార్గరెట్‌ని బియాట్రిస్ దగ్గరికి పంపి, తోటలో హీరో, మరొక చెలికత్తె వుర్సులాతో, తన విషయమే మాట్లాడుతోందని చెప్పి అక్కడికి వచ్చేటట్లు చెయ్యమని చెప్పింది. బియాట్రిస్ వచ్చేసరికి వాళ్ళు ఆమెను గురించే మాట్లాడుకుంటుంటె, పొదల వెనుక దాక్కుని వాళ్ళమాటలు వింది. బెనిడిక్, బియాట్రిస్‌ని, ప్రేమిస్తున్నాడని, ఆ విషయం తనకి డాన్ పేడ్రో, క్లాడియో చెప్పి, బియాట్రిస్‌తో అతని ప్రేమ గురించి చెప్పమన్నారని, వాళ్ళకి బెనిడిక్ మీద ఏమాత్రమయినా అభిమానముంటె అలా చేయడం మంచిది కాదని, బెనిడిక్ చాలా వుత్తముడని, అటువంటివాడిని బియాట్రిస్ లాంటి గర్విష్టిమనిషితో కట్టబెట్టి పాపం మూటగట్టుకోదలుచుకోలేదని వారి మాటల సారాంశం. ఈ మాటలన్నీ విన్న బియాట్రిస్ తన చెవుల్ని తనే నమ్మలేకపోయింది. తను అంతగా ప్రేమిస్తున్న బెనిడిక్‌ని నిరాకరించడం ఎంత తెలివి తక్కువో అనుకుంది. ఏమైనాసరే తను బుద్ధిగా వుండి, బెనిడిక్‌కి తనమీద మంచి అభిప్రాయము ఏర్పడేలా ప్రవర్తించాలని నిర్ణయించుకుంది. ఈ విధంగా డాన్ పేడ్రో, మిగతావారితో కలసి ఆడిన నాటకం అనుకున్న విధంగా బెనిడిక్ బియాట్రిస్ లిద్దర్ని ఒకరికంటె మరొకరు పిచ్చిగా ప్రేమిస్తున్నట్లుగా నమ్మేట్లు చేసింది.

ఇదిలా వుండగా, హీరో. క్లాడియోలకి మర్నాడే వివాహం జరుగ తలపె వుండగా ఒక దుష్టుడి మూలంగా వ్యవహారం చిక్కుల్లో

పడింది. యువరాజు డాన్‌పేడ్రోకి డాన్‌జాన్ అనే సవతి తమ్ముడు న్నాడు. దుష్టత్వం అతనికి సహజగుణం. అతనికి అన్నగారన్నా క్లాడియో అన్నా యీర్ష్య మిగతా వారితోపాటే మెసీనాకి వచ్చినప్పటి నుంచి యిక్కడ జరుగుతున్న వ్యవహారమంతా ఒక కంట కనిపెడు తున్న డాన్‌జాన్‌కి క్లాడియో, హీరోని వివాహమాడడం ఎంత మాత్రం యిష్టంలేదు ఇంకొకళ్ళు ఆనందంగా వుంటె చూడలేకపోవడం తప్ప, దీనికి వేరే కారణం ఏమీలేదు. అందుకు తన స్నేహితుడు బొరాకియో అనే మరో దుర్మార్గుణ్ని వుపయోగించాడు. ఏదో విధంగా వారి పెళ్ళి చెడగొడితే అతనికి కావలసినంత ధనం యిస్తానని ఆశపెట్టాడు. వాడు రంగంలోకి దిగి, హీరో చెలికత్తె మార్గరెట్‌ని మంచి చేసుకున్నాడు. ఆ రాత్రి, హీరోగది కిటికీలోంచి, హీరో నిద్రపోతున్నపుడు ఆమె దుస్తులు ధరించి, క్రింద నిలబడివున్న తనతో మాట్లాడేటట్లుగా మార్గ రెట్‌ని వొప్పించాడు. బొరాకియో చేత యీ ఏర్పాటు చేయించి, క్లాడియో, పేడ్రోలతో హీరోను గురించి చాలా చెడ్డగా చెప్పాడు, కావాలంటె అర్ధరాత్రిపూట ఆమె తన ప్రియుడితో కిటికీలోంచి రహ స్యంగా మాట్లాడుతూ వుండగా చూడవచ్చని వాళ్ళని నమ్మించాడు. ఆ రోజు రాత్రి అటువంటి సంఘటన ఏదైనాతను చూసినట్లయితే, హీరోనితను మర్నాడు పెళ్ళాడక బోవడమే కాకుండా అందరి ముందు ఆమెని అవమానపరచి తీరతానన్నాడు. డాన్ పేడ్రో కూడా అందుకు ఒప్పుకున్నాడు. "ఆమెని నీదాన్నిగా చెయ్యడానికి, నా సహ కారం అందించాను. యిప్పుడు, ఆమెని అవమాన పరచడానికి నీతో కలు స్తాను, అని అతనికి చెప్పాడు.

ఆరాత్రి దూరంగా నిలబడి డాన్ పేడ్రో, క్లాడియో, డాన్‌జాన్ కిటికీలోంచి హీరో ఎవరితోనో మాట్లాడుతూ వుండటం చూసారు. హీరో

దుస్తులలోవున్న మార్గరెట్ ని చూసి, హీరోయే మాట్లాడుతుందని నమ్మారు. క్లాడియోకి పట్టరాని కోపం వచ్చింది. అంతవరకు ఆమెమీద వున్న ప్రేమంతా ఒక్క-క్షణంలో ద్వేషంగా మారింది. మర్నాడు చర్చిలో ఆమెని అందరి ముందూ దూషించి ఆమె నిజరూపం బయట పెట్టాలని నిశ్చయించుకున్నాడు. డాన్ పెడ్రో కూడా సమ్మతించాడు.

వివాహానికి అందరూ చర్చిలో సమావేశమయ్యారు. పురోహితుడి ముందు వధూవరులు ఇద్దరూ నిలబడి వున్నారు. వివాహ కార్యక్రమం ప్రారంభం కావడంతోటే క్లాడియో ఆమెని అనరాని మాటలు అంటూ నిందించాడు. హీరో క్లాడియో తనని అలా అంటున్నాడంటే నమ్మలేక పోయింది? తండ్రి లియోనాటో, డాన్ పేడ్రోని యిదంతా ఏమిటి. మాట్లాడ రేమిటని అడిగాడు. "నేనేం మాట్లాడను? గడచిన రాత్రి నేను, నా తమ్ముడు క్లాడియో, కిటికీలోంచి హీరో ఎవరితోనో మాట్లాడుతూ వుండటం కళ్లారా చూసాము, అని క్లాడియోని సమర్ధించాడు. ఈ మాట లన్నీ విన్న హీరో దుఃఖ భారముతో స్పృహ తప్పి కిందపడిపోయింది. చూడడానికి నిజంగా ప్రాణాలుపోయాయా అనిపించేటట్లుగా వుంది ఆమె వాలకం. ఆమె మళ్ళీ స్పృహలోకికి వస్తుందా లేదా అనికూడా చూడ కుండా క్లాడియో కోపంగా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. క్లాడియోకి ఆమె మీద కలిగిన ద్వేషం అతన్ని అంత నిర్దయగా ప్రవర్తింప చేసింది.

బెనిడిక్, బియాట్రిస్‌లు హీరో దగ్గర వుండి ఆమెకి కావలసిన సపర్యలు చేస్తున్నారు. వాళ్ళిద్దరికి హీరో నిర్దోషి అని గట్టి నమ్మకం ఏర్పడింది. ఇందులో ఏదో కుట్ర ఉందనుకున్నారు. తండ్రి మాత్రం ఆ రోజు జరిగిన అవమానంతో హీరో మళ్ళీ స్పృహలోనికి రాకుండా చనిపోతే బాగుండు ననుకున్నాడు. పురోహితుడు ఆమె ముఖం చూసి,

చాలా అనుభవం ఉన్న వ్యక్తి కనుక హీరో ఏ పాపము ఎరుగదని నమ్మాడు. ఆ విషయమే అందరిముందు ఖచ్చితంగా చెప్పాడు "ఆమె నేరం చేసినట్లయితే, నా వయస్సుని, నా అనుభవాన్ని, నా వృత్తిని, ఏంతమాత్రం గౌరవించకండి" అని చెప్పాడు కాస్సేపటికి హీరోకి స్పృహ వచ్చింది. కోపంగా వున్న తండ్రితో, తాను ఏ పాపం చెయ్య లేదని, చేసివుంటె తనని క్రూరంగా చంపినా తనకిష్టమేనని చెప్పింది.

"ఇందులో ఏదో పొరపాటు జరిగింది," అంటూ పురోహితుడు ఒక వుపాయం చెప్పాడు. స్పృహలోంచి ఆమె మళ్ళీ తేరుకోలేదని, మరణించిందని అందరికి తెలియ చెయ్యమన్నాడు. దీనివల్ల ప్రయోజన మేమిటని లియోనాటో అడిగితే సమాధానంగా, "ప్రజల దృష్టిలో ఆమె మరణం జాలిగా మారుతుంది. అంతే కాదు నేమ ఆశించేది. ఈ వార్త విన్న క్లాడియో కూడా బాధపడి ఆమెని అన్యాయంగా చంపానని నమ్మ తాడు. ఆమెకోసం దుఃఖిస్తాడు. అతనిలో ఎంతో మార్పు వస్తుంది" అని పురోహితుడు చెప్పాడు. బెనెటిక్ కూడా అలాగే చేయడం మంచిదని సలహాయిస్తూ తనకి చాలా ఆప్తులయిన పేడ్రోకి, క్లాడియస్‌కి తమ ఈ విషయం వెల్లడిచేయనని వాగ్దానం చేసాడు. అందరూ చెప్పిన మీదట లియోనాటో ఒప్పుకోక తప్పలేదు తగిన ఏర్పాట్లు చేయడానికి హీరోని తీసుకుని అందరూ అక్కడ నుంచి వెళ్లారు. బెనెడిక్ బియాట్రిస్ ఇద్దరూ ఒంటరిగా తటస్థపడ్డారు. బెనెడిక్ ముందు మాట్లాడుతూ హీరోకి చాలా అన్యాయం జరిగిందని తను గట్టిగా నమ్ముతున్నానని చెప్పాడు. ఆమెకి న్యాయం చేకూర్చిన వారికి తను ఎంతో రుణపడి ఉంటానని బియాట్రిస్ చెప్పింది. "నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నేనిలా అంటే నీకు ఆశ్చ ర్యంగా ఉందా?" అని ఆమెని బెనెడిక్ అడిగాడు. సూటిగా దానికి సమా

ధానం చెప్పకుండా ఏదో దాటివేయడానికి ప్రయత్నిస్తే బెనెడిక్ ఆమెని నిలదీసి, "నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు, నాకు తెలుసు. నేను కూడా నిన్ను అంతకంటె ఎక్కువగా ప్రేమిస్తున్నాను. ఇప్పుడు చెప్పు నన్నేం చెయ్యమంటావో, ఏదయినా సిద్ధంగా వున్నాను" అన్నాడు. అయితే క్లాడియోని చంపెయ్యమని అడిగింది. ఆ మాటలతో "ఆ పని మాత్రం చెయ్యలేను. అతను నా ప్రాణమిత్రుడు" అని సమాధానం యిచ్చాడు. నా సోదరి హీరోని యింతగా దూషించి అవమాన పరచిన వాడిని నేనే పురుషుడినయివుంటె ఈపాటికి అతని అంతు చూసి వుండే వాడిని" అని అంది బియాట్రిస్ కోపంగా. బెనెడిక్ ఏది చెప్పబోయినా వినిపించుకోలేదు. "నా హీరో పరాయి పురుషుడితో రాత్రివేళ కిటికీ లోంచి మాట్లాడమా ? ఇంతకంటె ఘోరము ఇంకేదయినా వుంటుందా? ధైర్యం గల పురుషుడు ఎవరయినా నాకు స్నేహితుడుగా వుంటే ఎంతో బాగుండేది కదా" అంటూ బాధపడింది. "నేను పురుషుడ్ని కాలేను కనుక స్త్రీగా ఇలానే బాధపడుతూ ఏడుస్తూనే మరణించడం తప్ప నాకు గత్యంతర మేముంది?" అని కూడా బియాట్రిస్ తన బాధ వెళ్ళబుచ్చు కుంది. ఇంతవరకు వచ్చాక బెనెడిక్ యిక చూస్తూ వూరుకునే ప్రసక్తి లేదు. "క్లాడియో వల్ల హీరోకి అన్యాయం జరిగిందనీ నువ్వు గట్టిగా నమ్ముతున్నావు కనుక యిదుగో యిప్పుడే నేను వెళుతున్నాను. క్లాడియోకి తగిన బుద్ధి చెపుతాను" అని ముందుకు వచ్చాడు, క్లాడియోతో మల్లయుద్ధానికయినా సిద్ధమంటూ.

వీరిద్దరూ ఇలా వుండగా లీయొనాటో తన కూతురికి జరిగిన అవమానానికి ప్రతీకారం తప్ప మార్గం లేదని డాన్ పేడ్రో, క్లాడియో లతో కత్తియుద్ధానికి సిద్ధపడ్డాడు. అతనిమీద వుండే గౌరవంకొద్దీ వాళ్ళు అతన్ని నివారించడానికి ప్రయత్నం చేస్తుంటే బెనడిక్ అక్కడికి

వచ్చాడు. అతను కూడా క్లాడియోని సవాలు చేసాడు. క్లాడియో, పేద్రోతో బియాట్రిస్ నాతణ్ణి రెచ్చగొట్టి పంపినట్లుందన్నాడు. అయినా కూడా క్లాడియో బెనెటిక్‌తో కత్తి యుద్ధానికి దిగి వుండేవాడే. కాని యింతలో అనుకోని విధంగా హీరో నిర్దోషిత్వం నిరూపణకి ఒక సంఘటన జరిగింది. వీళ్ళందరూ ఇంకా సవాళ్ళు ప్రతిసవాళ్ళు చేసుకుంటూ వుండగా బొరాకియోని ఖైదీగా తీసుకున్న ఒక మేజిస్ట్రేట్ అక్కడికి తీసుకు వచ్చాడు. ఆ ఖైదీ తనని డాన్ జాన్ ఎటువంటి పనికి ఉపయోగించాడో, తను ఏం చేసాడో విపులంగా ఎవరితోనో చెపుతుండగా విని అతణ్ణి పట్టుకొని తీసుకు వచ్చానని చెప్పాడు అతను. గట్టిగా దండించగా బొరాకియో జరిగినదంతా డాన్ పేద్రో ముందు ఒప్పుకున్నాడు. కిటికీ లోంచి తనతో మాట్లాడింది మార్గరెట్ అని, హీరో కాదని స్పష్టంగా చెప్పాడు. దాంతో క్లాడియోకి హీరో ఏ నేరం చేయకుండా ఆమెను అందరిముందూ అవమాన పరచి, ఆమె మరణానికి కూడా కారకుడయ్యానని నిస్సందేహముగా తేలిపోయింది. డాన్ జాన్ అక్కడి నుండి పారిపోయాడన్న వార్తతో యిక బొరాకియో చెప్పినదాంట్లో ఏ మాత్రం అసత్యం లేదని రూఢి అయింది.

క్లాడియోకి పశ్చాత్తాపం కలిగింది. లియోనాటోని తను చేసిన అపరాధానికి తగిన శిక్ష విధించమని కోరాడు. అది ఎంత కఠినమయినదయినా సరే భరించడానికి సిద్ధంగా వున్నానన్నాడు. దానికి లియోనాటో, చనిపోయిన హీరోకి జ్ఞాతి, తనకి వారసురాలు అయిన ఒక అమ్మాయి వుందని, ఆమె సరిగ్గా హీరో మాదిరిగా వుంటుందని, ఆమెను వివాహమాడినట్లయితే హీరో ఆత్మకి శాంతి కలుగుతుందని చెప్పాడు. క్లాడియో తను యిచ్చిన మాట ప్రకారం, లియొనాటో తనని ఎవరిని వివాహం చేసుకోమన్నా ఆమె ఎంత అనాకారి అయినా చేసుకోవడానికి సిద్ధంగా వున్నానని అన్నాడు.

క్లాడియొ రాత్రంతా కళ్ళ నీళ్ళతో హీరోకి కట్టిన సమాధి దగ్గర గడిపాడు.

మరునాడు ఉదయం డాన్ పేడ్రో, క్లాడియొని తీసుకుని చర్చికి వెళ్ళాడు. అక్కడ పురోహితుడు, లియొనాటో, బియాట్రిస్ మొదలయిన వాళ్ళు అందరూ వీళ్ళ రాకకోసం ఎదురుచూస్తున్నారు. క్లాడియొ వివాహం చేసుకోబోతున్న అమ్మాయిని అతనికి పరిచయం చేసాడు లియొనాటో. ఆమె ముఖానికి ముసుగు వేసి వుంది. క్లాడియో తన ముఖం చూడకుండానే తనని పెళ్ళిచేసుకోవడానికి ఆమెకి అభ్యంతరం లేకపోతే ఆ పురోహితుడి ముందు తన సమ్మతి తెలియచేస్తూ తన చేతిలో ఆమె చేతిని వుంచమని అడిగాడు. "నేను బ్రతికి వున్నపుడు, నేను నీకు మరొక భార్యను," అంటూ పైన వున్న మాస్క్‌ని తీసివేసింది. ఆమె ఎవరోకాదు. హీరో. ఇది క్లాడియోని సంభ్రమాశ్చర్యాలలో ముంచి వేసింది. డాన్ పేడ్రో ఆశ్చర్యంగా, "ఈమె చనిపోయిన హీరో కదా? అన్నాడు. పురోహితుడు ఈ విచిత్రం ఎలా జరిగిందో తరువాత అంతా విపులంగా చెపుతానని, ముందు వివాహ కార్యక్రమం పూర్తి కానివ్వమని తొందరపెట్టాడు.

ఇంతలో బెనెడిక్ కలుగచేసుకొని క్లాడియో, హీరోల వివాహంతో పాటు బియాట్రిస్‌తో తన వివాహం కూడా జరగాలన్న కోరిక వెలిబుచ్చాడు, వారిద్దరిమధ్యా మళ్ళీ ఈ విషయమై కొంత వాగ్వివాదాలు జరిగాయి అప్పుడు వాళ్ళిద్దరికి జరిగిన మోసం అర్థమయింది. నిజంగా వాళ్ళిద్దరి మధ్యా ఏవిధమయిన ప్రేమ లేకపోయినా, పేడ్రో, క్లాడియో, లియొనాటోలు అంతా కలసి ఆడిన నాటకానికి వాళ్ళు ఒకరినొకరు ప్రేమిస్తున్నారని నమ్మి యిపుడు నిజంగానే వాళ్ళిద్దరు గాఢంగా ప్రేమించుకుంటున్నట్లు తేలింది. అయినా వాళ్ళ పాత ధోరణిలోనే

యిద్దరు యీ సమయంలో కూడా యింకా ఒకళ్ళ నొకళ్ళు వేళాకోళం చేసుకుంటూ వున్నారు. బెనెడిక్ బియాట్రిస్ మీద జాలితో తనంటే ఆమెకి ఎంతో ప్రేమ అని తెలుసుకుని, వివాహమాడ్డానికి వొప్పుకున్నానన్నాడు, దానికి సమాధానంగా బియాట్రిస్ కూడా తను అతణ్ణి పెళ్ళి చేసుకోకపోతే ప్రాణం తీసుకుంటాడని తెలిసి, ఆతనిమీద జాలివేసి తను అంగీకరించానని అంది.

ఈ విధంగా బెనెడిక్, బియాట్రిస్‌నీ, క్లాడియో, హీరోని వివాహం చేసుకున్న శుభసమయంలోనే పెళ్ళిచేసుకున్నాడు. కథ ఈ విధంగా సుఖాంతమయినందుకు అందరూ సంతోషించారు.

(*)

# రోమియో అండ్ జూలియట్
# Romeo and Juliet

వెరోనా పట్టణంలో రెండు ధనవంతులమయిన కుటుంబాల మధ్య తీవ్రమయిన కలహాలుండేవి. వారి శత్రుత్వం అవధులు దాటింది. ఒకరి యింట్లో కాకి మరొకరి యింట్లో వాలడానికి వీల్లేదు. చిన్న చిన్న తగాదాలు కూడా చిలికి, చిలికి గాలివానయి, చివరికి పటణంలో ప్రజలకు శాంతి లేకుండా పోతోందేది. మాంటేగ్, కేప్యులేల కుటుంబాలు ఆ విధంగా పక్క పక్క యిండ్లలోనే చాలా కాలంగా వుంటున్నాయి.

లార్డ్ కేప్యులే ఒకసారి పెద్ద విందు ఏర్పాటు చేసాడు. ఆ వూళ్లోని సంపన్నులు, వాళ్ళ భార్య పిల్లలు ఆ విందుకి ఆహ్వానితులు. కాని మాంటేగ్ కుటుంబాన్నుంచి మాత్రం ఎవరికీ అక్కడ స్థానంలేదు. అక్కడికి వచ్చినవారిలో రోసరిన్ అనే ఒక అందగత్తె వుంది. ఆమెని మాంటేగ్ కుమారుడు రోమియో ప్రేమిస్తున్నాడు. ఆమె అతని ప్రేమ **నిరాకరించింది.**

ఆటువంటి స్త్రీ పిచ్చిలో వున్న రోమియో మనస్సు మార్చడానికి, అతని స్నేహితుడు బెన్వోలియో ఎంతో ప్రయత్నం చేసాడు. ఈ విందుకి వచ్చిన అందగత్తెల ముందు రోసలిన్ ఎంత దిగదుడుపో చూసి నట్లయితే, అతను మార్తాడేమోనని, రోమియో కేప్యులే యింటికి రావడం ఎంత ప్రమాదమోనని తెలిసుండి కూడా, అతణ్ణి విందుకు తీసుకు వెళ్ళాడు. రోమియో ముఖానికి మాస్క్ తొడుక్కుని వున్నాడు. అతడి స్నేహితుడు మెర్క్యూషియో కూడా అలాగే వచ్చాడు. విందుకొచ్చిన అతిధు లందరూ అక్కడ జరిగే డాన్స్‌లో పాల్గొన్నారు.

ఆ సమయంలో కళ్ళు మిరుమిట్లు గొలిపే ఒక అందాల రాశిని రోమియో చూడ్డం తటస్థించింది. ఆమె అందానికి ముగ్ధుడయ్యాడు. ఆమె అందం ముందు, అక్కడ ప్రకాశిస్తున్న దీపాలు కూడా వెల వెల బోతున్నాయని, రోమియో స్నేహితునితో అన్నాడు.

కేప్యులే మేనల్లుడు టైబాల్ట్ ఆ మాటలు విని, గొంతుబట్టి అతను రోమియో అని గుర్తుపట్టాడు. మాస్క్ ధరించి, మాంటేగ్ కుటుంబంలోని వ్యక్తి కేప్యులే యింటిలో విందుకు రావడానికి సాహసించినందుకు అతనికి ఎంతో కోపం వచ్చింది. ఆ కోపంలో రోమియోని చంపేద్దామనికూడా అనుకున్నాడు. కాని అతని పెత్తండ్రి అడ్డువచ్చాడు. అలా చేయకుండా సరి అయిన సమయము దొరికినపుడు, అతనికి బుద్ధి చెప్పి తీరుతానని శపథం పట్టి అప్పటికి మాత్రము వూరుకున్నాడు.

డాన్స్ అయిపోయిన తరువాత, రోమియో తనని కలవరపెట్టిన అందాలరాశి ఎవరో తెలుసుకోవడానికి ఆమె దగ్గరకు వెళ్ళాడు. ఆమె చేతిని తన చేతిలోనికి తీసుకుంటూ, ఆమె ఒక పవిత్రమైన దేవాలయ

మని, తనొక యాత్రికుడినని, ఆమెని పొగిడాడు. వాళ్ళిద్దరి మధ్య యీ ధోరణిలో మాటలు సాగుతూ వుంటే, ఆమె తల్లి వచ్చి ఆమెను తీసుకు వెళ్ళింది అక్కడినుంచి. అప్పుడు తెలిసింది అతనికి. తనని అంతగా మంత్ర ముగ్ధుడిని చేసిన యువతి కేప్యులే కూతురు జూలియట్ అని.

జూలియట్ కూడా తన నర్సు ద్వారా, తనతో అంత ప్రేమగా మాట్లాడిన అందగాడు, తన కుటుంబానికి బద్ధవైరమున్న మాంటేగ్ కుమారుడు రోమియో అని తెలుసుకుంది. అంటే రెండు అజన్మ శత్రువుల కుటుంబాల్లోని పిల్లలిద్దరు యిపుడు ప్రేమలో పడ్డారన్నమాట.

అర్ధరాత్రి దాటింతరువాత రోమియో మిత్రులతో సహా అక్కడి నుంచి బయలుదేరి వెళ్ళాడు. మిత్రులు బెన్వాలియో, మెర్క్యూషియో వారిళ్ళకి వెళ్ళారు కాని రోమియో మాత్రం తిన్నగా జూలియట్ ఇంటికి తిరిగి వచ్చి తోట గోడదూకి, జూలియట్ గది దగ్గరికి చేరుకున్నాడు. ఎవరికీ కనపడకుండా చెట్టునీడనే నిలుచున్నాడు. తనపైన వున్న కిటికీ తలుపు తెరుచుకుంది. కిటికీమీదికి వంగి జూలియట్ నిలబడింది. ఆమె కాంతి ముందు చంద్రుడు వెల వెలబోయినట్లున్నాడు. కొంత సేపయిన తరువాత, జూలియట్ తను తప్ప అక్కడ యింకెవ్వరూ లేరనుకొని గట్టిగా ఓ నిట్టూర్పు విడిచింది.

"ఓ రోమియో, రోమియో ! నువ్వు మాంటేగ్ కుటుంబం వాడి వెందుకయ్యావు? ఆ పేరు వదలుకో. లేకపోతే, నేను నా కేప్యులే పేరుని వదులుకుంటాను నీ ప్రేమ కోసం" అంది తనలో మాట్లాడు కుంటూ.

ఇంత విన్న తరువాత రోమియో మాట్లాడకుండా ఉండలేక పోయాడు. "నన్ను నీ యిష్టం వచ్చిన పేరుతో పిలు. నీకు యిష్టం లేని పేరుతో నాకు సంబంధం లేదు" అని సమాధానం చెప్పాడు.

ఎవరో మాట్లాడుతున్న పురుష కంఠం విని కంగారు పడింది ముందుగా. వెంటనే ఆమె హృదయానికి అర్థమయింది. ఆ మాట్లాడు తున్నది తన రోమియో తప్ప మరెవ్వరూ కాదని.

"ఇలా అర్ధరాత్రప్పుడు ఇక్కడికి ఎందుకు వచ్చావు? మావాళ్ళెవరయినా చూస్తే నిన్ను క్షణంలో చంపెయ్యగలరు జాగ్రత్త" అంది జూలియట్.

"నాకు వాళ్ళ కత్తుల్లో కంటే, నీ కళ్ళల్లో ఎక్కువ ప్రమాద ముంది. నన్ను వాళ్ళు చంపినా సరే, నేను సిద్ధమే నీ ప్రేమ కోసం" అన్నాడు రోమియో.

జూలియట్ తన ప్రేమ రోమియో ముందు అనుకోకుండా అలా వ్యక్తపరచినందుకు చాలా సిగ్గుపడిపోయింది. అందుకు తనని చులకనగా మాత్రం చూడవద్దని రోమియోని వేడుకుంది. అలా మాట్లాడినందుకు నీమీద నా ప్రేమ తగ్గకపోగా, ఎన్నో రెట్లు అధికమయింది కూడా, నన్నాడు రోమియో.

ఇలా వాళ్ళిద్దరూ ఆనందంగా మధుర క్షణాలు గడుపుతుంటే, నర్సు వచ్చి ఆమెను లోపలికి తీసుకు వెళ్ళిపోయింది. అతను అక్కడే నిలబడి వున్నాడు.

జూలియట్ మళ్ళీ వచ్చి, "నువ్వు నిజంగా నన్ను ప్రేమిస్తున్నావా? అయితే నీ దగ్గరికి నా మాతని పంపిస్తున్నాను. అతను మన వివాహానికి అన్ని ఏర్పాట్లు మాట్లాడుతాడు" అని చెప్పి లోపలికి వెళ్ళిపోయింది, వెళ్ళలేక ఎంతో బాధపడుతూ.

అక్కడినుంచి రోమియో బయటికి వచ్చేసరికి తెల్లవారింది.

ఇంటికి తిరిగి వెళ్ళకుండా తిన్నగా దగ్గరలోనే వున్న మఠానికి వెళ్లాడు. అక్కడ లారెన్స్ అనే ఒక సన్యాసి, రోమియోకి స్నేహితుడు. అతనికి అన్ని విషయాలలోను సలహాదారుడు కూడా. లారెన్స్ అప్పటికే నిద్ర లేచి తోటలో పువ్వులు కోస్తున్నాడు. మూలికలు కూడా అక్కడ ఎన్నో వున్నాయి. లారెన్స్‌కి, ఏ మూలికలు, ఏ వ్యాధులకి, వుపయోగపడతాయో బాగా తెలుసు. అంత ప్రొద్దుటే రోమియో తన దగ్గరికి రావటం చూసి రోసలిన్ ప్రేమ విషయమై ఏదైనా మాట్లాడ్డానికి వచ్చాడేమో ననుకున్నాడు.

రోమియో ఇపుడు వచ్చిన పని వేరు. తను యిపుడు ప్రేమిస్తున్నది జూలియట్ అని, ఆ వుదయమే వారిద్దరికి వివాహం జరిపించమని కోరాడు. తను జూలియట్‌ని గాఢంగా ప్రేమిస్తున్నానని, ఆమె కూడా తనని అంతగా ప్రేమిస్తోందని చెప్పాడు. లారెన్స్‌కి ఆశ్చర్యం కలిగింది. ఒక్కక్షణం ఆలోచించి, యిదీ మంచి కోసమే వచ్చిందేమో ననుకున్నాడు. ఈ వివాహం మూలంగానైనా, ఆ రెండు కుటుంబాల మధ్య వున్న శత్రుత్వం తొలగిపోయి, దగ్గరగా వస్తాయేమో ననుకున్నాడు. వాళ్ళిద్దరికీ వివాహం జరిపించడానికి అంగీకరించాడు.

ఆపుడే జూలియట్ పంపిన దూత వచ్చాడు అతని ద్వారానే ఆమెకు, తను లారెన్స్ దగ్గర వున్నానని, త్వరలో అక్కడికి వచ్చినట్లయితే, వాళ్ళ వివాహం జరిగిపోతుందని కబురు పంపాడు. జూలియట్ వెంటనే అక్కడికి చేరుకుంది. లారెన్స్ వాళ్ళిద్దరికి వివాహం జరిపించాడు. ఇంతటితో వాళ్ళ కుటుంబాలు కలిసిపోవాలని ప్రార్థించాడు భగవంతుని. పెళ్ళయిపోయిన వెంటనే జూలియట్ తిరిగి యింటికి వెళ్ళిపోయింది. ఆ రాత్రి రోమియో అంతకు ముందు తనని కలిసిన

తోటలోనే వచ్చి కలుస్తానని చెప్పి పంపించాడు. జూలియట్ కి క్షణం యుగాలుగా గడుస్తోంది.

అదే రోజు మధ్యాహ్నం రోమియో స్నేహితులు బెన్వాలియో, మెర్క్యూషియొ వీధిలో నడిచి వస్తూండగా, టైబాల్ట్ అతనిమిత్రులు తటస్థపడ్డారు. రోమియోతో స్నేహంగా వున్నందుకు మెర్క్యూషియోని నిందించాడు. అతను కూడా దానికి తగిన సమాధానం చెప్పడంతో వారిద్దరికి మధ్య ఘర్షణ మొదలయింది. టైబాల్ట్ అతని మీద కత్తి తీసాడు. సరిగ్గా అదే సమయానికి రోమియో అటు పక్కకి వచ్చాడు, రోమియోని చూసి టైబాల్ట్, "పోకిరివాడా", అని అరిచాడు. రోమియోకి టైబాల్ట్ తో పోట్లాడానికి యిష్టంలేదు, అతడు జూలియట్ కి దగ్గరి బంధువు కావడంవల్ల. అదీగాక రోమియోది ప్రతి చిన్న విషయానికి కాలుదువ్వే స్వభావం కాదు. టైబాల్ట్ తో మంచిగా మాట్లాడానికి ప్రయత్నించాడు. టైబాల్ట్ కి మాంటేగ్ కుటుంబం మీద వున్న కక్షకొద్దీ రోమియో మాటలు ఎంత మాత్రం పట్టించుకోలేదు. ఇదంతా చూస్తున్న మెర్క్యూషియోకి ఇంత పిరికివాడిలా ప్రవర్తిస్తున్నాడేమిటా అని కోపం వచ్చింది. కత్తితీసి టైబాల్టు మీదికి వెళ్ళాడు, ఇద్దరూ పోట్లాడారు. తీవ్రంగా టైబాల్టు మెర్క్యూషియోని పొడిచి చంపాడు. అది చూసిన రోమియో టైబాల్టు పైకి కత్తి తీసి దూకాడు. టైబాల్టుని చంపడానికి ఎక్కువ సేపు పట్టలేదు. పెద్ద గుంపు అక్కడ చేరారు. మాంటేగ్, కేప్యులేలు వాళ్ళ భార్యలతో అక్కడికి చేరారు. ఇక్కడ జరుగుతున్నదంతా విని వెరోనా యువరాజు కూడా అక్కడికి వచ్చాడు. ఈ విధమయిన తగాదాలు తరుచూ జరుగుతుండడంవల్ల యీసారి తప్పుచేసిన వారిని గట్టిగా శిక్షించాలని నిర్ణయానికి వచ్చాడు. రోమియో స్నేహితుడు బెన్వాలియోని అక్కడ జరిగినదంతా వివరంగా చెప్పమని అడిగాడు

బెన్వోలియో అంతా చెప్పాడు. లేడీ కేప్యులేట్ తమ బంధువు టైబాల్టుని చంపిన వారిమీద ఏమాత్రం దయ చూపవద్దని కోరింది. లేడీ మాంటేగ్ తన కుమారుడు రోమియోని క్షమించమని వేడుకొంది. అందరూ చెప్పిన మాటలు విని యువరాజు రోమియోని వెరోనా నుంచి బహిష్కరిస్తూ తీర్పు నిచ్చాడు. ఆ పట్టణంలో ఎక్కడైనా అతను కనబడితే అతనికి మరణ శిక్ష తప్పదు.

ఈ వార్త జూలియట్‌కి పిడుగులా వచ్చి పడింది. రోమియోతో కొద్ది గంటల క్రితమే ఆమె వివాహమయింది. ఇపుడు ఆమె అతని నుంచి శాశ్వతంగా వేరుచెయ్యబడపోతోంది. ఒక ప్రక్క టైబాల్టు మరణం, మరో ప్రక్క రోమియో బహిష్కరణ ఆమెకు ఎంతో దుఃఖాన్ని కలిగించాయి. రోమియోకిచ్చిన శిక్ష మరీ భరించలేనిది.

టైబాల్టుని చంపిన వెంటనే రోమియో అక్కడి నుంచి వెళ్ళిపోయి లారెన్స్ మఠానికి చేరుకున్నాడు. అక్కడ దాక్కుని వుండగా తనని దేశాన్నించి బహిష్కరించిన వార్త తెలిసింది. అతని దృష్టిలో అది మరణం కంటె కఠినమైన శిక్షగా తోచింది. తన జూలియట్ నుంచి దూరంగా వెళ్ళి ఎలా బ్రతకడం అని అనుకున్నాడు. లారెన్స్ అతన్ని ఓదార్చడానికి ఎంత ప్రయత్నించినా వినిపించుకోక, ఆత్మహత్య తప్ప తనకి గత్యంతరం లేదనుకున్నాడు. ఆ సమయంలో జూలియట్ నుంచి వచ్చిన ఒక ఉత్తరం అతనిని కొంత శాంతపరచింది. లారెన్స్, యువరాజు అతనికి మరణశిక్ష విధించకుండా, బహిష్కరించడం అతనికి ఎంతో మేలు చేసినట్లేనన్నాడు. అతని మాటలు రోమియోకి నచ్చాయి. ధైర్యం కలిగించాయి, చీకటిపడగానే జూలియట్ దగ్గరకు వెళ్ళి శలవు తీసుకుని మాంటువా చేరుకొని, తన దగ్గర నుండి మళ్ళీ కబురు వచ్చేవరకు అక్కడే వుండమని లారెన్స్ చెప్పాడు. కొంతకాలం గడిచాక వారిద్దరి

వివాహం సంగతి వారి తల్లితండ్రులకు చెప్పి పరిస్థితులు చక్కబడేటట్లు చూస్తానని చెప్పాడు. భగవంతుడి దయకంటె, వారి తల్లితండ్రుల అనుమతి పొంది,తరువాత యువరాజు క్షమించేటట్లు చేస్తానని కూడా చెప్పాడు. ఇక్కడ ఏం జరుగుతున్నదో తరచు ఆతనికి తెలియపరుస్తూ వుంటానని అతణ్ని ఏ మాత్రం కంగారు పడవద్దని కూడా చెప్పి రోమియోని పంపించాడు లారెన్స్.

ఆ రాత్రికి రహస్యంగా జూలియట్ గదికి చేరుకున్నాడు. ఆ రాత్రంతా అక్కడే వున్నాడు. తెల్లవారకముందే, అతికష్టంమీద ఆమె దగ్గరనుంచి సెలవు తీసుకుని వెరోనా వెళ్ళిపోయాడు. ఇది జరిగిన కొద్ది రోజుల్లోనే జూలియట్‌ని తీవ్రంగా కలవరపెట్టే సంఘటన మరొకటి జరిగింది. ఆమె తండ్రి, జూలియట్ వివాహం కౌంట్ పారిస్ పట్టణంలోకెల్లా శ్రీమంతుడూ, అందగాడు అయిన యువకుడితో ఏర్పాటు చేసాడు. అతడు అన్ని విధాల ఆమెకు తగిన భర్త అని అనుకున్నాడు. కాని జూలియట్ యింకా తను చిన్న పిల్లనని, టైబాల్టు పోయిన అంత కొంచర్లోనే తనకి వివాహమేమిటనీ, ఏదో సాకులు చెప్పి వివాహం జరుగకుండా ప్రయత్నాలు చేసింది. కాని తండ్రి ఆమె అభ్యంతరాలన్ని త్రోసి పుచ్చాడు. రెండు రోజుల్లో ఆమెకి వివాహం జరుగుతుందని తన నిర్ణయాన్ని చెప్పాడు.

జూలియట్ కంగారుగా లారెన్స్ దగ్గరకి వచ్చి తను ఎంత యిబ్బందిలో పడిందో చెప్పింది.

"నాకు ఏదో విధంగా సహాయం చెయ్యకపోతే, నేను మరణించక తప్పదు" అని తన నిర్ణయాన్ని చెప్పింది. లారెన్స్‌కి జాలివేసింది. ఏం చేయాల్లో తోచలేదు. ఎలాగయినా సరే సహాయం చేయాలని అనుకుని,

"నేను చెయ్యమనేపని చాలా కష్టమైనది. చెయ్యడానికి నీకు ధైర్యం వుందా?" అని ఆమెని అడిగాడు.

"దేనికైనా సిద్ధమేనంది" జూలియట్.

"అయితే తిరిగి యింటికి వెళ్ళిపో. వివాహానికి నీ అంగీకారం తెలుపు. సంతోషంగా కనపడు అందరికి. రేపు రాత్రి నేనిచ్చే మందు తీసుకో. అది నిన్ను 42 గంటలపాటు చనిపోయినట్లుగా కనపడేటట్టు చేస్తుంది. నువ్వు నిజంగానే చనిపోయావనుకుని నిన్ను సమాధి చేస్తారు. ఈ విషయమంతా రోమియోకి తెలియచేసి, తిరిగి స్పృహ వచ్చేసరికి రోమియో నీ దగ్గరికి వచ్చేటట్లు చేస్తాను. ఆ తరువాత మీరిద్దరూ మాంటూవా వెళ్ళిపోవచ్చును" అని లారెన్స్ జూలియట్ కి తన పథకాన్నంతా వివరించాడు.

ఇదంతా విన్న జూలియట్ కి సంతోషం, భయం కలిగాయి. అంతా అనుకున్నట్లుగా జరిగితే సరేసరి. లేకపోతే ఎక్కడ ఏ పొరపాటు జరిగినా దాని పర్యవసానం అనూహ్యం. అయినా రోమియో మీద వున్న ప్రేమ ఆమెన్ని ఏ పని చేయించడానికి అయినా సిద్ధపరిచింది. అలాగే చేస్తానని చెప్పి, లారెన్స్ యిచ్చిన మందు సీసా తీసుకుని యింటికి వెళ్ళింది.

పెళ్ళికి జరుగుతున్న ప్రయత్నాల్లో తను కూడా సంతోషంగానే పాల్గొంది. అందరూ వివాహ కార్యక్రమాల్లో నిమగ్నులై ఉన్నారు. ఆ రాత్రి జూలియట్ లారెన్స్ ఇచ్చిన మందు తీసుకుంది. తీసుకోబోయే ముందు ఎంతో భయపడింది. అది నిజంగా విషమేనేమో ! తను అనుకున్న దానికన్న ముందుగా లేచి శ్మశానంలోని దెయ్యాలన్నింటి మధ్య తను ఒంటరిగా ఉండవలసి వస్తుందేమో! ఇవన్నీ తలుచుకుని వణికిపోయింది. అయినా రోమియో కోసం అన్నింటికి సిద్ధపడింది.

మరునాడు ఉదయం కౌంట్ పారిస్ వివాహానికి తయారయి వచ్చాడు.

జూలియట్ తల్లి ఆమెను నిద్రనుంచి లేపడానికి వెళ్ళింది. ప్రాణాలు కోల్పోయి పడివున్న తన కూతురిని చూసింది. అందరూ దుఃఖంలో మునిగిపోయారు. కౌంట్ పారిస్ పిచ్చెత్తిన వాడిలా ప్రవర్తిస్తున్నాడు.

తల్లిదండ్రుల శోకం చూసేవారికి గుండెలు పిండేటట్లుగా వుంది. వారి ఏకైక పుత్రిక యోగ్యుడైన వ్యక్తిని వివాహం చేసుకోబోతున్న కొద్దిగంటల ముందు ప్రాణాలు విడిచింది.

జూలియట్‌ని చర్చికి తీసుకు వెళ్ళింది, ఆమె వివాహానికి కాక ఆమెను సమాధి చేయడానికి. ఆమెకి వివాహం జరిపించవలసిన పురోహితుడు ఆమెను సమాధిలో వుంచవలసి వచ్చింది.

జూలియట్ మరణవార్త లారెన్స్ పంపిన మనిషి అక్కడికి చేరకముందే రోమియోకి అందింది. లారెన్స్ వేసిన పథకం ఎంత మాత్రం తెలియని రోమియో నిజంగానే జూలియట్ మరణించిందనుకుని ఎంతగానో విలపించాడు. వెంటనే బయలుదేరి వెరొనా జేరుకుని జూలియట్‌ని సమాధిలో చూడాలనుకుని నిశ్చయించుకున్నాడు. దారిలో ఒక మందులమ్మే దుకాణం దగ్గిర ఆగి, చాలా డబ్బు ఆశపెట్టి అక్కడ విషం కొనుక్కున్నాడు. అది చాలా ప్రమాదకరమయినది.

తిన్నగా జూలియట్‌ని పాతిపెట్టిన ప్రదేశానికి వెళ్ళి, ఆమెను చూసి, విషం తీసుకుని ఆమె ప్రక్కనే పడి చనిపోవాలని అతడి ఆలోచన. ప్రయాణంచేసి అర్ధరాత్రికి చేరుకున్నాడు రావడంతోటే తనతోటి తెచ్చుకున్న పనిముట్లతో శవపేటికను తెరవడానికి వుపక్రమించాడు. సరిగా అదే సమయానికి కౌంట్ పారిస్ కూడా ఆమె సమాధిపై

పువ్వులు పుంచడానికి వచ్చాడు. శవపేటికను తెరుస్తున్న వ్యక్తిని పుద్దేశించి "ఆగు దుష్టుడా!" అని అరిచాడు. రోమియోని గుర్తించి, అతడు అక్కడికి వాళ్ళ కుటుంబాల మధ్య పున్న కలహాలమూలంగా ఏదో దుర్బుద్ధితో అక్కడికి వచ్చాడని భావించాడు అతణ్ణి పట్టుకో బోయాడు. రోమియో తనతో పోట్లాడానికి దిగవద్దని వారించాడు. ఇప్పటికే కేప్యులే కుటుంబంలో టైబాల్ట్ రక్తం చూసానని, యింకెవరిని చంపటం తనకి యిష్టంలేదని కూడా చెప్పాడు. కానీ కౌంట్ అతని మాటలని లెక్కచెయ్యకుండా అతనిపైకి కత్తి తీసాడు. రోమియోకి తప్పలేదు. రోమియో కూడా కత్తి తీసి కౌంట్‌ని చంపాడు. అప్పుడు ఆతన్ని జూలియట్‌ని పెళ్ళి చేసుకోవడానికి నిర్ణయింపబడిన కౌంట్ పారిస్‌గా గుర్తించాడు. అతనిమీద జాలి కలిగింది. జూలియట్ శవపేటిక తెరచి, ఆమె ప్రక్కనే కౌంటు పారిస్ శవాన్ని కూడా పుంచాడు.

జూలియట్‌కేసి చాలాసేపు చూస్తూ నిలబడ్డాడు. చెక్కుచెదరని అందంతో ఆమె నిద్రపోతున్నట్లుంది. ఆ దగ్గరలోనే టైబాల్ట్ శవం కూడా పుంది. అతని శవాన్ని చూసి, తను చేసిన నేరానికి క్షమించమని టైబాల్ట్‌ని వేడుకున్నాడు. తన భార్య జూలియట్‌ని ఆఖరిసారిగా ముద్దు పెట్టుకుని, ఆమెకు వీడ్కోలు చెప్పి, తను తెచ్చుకున్న విషం తీసుకుని మరుక్షణమే ప్రాణాలు విడిచాడు.

ఈలోపున లారెన్స్‌కి తను చేసిన కబురు రోమియోకి అసలు అందలేదని తెలిసింది. అక్కడికి వెళుతున్న దూత దారిలో ఒక ప్రమాదంలో చిక్కుకొని రోమియో దగ్గరికి చేరుకోలేకపోయాడు. కంగారుగా తనే బయలుదేరి శ్మశానానికి చేరుకున్నాడు, జూలియట్ లేచేసరికి సమాధి దగ్గర దీపం వెలుగుతూ పుండడం గమనించాడు. లోపలకు వెళ్ళి చూస్తే కౌంటు పారిస్. రోమియో కూడా అక్కడ పడి పుండటం కనపడింది.

వారిద్దరూ ప్రాణాలతో లేరని చూసి దిగ్భ్రాంతి చెందాడు. స్పృహతప్పి పడిపోయేంత పనయ్యింది. ఇంతలోనే జూలియట్ "రొమియో! రొమియో అంటూ మెల్లిగా పిలవడం వినపడింది. అయితే ఆమె లేస్తోంది అన్న మాట అని అనుకుని చూస్తూ వుండగా, గట్టిగా అరుచుకుంటూ ఊళ్ళోని జనం అక్కడికి రావడం చూసాడు. శ్మశానంలో తను రెండు శవాలతో కనపడితే తనే ఆ పని చేసి వుంటాడని వాళ్ళు అనుకుంటారని భయపడి పారిపోయాడు.

జూలియట్‌కి స్పృహ వచ్చి లేచి చూసింది. రోమియో చనిపోయి పడివున్నాడు. అతని ప్రక్కనే విషపు సీసా కూడా పడివుంది. ఆమెకు జరిగింది అర్థమయ్యింది. రోమియో లేని జీవితం నిరర్ధకమనిపించింది. అందులో మిగిలివున్న చుక్కల్ని తాగి, రోమియో పెదవులమీద వున్న విషాన్ని కూడా చుంబించింది. అయినా యింకా ఆమె బ్రతికి వుండటం చూసి, వస్తున్న జనం అరుపులు విని, కత్తి తీసుకుని పొడుచుకుని, రోమియో శవంపై తనుకూడా పడి ప్రాణాలు విడిచింది.

కొద్ది సేపటిలోనే అందరూ అక్కడికి చేరుకున్నారు. కౌంట్ పారిస్ దగ్గర వున్న నౌకరు, రోమియో అతడిని కత్తితో పొడిచి చంపటం చూసి అరుచుకుంటూ వెళ్ళి అందరిని నిద్రలేపాడు. వూరంతావార్త క్షణాలమీద తెలిసిపోయింది. లార్డ్ మాంటేగ్, లార్డు కాపూ్యలే కూడా లేచి జరిగింది విని పరిగెత్తుకుంటూ శ్మశానానికి చేరుకున్నారు. వెరోనా యువరాజు కూడా అక్కడికి వచ్చాడు.

అప్పుడు ఫ్రయర్ లారెన్స్ శ్మశానాన్నుంచి అనుమాన పరిస్థితులలో పారిపోతోంటే చూసి పట్టుకుని భటులు అక్కడికి తీసుకు వచ్చారు. యువరాజు లారెన్స్‌ని అదంతా ఎలా జరిగిందో చెప్పమని

ఆదేశించాడు, లారెన్స్ తను అక్కడికి వచ్చినపుడు రోమియో,పారిస్ చనిపోయి పడివుండటం వరకు తనకు తెలిసిన విషయమంతా చెప్పాడు. ఆ తరువాత ఏం జరిగిందో అతనికి తెలియదు, ఆ మిగతా కథంతా కౌంట్ ప్యారిస్, రోమియో నౌకర్లు చెప్పారు. రోమియో నౌకరు, రోమియో తన తండ్రికి వ్రాసిన వుత్తరం అందించాడు. ఈ ఉత్తరంలో తను, జూలియట్ రహస్యంగా ఎలా వివాహం చేసుకున్నదీ, చివరికి తను విషం తీసుకుని ప్రాణాలు విడవడానికి అక్కడికి ఎలా చేరుకున్నదీ వ్రాసి వున్నది. దానిని బట్టి ఇందులో "ఫ్రయర్ లారెన్స్" చేసింది ఏమీ లేదని, అతడు నిర్దోషి అని తెలిసింది.

ఇంత మంది మరణాలకుదారి తీసిన కథంతా యువరాజు విన్నాడు. మాంటేగ్, "కేప్యూలే"లతో దీనికంతటికీ బాధ్యులు వారేనని నిందించాడు. అబద్ధ వైరులిద్దరూ ఎంతో పశ్చాత్తాపం చెందారు. వారి కుటుంబాల మధ్య చాలాకాలంగా వున్న శత్రుత్వాలను వారి పిల్లలతో పాటే పాతిపెట్టడానికి నిర్ణయించు కున్నారు. ఒకరి నొకరు ఆప్యాయంగా, "అన్నా!" అని సంబోధించుకున్నారు. లార్డు మాంటేగ్, జూలియట్ బంగారు విగ్రహాన్ని అంతకంటె గొప్పగా తయారు చేయించిన రొమియో విగ్రహాన్ని లార్డు కేప్యులే ప్రతిష్టాపన చేస్తామని, వారి కుటుంబాలు యికముందు స్నేహబంధాలు కలిగి వుంటాయని ప్రకటించారు. రెండు కుటుంబాలను కలపటానికి వాళ్ళ పిల్లలు చేసిన ప్రాణత్యాగమే ఈ రొమియో, జూలియట్ల విషాదాంక గాథ.

*

# తుఫాను

## Tempest

చాలాకాలం క్రితం ఇటలీలో ప్రాస్పరో, ఆంటోనియో అనే ఇద్దరు అన్నదమ్ములుండేవారు. ప్రాస్పరో మిలాన్ పట్టణానికి డ్యూక్. అతనికి రాజ్యపాలనకంటే పుస్తకాలు చదవడం, జ్ఞానసముపార్జనమీదే ఎక్కువ ఆసక్తి. పాలనా వ్యవహారాలన్నీ తమ్ముడు ఆంటోనియోకి అప్పచెప్పి, విజ్ఞానశాస్త్రంమీదకి, మేజిక్‌మీదకి తన దృష్టిని పోనిచ్చాడు. వాటిని అవగాహన చేసుకోవడానికి తీవ్రమయిన కృషి సలిపాడు.

పేరుకి అన్నగారు డ్యూక్ అయినా, రాజ్యపాలన అంతా తమ్ముడు చేతిలో వుంది. అయినా కూడా అన్నగారిమీద తమ్ముడికి అసూయ పట్టుకుంది. అన్నగారు అక్కడ ఉన్నంతకాలం ఆయనే నిజమైన డ్యూక్‌గా పరిగణింపబడతాడని, అందువల్ల ఏదో విధంగా ఆయన అక్కడ లేకుండా దూరంగా పంపించివేస్తే తను సంపూర్ణ అధికారాలు పొందవచ్చును. అనే దురాలోచన ఆంటోనియొ మనస్సులోనికి వచ్చింది. దానికి, నేపుల్స్ రాజు అలంసోతో కలసి ఒక కుట్ర పన్నాడు.

ఒకనాటి రాత్రి తుఫాను వీస్తూండగా ప్రాస్పరోని, అతని మూడు సంవత్సరాల కూతురు మిరాండాని ఖైదీలుగా తీసుకుని, అతని శత్రువులు సముద్రపు వొడ్డుకి రహస్యంగా తీసుకెళ్ళారు. అక్కడ తెరచాప కూడా లేని ఒక పడవలోకి ఎక్కించి, సముద్రంలోకి పంపించి వేసారు.

మిలాన్‌లో అతణ్ణి చంపినట్లయితే ప్రజలు తిరగబడతారని భయ పడి, ఇలా చేసినట్లయితే ఆ తుఫానులో పడవ మునిగిపోయి తప్పకుండా అన్నగారు, పిల్లా కూడా చనిపోతారని ఆంటోనియో ఉద్దేశ్యం. కాని గొంజాలో అనే సంస్థానాదిపతి, రహస్యంగా పడవలో కావలసిన ఆహార సామాగ్రి, ప్రాస్పరోకి ఇష్టమైన కొన్ని ముఖ్యమైన పుస్తకాలు కూడా వుంచాడు.

సముద్రంలో ఆ పడవ చాలాసేపు నిరాధారంగా కెరటాల వుధృతానికి అటూ, యిటూ కొట్టుకుంటూనే వుంది. ఏమీ తెలియని పసిపిల్ల మిరాండా హాయిగా నిద్రపోయింది. కాని ప్రాస్పరోకి మాత్రం అందులోంచి బ్రతికి బయట పడతామన్న నమ్మకం పోయింది. కాని ప్రాస్పరో చేసిన ఇంద్రజాలం వల్లనో, అతని మంత్రశక్తివల్ల వచ్చిన ఫెయిరీల వల్లనో తుఫాను తగ్గింది. అంతా మామూలు పరిస్థితికి వచ్చింది. తెల్లవారాక ప్రాస్పరోకి ఒక ద్వీపం కనపడింది. తన పడవని మెల్లగా ఒడ్డుకు చేరేటట్లుగా చేశాడు. అక్కడికి చేరుకున్నాక, నిద్రపోతున్న మిరాండాని తీసుకుని ఒక గుహలోకి వెళ్లాడు.

తరువాత పడవలో తనతో వచ్చిన దుస్తులు, పుస్తకాలు, మిగతా వస్తువులు అన్నీ సురక్షితంగా చేర్చాడు.

ఇక ఆ ద్వీపం పరిస్థితి చూస్తే దానిపైన మానవ మాత్రులు ఎవ్వరూలేరు. కాని శుభ్రమయిన నీరు,కూరగాయలు, ఫలాలు సమృద్ధిగా వుంది. చూడ్డానికి ప్రదేశమంతా పచ్చగా, అహ్లాదకరంగా వుంది.

ప్రాస్పరో మనస్తత్వానికి సరిపడే విధంగా అక్కడి వాతావరణం ప్రశాంతంగా వుంది. తను తన చిన్నకూతురు అక్కడ ఎంత కాల మయినా వుండవచ్చుననుకున్నాడు అక్కడికి చేరుకున్న కొద్ది సేపటికీ ఆ ద్వీపంమీద ఫెయిరీలు కూడా వున్నారని తెలిసి తను జీవితమంతా ఆ మానవాతీత శక్తుల గురించి, ఇంద్ర జాలాన్ని గురించి ఎంతో చదివి తెలుసుకున్నందుకు సంతోషించాడు, అతనికున్న విజ్ఞాన శక్తి వల్ల అక్కడ వున్న ఫెయిరీలన్నిటి పైనా అతనికి ఒక విధమయిన అధి కారం సంక్రమించింది. వాటిలో ముఖ్యమయిన ఫెయిరీ "ఏరియల్"ని విచిత్రమయిన పరిస్థితులలో రక్షించడం జరిగింది. ఒక చెట్టు తొర్ర లోంచి హృదయ విదారకంగా ఏడుస్తున్న గొంతువిని. తన ఇంద్రజాల శక్తితో ఆ చెట్టుని రెండు ముక్కలయ్యేటట్టుగా చేసాడు. అందులోంచి ఒక అందమయిన ఫెయిరీ బయటికి ఎగిరి వచ్చింది. "సైకోరాక్స్" అనే పిశాచి ఆ ద్వీపానికి వచ్చి వాళ్ళమీద పెత్తనం చలాయించ బోతే ఎదురు తిరిగామని, అందుకు కోపం వచ్చి తనకున్న దుష్ట శక్తులు పయోగించి అక్కడ వున్న ఫెయిరీలందర్ని చెట్లలో బం ధించి వేసిందని, యిప్పుడు సైకోరాక్స్ చనిపోయిందని, అనాకారి, పిచ్చివాడు అయిన కేలిబన్ అనే దాని కొడుకు మాత్రం ఆద్వీపం మీద వుంటున్నాడని ఏరియల్ అక్కడి వృత్తాంతం అంతా చెప్పాడు

ప్రాస్పరో తన దగ్గరున్న శక్తులన్ని వుపయోగించి ఆచెట్లలో వున్న ఫెయిరీ లందర్ని విడిపించాడు. వారందరూ ప్రాస్పరోకి తమ వల్ల ఎటువంటి సహాయం ఎప్పుడు కావాలన్నా యివ్వడానికి సంసి ద్ధంగా వున్నామని వారి కృతజ్ఞత తెలియ పరచారు.

ఆ తరువాత కాలిబన్ ఎక్కడ వున్నాడో చూద్దామని వెతు క్కుంటూ ప్రాస్పరో వెళ్ళాడు. అతడు భయంతో ఒక గుహలోనకి

వున్నాడు. అతణ్ని బాగుచేద్దామని ప్రయత్నించాడు. ఆహారం తినిపించి, నీళ్ళు త్రాగించి, మాటలునేర్పి, అతనికి ఎన్నో విషయాలు అర్థమయ్యేటట్లు చేసి, అతణ్ణి చాలా దయగా చూసాడు. కానివాడు మాత్రం చాలా కృతఘ్నుడుగా, మూర్ఖుడిలా ప్రవర్తించాడు. దానితో ప్రాస్పరోకి కోపంవచ్చి వాణ్ణి తన దగ్గర వుంచి, కట్టెలుకొట్టి, నీళ్ళు తెచ్చే పనికి వుపయోగించి బానిసగా ఉంచాడు. ఆ విధంగా ఆ అందమయిన ద్వీపంమీద, ప్రాస్పరో, అతని కూతురు మిరండా అక్కడి ఫెయిరీల సహాయం పొందుతూ, కాలిబన్ చేత సేవ చేయించుకుంటూ కాలం గడుపుతున్నారు. పన్నెండు సంవత్సరాలు గడిచాయి. మిరాండా చక్కని చుక్కలా తయారయింది. ఇంతవరకు ఆమె తన తండ్రిని తప్ప పర పురుషుడిని చూసి ఎరుగదు. మిలాన్ నుంచి తండ్రితో వచ్చేసరికిచాలా చిన్న పిల్ల అవడంవల్ల అక్కడి విషయాలు కూడా ఏమీ ఎరుగదు. తన తండ్రికి జరిగిన అన్యాయం కూడా అసలు తెలియదు. ఈ ప్రశాంతమయిన వాతావరణంలో జీవితం ఆమెకిచాలా హాయిగా గడిచి పోతోంది.

ఆలా వుండగా ఒక రోజు పెద్ద తుపాను వచ్చింది. మిరాండా ఒడ్డున నుంచుని ఎగిరి పడుతున్న అలలని, భయంకరంగా వీస్తున్న గాలి వానని చూస్తోంది. ఇంతలోకే దూరంగా ఒక ఓడని చూసింది. కెరటాలు దాన్ని చిత్రహింస పెట్టాయి. ఆ ఓడ ధ్వంసమయి పోయింది. అందులోవున్న వారు ఎలుగెత్తి సహాయం కోసం అర్థిస్తున్నారు. ఇదంతా చూసి పరిగెత్తుకుని వెళ్ళి తండ్రికి చెప్పింది. తన తండ్రి ఫెయిరీల సహాయంతో ఆ ఓడని, అందులో వున్న వారిని రక్షించడానికి ఏదైనా తప్పక చేయగలడనుకుంది. కాని ప్రాస్పరో ఏమీ వర్ణించుకోకుండా, వాళ్ళకేమీ జరగదని, అంతా క్షేమంగానే వుంటారని చెప్పాడు, ఆ తుపానుని పడవ మీదకి పంపింది తనే కనుక,

వాళ్ళని భయపెట్టడానికి మాత్రమేకాని, వాళ్ళకి ఏ విధమయిన హాని కలిగేటట్లు చెయ్యడం అతని వుద్దేశ్యం కాదు. తన తండ్రి ప్రవర్తన అంతు పట్టని మిరాండా వాళ్ళు తనకేం హాని చేసారని ఆలా చేస్తున్నావని అడిగింది. "ఇప్పుడు కాదు, చాలా సంవత్సరాల క్రితం వాళ్ళు నాకు చాలా హాని తలపెట్టారు. ఇంతవరకు నీకు చెప్పలేదు. ఇపుడు నీవు పెద్దదానివయ్యావు కనుక అంతా తెలుసు కోవలసిన సమయం వచ్చింది." అని కూతురికి జరిగినదంతా చెప్పాడు. తను యింకా మిలాన్‌కి నిజమైన డ్యూక్‌నని, యిన్నాళ్ళకి తనకి అన్యాయం చేసిన వారి మీద కక్ష తీర్చుకోవడానికి అవకాశం వచ్చిందని చెప్పాడు. నేపుల్స్ రాజు కూతురుకి ఆఫ్రికాలో వివాహం జరిపించి, యిపుడు తిరిగి నేపుల్స్‌కి వెడుతున్నారని, అందులో రాజు ఆలాంసో, అతని కుమారుడు ఫర్డినాండ్, సోదరుడు సెబాస్టియన్. తన సోదరుడు ఆంటోనియో ప్రయాణం చేస్తున్నారని తెలుసుకుని, వాళ్ళ ఓడ తుపానులో చిక్కుకుని ఆ ద్వీపం మీదకి వచ్చేలా తన మంత్ర శక్తినుపయోగించి చేసానని చెప్పాడు. ఏరియల్ సహాయంతో అదంతా చేయగలిగానని, ఎవరికి ఏహాని జరగదని కూడా చెప్పి, యిప్పుడు ఎలాగైనా వాళ్ళు చేసిన పనికి వాళ్ళని శిక్షించి, పశ్చాత్తాప పడేలాచేసి తీరతానన్నాడు.

మిరాండాకి తన తండ్రి మాటల మీద నమ్మకం వుంది, తనకిచ్చిన మాట తప్పడని. బాగా అలిసిపోయి వుండడంవల్ల పడుకుని నిద్రపోయింది. అపుడు ఏరియల్‌ని పిలిచాడు. అప్పటికి ప్రొద్దుటి నుంచి చాలా శ్రమపడి వుండడంవల్ల ,కోపంతో తను యింకా ఏదైనా చేయవలసి వుందా, అని అడిగాడు. నీకు సేవ చేసినట్లయితే, నాకు విముక్తి కలిగిస్తానన్నావు కదా, నువ్వు చెప్పిన విధంగా పడవని సురక్షితంగా ఒడ్డు చేర్చాను కదా, నన్ను యిప్పటికయినా వెళ్ళనియ్యవా, అని ఏరియల్

ప్రాస్పరోని అడిగాడు. తనని విడిచి పెట్టటానికి యింకా సమయం రాలేదని, యింకో రెండు రోజులు వోపికపడితే తను వెళ్ళిపోవచ్చునని చెబుతూ, నిన్ను ఎటువంటి చెరలోంచి విడిపించానో మరిచిపోయావా, మళ్ళీ అక్కడికే వెళ్ళిపోవాలనుందా, అని కూడా బెదిరించాడు. ఏరియల్ యిక ఎదురు మాట్లాడక తను అప్పుడు చేయవలసిందేమిటో చెప్ప మన్నాడు.

ప్రాస్పరో, ఏరియల్ని తనకు మాత్రమే కనపడి, యితరులకి గొంతు మాత్రమే వినపడేటట్లు ఒక సముద్రంలో వుండే ఫెయిరీగా ఆకారాన్ని మార్చుకోమన్నాడు. అలా తయారయాక, ఆ పడవ దగ్గరికి వెళ్ళి అక్కడున్న ఫర్డినాండ్ని తన దగ్గరకి తీసుకురమ్మని పంపించాడు. ఏరియల్ అతన్ని వెతుక్కుంటూ వెళ్ళాడు.

ఫర్డినాండ్ ద్వీపానికి ఒక ప్రక్క తను ఒక్కడు మాత్రం కొట్టుకు రాగలిగాడు. మిగతా వాళ్ళందరూ మునిగిపోయుంటారనుకుని చాలా విచారంగా వున్నాడు అలా వుండగా అకస్మాత్తుగా ఒక గొంతు నుంచి పాట వినపడింది. తన తండ్రి సముద్రంలో మునిగిపోయాడని చెప్పింది. ఆ అదృశ్య కంఠం. అది విని ఫర్డినాండ్ చాలా బాధపడ్డాడు. ఆ గొంతు వెడుతున్న దారి ననుసరిస్తూ వెనకాలే వెళ్ళాడు. ఆ ద్వీపం అంతా అతనికి వింతగా తోచింది. ఆ సంగీతం భూమిపై నుంచో, ఆకా శంనుంచో అతనికి అర్థం కాలేదు. అంతా అయోమయంగా వుంది.

ఫర్డినాండ్ వస్తోంటే మిరాండా చూసి ఆశ్చర్యపోయింది. ఆమె యింత వరకు యింత అందమైన మనిషిని చూడలేదు. 'ఫెయిరీ' అయి వుండవచ్చుననుకుంది. ప్రాస్పరోకాదని చెప్పాడు. అతను మనందరి లాంటి మనిషే, మనలాగే తింటాడు. నిద్రపోతాడు అన్నాడు. అతడు పడవలోని మనిషని, తన తండ్రి, మిగిలిన మిత్రులకోసం చూస్తున్నాడని చెప్పాడు.

ఫర్డినాండ్ దగ్గరగా వచ్చి మిరాండాని చూసాడు. అతను కూడా ఆమె ఏ దేవతో అయివుంటుందని అనుకున్నాడు. తను విన్నపాట యీ మె పాడిందేమోనని ఆమెను అడిగాడు. కాదని, తను అందరిలాంటి వ్యక్తినేనని చెప్పింది. ఆమె మాట్లాడ్డం ఫర్డినాండ్‌కి ఎంతో ఆశ్చర్యం కలిగించింది. ఆమెను చూడ్డంతోటే ఆమె అందం చూసి ఆమెని ప్రేమించాడు. మిరాండా కూడా అతణ్ణి ప్రేమించింది. ఇలా జరగాలని ప్రాస్పరో అనుకున్నదే. వాళ్ళిద్దరూ వివాహమాడాలని కూడా అనుకుని, వాళ్ళు ఒకళ్ళనొకళ్ళు చూసుకోవడానికే ఏరియల్ ద్వారా యీ విధంగా ఏర్పాటు చేసాడు. ఏరియల్ తను ఆశించిన విధంగా చేయగలిగినందుకు, ప్రాస్పరో అతణ్ణి వెంటనే విముక్తుణ్ణి చేస్తానని వాగ్దానం చేసాడు. ఈలోపున ఫర్డినాండ్ తన కూతురుని నిజంగా ప్రేమిస్తున్నాడా లేదా అని పరీక్షించదలుచుకున్నాడు. అందుకు ఫర్డినాండ్‌తో కోపంగా మాట్లాడాడు. అతను తనకి శత్రువన్నట్లుగా. తన ద్వీపాన్నించి తనని త్రోసివేసి, దానికి అధిపతి కావాలనే దురుద్దేశ్యంతో వచ్చాడని నిందించాడు. మిరాండా తండ్రితో అలా అతనితో అంత కఠినంగా మాట్లాడవద్దని ప్రతిమాలినా వినిపించుకోలేదు. తనతో తీసుకు వెళ్ళి, తన బానిసగా తీసుకుని, సంకెళ్ళలో వుంచుతాను రమ్మన్నాడు.

ఫర్డినాండ్‌కి కోపం వచ్చింది. రాజకుమారుడైన తనని అలా అవమానపరుస్తాడా అని కత్తి తీసాడు ప్రాస్పరో మీదకి. కాని కదల లేకపోయాడు. ప్రాస్పరో మంత్రశక్తి ముందు తన బలం ఎంత మాత్రం పనిచేయదని అర్థమయింది. మిరాండా మీద ప్రేమకొద్దీ, ప్రాస్పరో ఏపని చెయ్యడానికయినా సిద్ధపడ్డాడు. తన తండ్రి అతణ్ణి ఆ విధంగా బాధపెడుతున్నందుకు మిరండా చాలా సిగ్గుపడింది.

ఫర్డినాండ్‌తో ఏమీ భయపడవద్దని, తన తండ్రి చాలా మంచివాడని, తనకి ఏ హానిచేయడని మిరాండా చెప్పింది ఫర్డినాండ్ ప్రాస్పరో ఆజ్ఞాను సారం అతని వెంట గుహలోనికి వెళ్లాడు. అక్కడ అతనిచేత కేలిబాన్ చేస్తున్నటువంటి పనులే చేయించాడు. అయినా కూడా, అతనికి చెప్పిన పనులన్నీ ఎంత కష్టమయినవైనా సంతోషంగానే చేస్తున్నాడు. మిరాండాకి దగ్గరగా వుండగలిగినందుకు అతనికి సంతృప్తిగా ఉంది.

ఇదంతా మిరాండాకి ఎంతమాత్రం నచ్చలేదు. ఫర్డినాండ్ అలవాట్లు లేని పనులు అన్ని చేసి బాగా అలిసిపోతే, మిరాండాకి కళ్ళు నీళ్ళు తిరిగాయి. అతని పనిలో అతనికి సహాయపడనివ్వమని ప్రతిమాలింది. తన తండ్రి చదువులో నిమగ్నుడై ఉన్నాడన్నీ, మూడు గంటలు ఫర్డినాండ్ విశ్రాంతి తీసుకున్నా ఏ భయంలేదని చెప్పినా వినకుండా అతడు అలానే తన విధి నిర్వహణమటుకు మానలేదు. ఇదంతా నీ మీద ప్రేమతో చేస్తున్నానని ఆమెకి చెప్పాడు.

ఆమె ఆనందంతో నిజంగా నన్ను ప్రేమిస్తున్నావా అని అడిగింది. ఫర్డినాండ్ నిజమేనని చెప్పి, తిరిగి నేపుల్సుకి చేరుకున్న తరువాత ఆమెని తప్పకుండా వివాహమాడతానని కూడా వాగ్దానం చేసాడు.

"నా జీవితంలో నిన్ను చూడక ముందు నా తండ్రిని తప్ప ఇంకెవ్వరిని చూడలేదు. నాకు నువ్వు తప్ప యింకెవరితోను వివాహం చేసుకోవాలని లేదు" అని మిరండా తన మనస్సు అతనికి తెలియపరచింది.

వీరిద్దరి మధ్య జరుగుతున్న సంభాషణంతా, ప్రాస్పరో వాళ్ళకి కనపడకుండా విన్నాడు. ఫర్డినాండ్ తన కూతురిని నిజంగానే ప్రేమిస్తున్నాడని నమ్మకం కుదిరింది. తన మిరాండా అతని చేతుల్లో సుఖపడగలదని ధృవపడింది. వెంటనే వాళ్ళ ముందుకు వచ్చి కనపడి ఫర్డినాండ్‌తో నవ్వుతూ మాట్లాడాడు.

"నేను నిన్ను అతి క్రూరంగా, హింసపెట్టి వుంటే, అది కేవలం నీ ప్రేమ పరీక్షించడానికే. నాకిప్పుడు ఏ మాత్రం సందేహము లేదు. నువ్వు నేపుల్స్‌కి వెళ్ళిన తరువాత నా కూతురిని వివాహం చేసుకోవచ్చు" నని తన అంగీకారం తెలియజేశాడు ప్రాస్పరో. మిరాండా, ఫర్డినాండ్‌ల ఆనందానికి అవధులు లేవు.

ఇక ఓడలో వున్న వారి పరిస్థితి చూస్తే, రాజు ఆలంసో, తన కొడుకు ఫర్డినాంట్ మునిగి చనిపోయి వుంటాడని అనుకున్నాడు. ఫర్డినాండ్ మంచి యీతగాడని, ఆతను యీది వెళుతూంటే చూసానని ఎవరు ఏమిచెప్పినా రాజుకి మాత్రం నమ్మకం కుదరటం లేదు.

ప్రాస్పరో తమ్ముడు ఆంటోనియో, రాజుగారి తమ్ముడు సెబాస్టియన్ ఆలంసోతో కూర్చుని ఉన్నారు. వాళ్ళు ఎక్కడికి వెళితే అక్కడికి ఏరియల్ వాళ్ళని వెంబడిస్తూనే ఉన్నాడు. భయంకరమయిన శబ్దాలు చేస్తూ వాళ్ళని భయకంపితులను చేసి వాళ్ళకి పాలుపోకుండా చేసాడు. వారికి ఆకలిగా ఉంది. తినడానికి కాని, త్రాగడానికి కాని అక్కడ ఏదీ లేదు. ఆలాంసో,గొంజాలో యిక ఏదీచేసేదిలేక పడుకుని నిద్రపోయారు.

అన్నగారికి ద్రోహం తలపెట్టిన ఆంటోనియోకి యిప్పుడు ఒక దుర్మార్గపు ఆలోచన వచ్చింది. రాజు ఆలంసోని చంపి, ఆతడి తమ్ముడు సెబాస్టియన్‌ని రాజు చేద్దామనుకున్నాడు. ఇంతకంటె చక్కటి అవకాశం ఎక్కడ దొరుకుతుంది? రాజు, అతని స్నేహితుడు గొంజాలో కూడా గాఢ నిద్రలో ఉన్నారు. అక్కడ ఎవరూ లేరు. తను అపుడు ఏమిచేసినా ఎవరికి తనమీద అనుమానం రాదు.

ప్రాస్పరో తన మంత్రశక్తితో ఆంటోనియో, సెబాస్టియన్‌లు కలసి చేస్తున్న కుట్ర తెలుసుకున్నాడు. వెంటనే అక్కడికి ఏరియల్‌ని

పంపించాడు వాళ్ళని రక్షించడానికి. అదీ కాకుండా వాళ్ళని భయపెట్టి, ప్రాస్పరోకి, మిరాండాకి చేసిన అన్యాయానికి పశ్చాత్తాపం చెందేటట్లు కూడా చేయమని ఏరియల్ కి చెప్పాడు. అతడు సరిగ్గా అక్కడికి చేరుకునేసరికి ఆంటోనియో, సెబాస్టియన్ కత్తులు పట్టుకుని నిద్రపోతున్న రాజుకి దగ్గరగా సిద్ధంగా ఉన్నారు. ఏరియల్ ఆ సమయానికి రాజు గొంజాలో నిద్రనుంచి లేచేటట్లు చేసాడు.

అంతటితో రాజుని ఇంకా ఏరియల్ విడిచిపెట్టలేదు. అతనికి ఇంకా బుద్ధి వచ్చేటట్టుగా చేయాలి. అందుకు ఆకలితో బాధపడుతున్న వారి ముందు చక్కని భోజన పదార్థాలుంచాడు.

అవి తినబోతుంటే అవన్నీ మాయమయ్యేట్లుగాచేసి వాళ్ళ ముందు ఒక భయంకరమయిన పక్షిరూపంలో కనపడి వారిని "దుష్టత్రయం" అని దూషించాడు.

వారందరూ కలసి ప్రాస్పరోకి చేసిన మోసానికి యీ విధంగా శిక్ష అనుభవిస్తున్నారని కూడా చెప్పాడు. వాళ్ళు చేసిన పనికి పశ్చాత్తాప పడి ఇక ముందు అటువంటి పనులేవి చేయమని, బుద్ధిగా వుంటామని వాగ్దానం చేయాలన్నాడు. అలా వారికి చెప్పి ఏరియల్ అదృశ్యుడయిపోయాడు.

ఆ ముగ్గురు యిదంతా విని భయభ్రాంతులయ్యారు. అంతవరకు జరిగిన సంఘటనలన్ని చూసి, వాళ్ళు చేసిన నేరానికి తగిన శిక్షే అనుభవించవలసి వచ్చిందని తెలుసుకున్నారు. మళ్ళీ అటువంటి పనులు ఎప్పుడు చేయకూడదని నిర్ణయించుకున్నారు

చివరికి ప్రాస్పరో తన యింద్రజాల దుస్తుల్లో వాళ్ళ ముందు కన

పడ్డాడు. వాళ్ళు తగినశిక్ష అప్పటికే అనుభవించారని అనుకున్నాడు.

ఎవరూ ప్రాస్పరోని ముందు గుర్తించలేదు. ఆ దుస్తులు తీసివేసిన తరువాత గుర్తించి, తమ తప్పులన్నీ క్షమించమని, వెనక్కి మిలన్ డ్యూక్‌గా తిరిగి రమ్మని ప్రతిమాలుతున్నారు.

ప్రాస్పరో రాజు అలంసోతో "నువ్వు తిరిగి నా రాజ్యాన్ని నాకు ఇచ్చివేసావు కనుక, నేను నా ఋణం తీర్చుకుంటాను" అని చెప్పి రాజుని తన గుహలోనికి తీసుకువెళ్ళాడు.

అక్కడ తన కొడుకు ఫర్డినాండ్‌ను చూసి రాజు సంతోషం పట్ట లేకపోయాడు. అక్కడ ఉన్న అందమైన అమ్మాయి, ప్రాస్పరో కూతు రని తెలుసుకుని, ఆమెని, తన తండ్రిని అన్ని విధాలుగా కష్టపెట్టినందుకు క్షమించమని వేడుకున్నాడు. ఆ అమ్మాయినే తన కొడుకు వివాహం చేసుకోనడానికి నిర్ణయించుకొన్నాడని తెలుసుకున్నాక, రాజు మరీ సంతో షించాడు.

"ఇంతటితో మన కష్టాలన్నీ తీరినట్లే, జరిగినదంతా మర్చి పోదాం. ఇదంతా భగవదేచ్ఛ. మిలాన్ నుంచి నన్ను పంపివేసి, యీ చక్కటి ద్వీపంమీద వుండమని ఆదేశించినది ఆ భగవంతుడే. ఇక్కడే మిరాండా, ఫర్డినాండ్ ఒకర్ని ఒకరు ప్రేమించు కోవడం జరిగింది, అది కూడా భగవదేచ్ఛే. అందరం కలసి ఆ భగవంతుడ్ని ఆరాధిద్దాం" అని ప్రాస్పరో అందరిని ఉద్దేశించి చెప్పాడు.

ఆ మాటలు విన్న ఆంటోనియో సిగ్గుపడి, అన్నగారి ముందు విల పించాడు.

ప్రాస్పరో, వాళ్ళ ఓడ, అందులోని మనుషులు అంతా కూడా

క్షేమంగానే ఉన్నారని చెప్పాడు. మరునాడు ఉదయమే అందరూ నేపుల్స్‌కి బయలుదేరి వెళుతున్నట్లుగా వాళ్ళకి తెలియపరిచాడు.

ఆ ద్వీపాన్ని విడిచి వెళ్ళే ముందు తను సంపాదించిన ఇంద్ర జాల విద్యకి సంబంధించిన పుస్తకాలు, మంత్రదండం అన్నీ అక్కడే భూమిలో పాతేసాడు. తను మళ్ళీ ఆ శక్తులు ఏవీ వుపయోగించకూడదని నిర్ణయించుకున్నాడు. ఎందుకుపయోగించాలి? తను సాధింప దలుచుకున్న పన్నీ సాధించాడు. ఏరియల్‌ని పిలచి అతనికి విముక్తి కలిగించాడు. ఏరియల్ సంతోషంతో ఎగిరి వెళ్ళిపోయాడు.

(*)

# ఇందులో...


| వరుస నెం. | | తేదీలు | పేజీ నెం... |
|---|---|---|---|
| 1. | వెనిస్ వ్యాపారి<br>Merchant of Venice | 1-4-90 | 1 |
| 2. | హేమ్లెట్<br>Hamlet | 8-4-90 | 11 |
| 3. | నీ ఇష్టం<br>As you Like it | 15-4-90 | 22 |
| 4. | మేక్బెత్<br>Macbeth | 22-4-90 | 34 |
| 5. | పన్నెండవరాత్రి<br>Twelfth Night | 29-4-90 | 46 |
| 6. | లియర్ రాజు<br>King Lear | 6-5-90 | 59 |
| 7. | నడివేసవి రాత్రి కల<br>Midsummer Night's Dream | 13-5-90 | 70 |
| 8. | ఒథెల్లో<br>Othello | 20-5-90 | 82 |

| | | | |
|---|---|---|---|
| 9. | గయ్యాళిని లొంగదీయడమెలా | | |
| | Taming of the Shrew | 27-5-90 | 96 |
| 10. | జూలియస్ సీజర్ | | |
| | Julius & Caeser | 3-6-90 | 109 |
| 11. | గోరంతలు కొండంతలు | | |
| | Much Ado About Nothing | 10-6-90 | 121 |
| 12. | రోమియో అండ్ జూలియట్ | | |
| | Romeo & Juliet | 17-6-90 | 134 |
| 13. | తుఫాను | | |
| | Tempest | 24-6-90 | 148 |


( *ఆకాశవాణి, విజయవాడ కేంద్రంవారిచే ప్రసారం చేయబడిన తేదీలు)